# అపరాధ పరిశోధన

రు 3 మే '75

## సప్లిమెంట్



# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## రక్తకొండ
రచన: కంచర్ల రమణ

## జాడ తెలియని జయ!
రచన: సుజనశ్రీ

## ఇంటి దొంగలు
రచన: ఏ. పి. మోహన్రావ్

## ఆమె ఎవరు?
రచన: వసుంధర

"ఖైదీ" సీరియల్ - 12 వ భాగము

# అపరాధ పరిశోధన సప్లిమెంట్—17

మే, 1975

వెల: రు. 3-00

ఏడాది చందా 39 రూపాయలు

జీవిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:

**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**కంచర్ల రమణ**

కార్యాలయం:

**అపరాధ పరిశోధన కార్యాలయం**

నారాయణగూడ, హైదరాబాదు—29

ఫోన్—36959

# రత్తకొండ !!

## రచన: కంచర్ల రమ

చింతపల్లి నల్లకలువను గుర్తుకుతెస్తోంది. చుట్టూఉన
కొండలు రేకుల్లాఉంటే, మధ్యనున్న దుద్దులా ఉంది చిం
పల్లి ఊరు.

నర్సీపట్నం నుండి వచ్చేబస్సు కోసం యెదురుచూస్తూ అ
టికి పదకొండవసారి అలా అనుకున్నాడు రెడ్డి, చింతపల్లి
గురించి. !

రెడ్డి చింతపల్లి తాలూకాఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడ
ఉద్యోగంలో చేరాక, ఆ వూర్లోనే మొదట పోస్టయ్యాడు
అక్కడకు వచ్చి సుమారు సంవత్సరంకావస్తోంది.

రెడ్డి కింకాపెళ్లికాలేదు. కాలేజీచదువు పూర్తయిన వెంట
ఉద్యోగప్రయత్నంచేసాడు. దొరికింది. చేరిపోయాడు.

రెడ్డి చిన్నప్పటినుంచీ పట్నం వాతావరణంలో పెరిగి
వాడేమో, కొండలమధ్య జీవితం దుర్భరంగా వుంటుందని భావి
చాడుమొదట. కానీ, చింతపల్లిలో ఉండడం ప్రారంభించాక, ఆ
అభిప్రాయం దానంతటదే మారి పోయింది. అక్కడి నిర్మ
ప్రశాంత వాతావరణంలో ఇన్నాళ్లూ తనేం పోగొట్టుకొన్నాడో
అర్థంచేసుకొన్నాడు. ఆసంగతే, పదేపదే తన ఉత్తరాల్లో, తన
స్నేహితులకు బంధువులకు రాస్తూవచ్చాడు. కొన్నాళ్ల తనతో
పాటు చింతపల్లి ఏజన్సీ జీవితాన్ని అనుభవించి పలవరించమని
వాళ్లను చింతపల్లికి ఆహ్వానించాడు.

ఆ ఆహ్వానం అందుకొని రెడ్డి ముఖ్యస్నేహితులు, శాస్త్రి,
వర్మ, గుప్తవస్తున్నారు ఆవాళ. వాళ్ల కోసమే యెదురు చూస్తు

ప్నాడు రెడ్డి, బస్టాపులో నించుని.

పదింపావుకు రావాల్సిన బస్సు పావుతక్కువ పదకొండయినా లేదు.

ఊరకనే చిరాకెత్తిపోకుండా, కాసేపునీలికొండలవైపూ,కాసేపు ోడ్డువైపూ చూస్తూనిలుచున్నాడు.

ఇంకో అయిదునిముషాల టైము నత్తనడక నడిచింది. ోడ్డు చివరికంటూ, కొండలోకి చూపుసారించాడు.

స్సు కన్పించింది.

రెడ్డి మనస్సు ఆనందంతో వెర్రిగంతులువేసింది.

ఇంకోపదినిముషాల్లో బస్సు వచ్చి అతని ముందు ఆగింది. మరు చూస్తున్నట్టుగానే, అందులోంచి అతని స్నేహితులు ుగ్గురూ దిగారు.

కాలేజీనుంచి విడిపోయాక, వాళ్లను చూడ్డం అదే మొదటి రేమో, వాళ్లను కౌగలించు కొన్నంత పనిచేసాడు రెడ్డి.

2

మధ్యాహ్నంభోజనాలయ్యాక, కాసేపు విశ్రాంతి తీసుకున్నాక, డ్డి స్నేహితులు ముగ్గురూ మూకుమ్మడిగా అడిగారు.

"ఒరేయి! ఊరుచాలా బావుంది. వాతావరణం అంత కన్నా ంవుంది. కాని, మాకు థ్రిల్ అండ్ అడ్వంచర్ కావాలి. చెప్పు. మీమన్నా అవకాశంఉందా?" అని.

"అవే కావలిస్తే బడుద్దాయిలూ యీకొండల్లోకి యెందుకు వడం? మీరున్నచోటే దొరుకుతాయిగదా"! అంటూాతన తిలోని పెద్దస్టీలు కారియర్ టేబిలు మీద ఉంచాడు రెడ్డి.

"యేమిట్రోయ్ అది?" ఆతృతగా అడిగారు స్నేహితులు.

శాస్త్రి ముందుకొచ్చి, కారియర్ మూతతీసి చూసాడు. ందులో పచ్చనిగెంజి లాంటిద్రవం ఉంది.

"దీన్నిజీలుగుకల్లు అంటారు. వీరు యీరోజువర
త్రాగిన ఖరీదైన బీరులన్నీ దీనిముందు దిగదుడుపే" అని రె
హుషారుగా అనగానే "అద్గదీ! అలాగుండాలి. రానీరా! నాయన
అంటూ నాలుగుగ్లాసులు తెచ్చి టేబిలు మీద పెట్టాడువా
కేరియర్‌లోని జీలుగుకల్లు గ్లాసుల్లోకి వంపాడు రె
క్షణం ఆలస్యంచెయ్యకుండా.!
"చీర్స్!" అంటూ రెడ్డి స్నేహితులు గ్లాసులు యెత్తిపట
కున్నారు మరుక్షణంలోనే.
తనూటిగ్లాసు అందుకున్నాడు రెడ్డి., "ఛీర్స్!" చెప్పా
కాస్తపుల్లగా, కాస్తవగరుగా ఉన్నజీలుగుకల్లు పుక్కిట బ
చప్పరించి, గుటకేసి "వహ్వా!" అంటూ మెచ్చుకున్నాడు వ
అతనికి వంతపలికారు, శాస్త్రి, గుప్త.
అడపాతడపా నాలిక తడుపుకోవడం రెడ్డికి అలవాటుంది
జీలుగుకల్లు త్రాగడంఅదే ప్రథమం. జీలుగుకల్లు రు
అదిచ్చే కైపుగురించి తనకో క్లర్కు చెప్పినపుడు నమ్మ
పోయాడు.

అదిప్పుడు రుచి చూసాక, అతని మాటల్లో అతిశయో
అణు మాత్రంలేదని గ్రహించాడు రెడ్డి.
తన స్నేహితులకు వినూత్న అనుభవాన్నొకదాన్ని యి
గలుగుతున్నందుకు పొంగి పోయాడు లోలోన.
కల్లుకైపు మెల్లగా నసాళానికి యెక్కుతుంటే అడిగా
శాస్త్రి. "ఆ! యిప్పుడు చెప్పు! యింకేమిటి రుచిచూపిం
దల్చుకున్నావు మాకు".
"ముందిది కానీండిరా. ఆ తరువాత మాట్లాడుకుందాం
అన్నాడు రెడ్డి మూడోసారి గ్లాసులు నింపుతూ.
"అలా పనికిరాదు. చెప్పాల్సిందే." అన్నారు ముగ్గు

్రతులు ఒక్క సారిగా.

"అయితే...... తప్పదా?" యిబ్బందిగా మొహం పెట్టి న్నాడు రెడ్డి.

"అంతే" అన్నట్టుగా మొహాలు పెట్టారు రెడ్డి స్నేహి లు.

"ఇక్కడకు పాతిక మైళ్ల దూరంలో 'రత్నకొండ' అనే ొండ పల్లె ఉంది." చెప్పడానికి ఉపక్రమించాడు రెడ్డి.

దీక్షగా వినసాగారు అతని స్నేహితులు. "అక్కడ స్త్రీలు తిమ్మా కొండ స్త్రీల్లా ఉండరు. పచ్చగా, పొడుగ్గా ంటారు. సహజ సౌందర్య విషయంలో యే యితర ప్రాంతాల స్త్రీలకూ తీసి పోరట. ఈ స్త్రీలకున్న ప్రత్యేకత యేమంటే మ కిష్టమైన మగాడితో సంచరించే స్వాతంత్ర్యముందట. ులల మీద మోకాళ్ల దిగని మూరెడు ముతకగుడ్డ, రొమ్ము ్ర నామ మాత్రంగా కప్పుతూ ఆ భుజంమీద నుంచి యీ ుజంమీద కుండే రెండు బారల వల్లె వాటు తప్ప నగ్నంగానే వుపిస్తారట." ఆగాడు రెడ్డి, గ్లాసులోని ద్రవాన్ని త్రాగేం ుకు.

జిలుగు కల్లుకైపుకు రెడ్డి చెప్పే మాటలు తోడయ్యాయి. ్రతులకళ్లముందు అందమైన అమ్మాయిలు దిసమొలలతో ర్శన మిచ్చారు.

"ఒరేయే! మమ్మల్నక్కడికి తీసుకెళ్లరాదూ?" అడిగేసాడు ర్మ, యిహ ఉండ బట్టలేక.

"తీసుకెళ్లవచ్చు. కాని, ఆ ఊరు రోడ్డు ప్రక్కన లేదు. ూరంగా దట్టమైన అడవుల మధ్య, పర్వత సానువుల్లో ుక్కడికి పాతికమైళ్ల దూరంలో ఉంది." చెప్పాడు రెడ్డి.

"అంత అందమైన ఆడవాళ్లున్న ఊరు రోడ్డు ప్రక్కన

ఉండక అడవి మధ్యన ఉండడమేమిటి?'' అన్నాడు శాస్త్రి చేతికి చిక్కినదేదో జారి పోయిన వాడిలా, నిరాశగా.

''అందమైన పువ్వులు చెట్ల కొమ్మల మీద ఉంటాయి వాటి వేళ్లలో ఉండకుండా. ఎందుకు'' వాఖ్యానించాడు గుప్త.

జీవితాన్ని ఒ పుస్తకం లాగు చదివి, దాంట్లో తను చదిన ప్రతి విషయాన్ని సాకల్యంగా ఆకళింపు చేసుకోవాలనే తత్త్వ గలవాడు గుప్త. అతని మొహం చూస్తుంటే, ఏదో దీరా లోచన చేస్తున్నట్లనిపిస్తుంది.

''నీ వేదాంతంతో మా హుషారు చెడగొట్టకురా'' కసుర కున్నాడు వర్మ.

''అది కాదురా. రత్తకొండ అనే పేరు ఎక్కడో చది నట్టు లేదా ఎవరో చెప్పగా విన్నట్టు గుర్తుంది. కాని యెక్కడ చదివానో, యెవరు చెప్పగా విన్నానో గుర్తు రావడ లేదు'' అన్నాడు గుప్త.

అతడి మాటలు మరి పట్టించుకోకుండా ''యింకా చెప్పరా ఆ వూరు గురించి'' అంటూ రెడ్డిని తొందర చేసారు శాస్త్రి వర్మ.

''ఇహ చెప్పడానికేం లేదు. ఆ స్త్రీలు మనల్నెవరైనా నచ్చుకుంటే మామూలు విందు భోజనంతో పాటు వలపు విందుకూడా చేస్తారు. లేదా మనల్ని వెనక్కి తిరిగి పొమ్మం టారు. మనం యేమన్నా, దురుసుగా, మూర్ఖంగా ప్రవర్తి చామా, మన తలకాయలు ఉండవలసిన చోటున ఉండవు,' చెప్పడం ముగించాడు రెడ్డి.

వర్మకు కోపం ముంచు కొచ్చింది.'' ఎవడు చెప్పాడ్రా నీ కథ?'' అంటూ లేచాడు రెడ్డి మీద.

అతడ్ని తిరిగి కూచో బెడుతూ ''ఒరేయ్, ఎవడో చెప్పాడ

నాకు. నేను నీకు చెప్పాను. నమ్మ్మి, లేక పోతే మానెయ్'' అన్నాడు రెడ్డి.

''నమ్మడం నమ్మక పోవడం యెందుకు? నేను అక్కడికి వెళ్తాను. మీరందరూ వస్తారా లేదా?'' అన్నాడు వర్మ ఆవేశంగా.

''నేను మాత్రం రాలేను. ఆఫీసులో యినస్పెక్షనుంది కొద్ది రోజుల్లో. శెలవు రెండు రోజులకు మించి దొరకదు'' చెప్పాడు రెడ్డి తన సంగతి.

''మరి మీరేమంటార్రా ?'' గుప్త, శాస్త్రిలవైపు చూసి. అన్నాడు వర్మ

ఆ యిద్దరూ వెంటనే జవాబు యివ్వలేదు.

రెండు నిముషాల మవునానంతరం గుప్తా అన్నాడు.

'రెండ్రోజులు వుండ డానికే వీలు చూసుకుని వచ్చాను. రత్త కొండకుపోయి రావాలంటే రెండు రోజులు పడుతుంది. ఇహ, అక్కడ ఒక్క రోజన్నా ఉండక పోతే యేంబావుంటుంది. నాకు కూడా వీలు పడదు. నేనూ రాలేను. సారీ?'' వర్మకు మళ్ళా కోపం అందుకుంది.

''కోమటి పిరికి అని అనిపించుకున్నావురా యెలాగయినా. మీరెవ్వరూ రాకపోయినా, నే నొక్కడ్నే వెళ్తాను. ఈ రెడ్డి గాడి కట్టుకథ సంగతి తేలుస్తాను......ఒరేయ్, నువ్వే మంటావురా శాస్త్రి?'' అన్నాడు శాస్త్రివైపు చూసి.

శాస్త్రికి రత్తకొండ వెళ్లి అక్కడి స్త్రీలను చూసి అను భవం గడించుకురావాలనుంది.

''రెడ్డి అన్ని యేర్పాట్లు చేస్తే, నేను రావడానికి సిద్ధమే'' అన్నాడు శాస్త్రి.

''అదీ అలాగుండాలిరా. నాకు నచ్చావురా బాగా'' వర్మ

శాస్త్రిని ఆకాశాని కెత్తేసాడు మెచ్చుకోలుగా.

తాము వెళ్లకపోయినా, వర్మతో కలిసి వెళ్లడానికి శాస్త్రి అంగీకరించినందుకు ఆనందించారు గుప్త, రెడ్డి.

వర్మ, శాస్త్రి రత్తకొండ వెళ్లడానికి మరునాడు యేర్పాట్లు చెయ్యడానికి ఒప్పుకున్నాడు రెడ్డి.

వర్మ, శాస్త్రి అటు రత్తకొండ వెళ్లగానే, తను విశాఖ పట్నం తిరిగి వెళ్లిపోతానని చెప్పాడు గుప్తా.

# 3

వర్మ, శాస్త్రి రత్తకొండ వెళ్లడానికి కావాల్సిన యేర్పాట్లు చెయ్యడానికి రెండు రోజులు పట్టింది రెడ్డికి.

పాతిక మైళ్లు ఏకబిగిన ప్రయాణం చెయ్యడానికి ఎవరూ ముందుకు రాలేదు, రోజుకు పది రూపాయల కూలీ ఆ చూపినా. వర్మ, శాస్త్రి కూర్చుని ప్రయాణం చెయ్యడాని రెండూ, వారి సామాను మోసుకుని తీసుకెళ్లడానికి ఒకట మొత్తం మూడు కంచర గాడిదలు కావాలి. రోజుకు, వాట దాణా ఖర్చుపోను, అయిదు రూపాయల అద్దెకు, దొరికాయ ప్రయత్నించగానే.

ఎలాగయితేనేం, రెండో రోజు మధ్యాహ్నం రత్తకొండక గైడ్సుగా రావడానికి యిద్దరు కొండ వాళ్లు ఒప్పు కున్నారు

త్రోవలో తినడానికి కావాల్సిన రొట్టెలు, పళ్లు కొని పెద్ద మూట కట్టారు. రెండు మూడు సొరకాయలనిండా నీళ్లు పట్టుకున్నారు. దారిలో దాహం వేస్తే త్రాగడానికి.

రత్తకొండకు ప్రయాణం మొదలైంది.

గాడిదలమీద కూర్చున్నారు, వర్మ, శాస్త్రి. వాటికి కట్టి కళ్లేల్ని పట్టుకుని గైడ్సు నడుస్తున్నారు.

గాడిదలమీద యెక్కి ప్రయాణం చెయ్యడం మొదట

కొత్తగా ఉన్నా ఆ తరువాత మామూలుగా అనిపించింది.

ఎక్కడో లోయల్లోగాని, నీటి ఊటలుగాని, సెలయేళ్ళుగాని ఉండడం లేదు. లోయల్లోకి పోయి నీళ్ళు తేవడం చాలా ప్రమాదకరం. అక్కడ జంతువులు పొంచి ఉండి, నీరు త్రాగ డానికి వచ్చిన మనుష్యుల్ని ఎదుర్కోవచ్చు.

అలాంటి పరిస్థితుల్లో, తమ సొరకాయల్లోని నీళ్ళు అయి పోతేనో?.........సందేహం కలిగింది శాస్త్రికి.

తమతో వస్తున్న కొండవాళ్ళను అడిగాడు.

"అలాగెప్పుడూ జరగదు బాబూ, మేం అంత దూరం పోము. మాకు తెలిసిన ప్రాంతాలకే......అంటే, నీళ్ళుయెక్కడ దొరుకుతాయో, దొరకవో తెలిసిన ప్రాంతాలకే వెళ్తాము. ......సొరకాయలనిండా వేడి గెంజి వేసుకునిపోతే...... దాహం వేస్తున్నప్పుడు కొంచెం కొంచెం త్రాగుతే......నీళ్ల అవుసరం ఉండదు......అయితే......దేముడు అన్నీయిచ్చాడు బాబూ మనిషికి......'ఇండుగ బద్ద' అని వుంటుంది బాబూ. దాన్ని తెగ్గోస్తే, పెద్ద కడవనిండా నింపుకోగలిగే నీళ్ళుకార్తాయి అందులోంచి. ఆ నీరు కాస్తవగరుగా ఉంటుందిగాని, మన దప్పికపోతుంది ఆ నీటితో" చెప్పాడు కొండవాడు.

కొంత దూరం అడవిలో ప్రయాణం అయ్యాక, కొండ వాడు ఒక ఇండుగ బద్దని చూపించాడు. వర్మ కోరిక మీాద, దాన్ని నరికి, అందులోంచి యే మాత్రం నీరు వస్తుందో కూడా చూపించాడు.

వచ్చిన నీరు వృధా పోనివ్వకుండా, తాము త్రాగినంత త్రాగి మిగతాది, కాళీ అయిన సొరకాయల్లో నింపారు కొండవాళ్ళు.

మధ్యాహ్నం ఒంటిగంట అయ్యేసరికి, మూడు కొండలు యెక్కి దిగి పోయారు.

కొండవాళ్లు తమకోసం గెంజీ అన్నం తెచ్చుకున్నారు. అయినా, తాము తెచ్చుకున్న పథార్థాల్లోంచి కొన్ని కొండవాళ్లకు యిచ్చారు శాస్త్రి, వర్మ.

కృతజ్ఞతా పూర్వకంగా అందుకుని వాటిని తిన్నారు కొండ వాళ్లు.

భోజనాలయ్యాక, చెట్లనీడల్లో ఒకగంటసేపు విశ్రమించాక, మళ్లీ ప్రయాణం ఆరంభించారు వాళ్లు.

"ఇంకా యిక్కడనుంచి యే మాత్రం దూరముంటుంది రత్తకొండ" అడిగాడు వర్మ.

"ఇంకో పది మైళ్లు ఉంటుంది బాబూ, సాయంకాలం అరవుతుండగా వెళ్లిపోతాం రత్తకొండ. కొంచెం ఆలస్యమైనా ఫరవాలేదు. వెన్నెల రాత్రుళ్లుకదా బాబూ, ఎంతో బావుం టుంది అడివి" చెప్పాడు కొండవాడు.

"అబ్బ! యింకా పదిమైళ్ళే!" అన్నాడు శాస్త్రి.

కొండవాళ్లు చెప్పినట్టుగానే ప్రయాణం కాస్త ఆలస్యం అయింది. రత్తకొండ కొద్దిదూరంలో ఉండగానే చీకటి పడింది. వెన్నెల వచ్చింది.

పాల వెన్నెల్లో స్నాన మాడుతున్న అడవిని చూస్తుంటే, అనిర్వచనీయమైన ఆనందంతో ఉప్పొంగాయి, వర్మ శాస్త్రి మనస్సులు.

పెంకితనం కొద్దీ మొదలు పెట్టిన ప్రయాణం వృథా కాలేదనుకున్నారు.!

రాత్రి ఏడున్నర కావస్తుండగా, రత్తకొండ గ్రామాన్ని సమీపించారు.!!

# 4

నాలుగయిదు మైళ్లల్లో రత్తకొండ ఊరు వస్తుందనగా ఆ ప్రాంతపు నైసర్గిక స్వరూపంలో ఏదో మార్పువచ్చి

నట్టయ్యింది.!

ఎగుడు దిగుళ్లతో, దట్టమైన చెట్లతో నిండిన కొండలు, సమతల ప్రదేశంగా మారి పోయినట్టయింది. కనుచూపు మేరవరకూ పైర్లతోనిండిన పొలాలు, పళ్లతోటలు, వాటి మధ్యలో గుడిసెల్లో మినుకు మినుకు మంటూ దీపాలు అవు పించాయి.!

తాము అడవుల్లో గాకుండా కోస్తా జిల్లాలోకి ఏదో పల్లె ప్రాంతంలో ఉన్నట్టుగా ఉంది అనుకున్నాడు వర్మ.

రత్తకొండ ఊరిలో ప్రవేశించగానే, కొడవళ్ల లాంటి ఆయుధాలు చేత బట్టుకుని, పొడుగ్గా, బలిష్టంగా, మగ రాయుళ్లలా ఉన్న యిద్దరాడవాళ్లు ఎదురయ్యారు.

నాగరిక ప్రపంచంనుంచి వచ్చిన యిద్దరు యువకుల్ని, వారి గైడ్నుని తేరి పారచూసి ఆగమని సైగ చేసారు.

"ఎవరు మీారు? ఎక్కడికి వెళ్తున్నారు?" అధికార స్వరంతో అడిగారు, ఆ ఆడవాళ్లు.

శాస్త్రి వెంటనే జవాబివ్వడానికి సిద్దమవుతుంటే, ఆపి "మమ్మల్నిలా ఆపడానికిగానీ ప్రశ్నించడానికిగానీ మీారెవరు?" అడిగాడు వర్మ.

"మేం కొండ రాణిగారి భటులం, మా గ్రామంలో ప్రవే శించే క్రొత్తవాళ్లను నిలిపి ప్రశ్నించే అధికారం మాకుంది. మాకు జవాబివ్వకుండా ఒక్కడుగు ముందుకు వెయ్యలేరు" చెప్పిందొకామె.

అప్పుడు చెప్పాడు వర్మ, తామెవ్వరో, అక్కడికి ఎందుకు వచ్చారో.

"అయితే, మాతోరండి. కొండరాణి వద్దకు తీసుకెళ్తాం." అన్నారు ఆ కొండస్త్రీలు.

వర్మ 'సరే', అని అనగానే, వార్ని ఆ స్త్రీలు కొండ రాణి వద్దకు తీసుకెళ్ళారు.

ఊరు నలుచదరాకారంతో వుంది. మధ్యలో ఒ పెద్ద గుడిసె ఉంది.

దాని తీరు తెన్నులు చూసి, అదేకొండరాణి నివాసం అయ్యుంటుదని అర్థం చేసుకొన్నాడు వర్మ.

బాటసార్లను బయటనిలిపి, లోనికి పోయి రాణి అనుమతి పొంది వచ్చాకగాని, వారిని లోనికి తీసుకెళ్ళలేదు కొండస్త్రీలు

వెదురు బద్దలతో చేసిన, సోఫా అంత వెడల్పున్న కుర్చీలో నలబై, నలబై అయిదేళ్ల వయస్సులో ఉన్న ఓ స్త్రీ కూర్చుని ఉంది. ఆమె కిరువైపులా వెలుగుతున్న కాగడాలవల్ల, ఆ గుడిసెంతా వెలుగుతో నిండివుంది. ఆమెకు నడుం భాగం వద్ద యెర్రని ముతక గుడ్డ చుట్టబడి ఉంది. వక్షో భాగం మీద యేలాంటి గుడ్డ లేకపోయినా, పెద్ద పెద్ద లోహపు రింగులు, పూసలపేర్లు కప్పి ఉన్నాయి. కొడవలి ఆకారంలో ఉన్న చిన్న కత్తి ఆమెకు కుడి ప్రక్క నడుంకు వ్రేలాడుతోంది

"మీరు మా అతిథులు. అలా కూచోండి" అంది రాణి చిరునవ్వు నవ్వుతూ.

వెదురు బద్దలతో చేసిన చిన్న స్టూల్స్ అవుపించగానే వాటిమీద కూర్చున్నారు శాస్త్రి, వర్మ.

వారు కూర్చోగానే, మళ్ళా రాణి మాట్లాడింది.

"మా వూరు చూడాలని వచ్చారట. యేముందిక్కడ? అడవి, కొండలు తప్ప" అంది రాణి.

"మాకు కొత్త కొత్త ప్రదేశాలు చూడాలన్నా, కొత్త మనుషుల్ని కలుసుకోవడమన్నా మహాసరదా. అందుకే యిలా వచ్చాం. మీ కభ్యంతరం లేకపోతే యిక్కడ రెండు రోజు

లుంటాం'' అందంగా అబద్ధం చెప్పాడు శాస్త్రి, తాము వచ్చిన కారణం గురించి.

''బావుంది. మంచి సమాధానం చెప్పావు'' అన్నట్టు శాస్త్రిని చూసి నవ్వాడు వర్మ.

''అలాగే'' అంది కొండ రాణి.

ఆ క్షణంలో యెందుకో రాణి మొహంలో అవ్యక్తమైన ఆనందం తొణికిస లాడుతోంది.

నాగరికంగా, అందంగా అవుపించే మగాళ్లను చూసి ఎన్నాళ్లయిందో వాళ్లకు? కొంపదీసి......తమను చూసి ఆమెకు కోరిక రగలడం లేదుగదా?......చీ, చీ, ముసల్ది. దీనితో సరస మేమిటి? అనుకున్నాడు వర్మ, రత్తకొండ స్త్రీల గురించి రెడ్డి చెప్పింది గుర్తొచ్చి.

రాణి తన కుడి ప్రక్కనున్న ద్వారంవైపుకు తిరిగి, చప్పట్లు చరిచి ''ఏయ్'', అంటూ కేకేసింది.

మరు క్షణంలో అక్కడ యిద్దరు స్త్రీలు ప్రత్యక్ష మయ్యారు. కొండరాణి వాళ్లతో తమ భాషలో ఏదోచెప్పింది. వారు తలూపి వెళ్లి పోయ్యారు.

అ తరువాత మళ్ళీ నవ్వు మొహంతో శాస్త్రి, వర్మలవైపు తిరిగి ''ఇవాల్టికి నాలుగు రోజుల తరువాత పౌర్ణమినాడు మా కొండదేవత కపాలేశ్వరి పూజ జరుగుతుంది. జాతర మహా వైభవంగా ఉంటుంది. మీరూ చూస్తారా'' అంది కొండ రాణి.

క్షణంపాటు వర్మ, శాస్త్రి ఒకరి మొహాలొకరు చూసు కొన్నారు.

కొండ రాణి చెప్పిందానికి అంగీకరించమని శాస్త్రి కనుసైగ చెయ్యగానే ''చాలా సంతోషం. చూస్తాం. కాని, నాలుగు

రోజులకు సరిపడా ఆహారపదార్థాలు తెచ్చుకోలేదు. పైగా మాతో వచ్చిన గాడిదలు, గైడ్సుగా వచ్చిన కొండవాళ్ళు, రెండు రోజులకోసమే అని తీసుకొచ్చాం'' అని చెప్పాడు వర్మ.

''తిండి గురించి ఆలోచించకండి. మీరు మా అతిథులు. ఇహ, జాతర అయిపోయేక, మేమే మాగాడిదల్ని, మా మనుషుల్ని యిచ్చి పంపించుతాం. మీరు ఆ కొండ వాళ్లను వెనక్కి పంపేయండి,'' చెప్పింది కొండ రాణి.

''అలాగే కానివ్వండి'' అన్నాడు వర్మ.

ఇందాక రాణి పిలవగానే వచ్చి, ఆజ్ఞలందుకుని వెళ్లిన స్త్రీలు మళ్లీ అవుపించారు. వాళ్ళు కనిపించగానే ''మీ కోసం అన్ని యేర్పాట్లు జరిగాయి. మీరు పోయి విశ్రాంతి తీసుకోండి. ఉదయాన్నే గాడిదల్ని, కొండవాళ్లను పంపెయ్యండి'' చెప్పింది రాణి.

తలూపిలేచి, ఆ స్త్రీలను అనుసరించారు శాస్త్రి, వర్మ.

# 5

శాస్త్రికీ, వర్మకీ వేర్వేరు యిళ్ళు యివ్వబడ్డాయి. వారితో పాటుగ వచ్చిన గైడ్సుకు ఒక యిల్లు యివ్వబడింది.

ప్రతీ యింటిలోనూ, వెదురు బొంగులు వరుసగా పేర్చి తయారు చేసిన ఒక మంచం, మూడు నాలుగు పీటలు అమర్చబడి ఉన్నాయి.

పడుకుంటే మెత్తగా ఉండేందుకు, ఒత్తుగా గడ్డి, దాని పైన ఎలుగు చర్మం పరచ బడింది.

తమతో పాటుగ తెచ్చిన రగ్గులు, దుప్పట్లు ఆ మంచం మీద పరిచాడు వర్మ. బాగానే వుందనిపించింది కాసేపు. కాని, సుఖంలేదు.

గోరువెచ్చని నీళ్లల్లో స్నానం చేసాక, కొండరాణి పంపిన ఉడుకుడుకు వెదురు బియ్యపు అన్నం, లేడి మాంసంకూరతో తిన్నాక, అతనికి సుఖంగానిద్ర పట్టి ఉండాల్సిందే. ఎందుకో నిద్ర అతడ్ని వెలివేసినట్టుగా, కళ్లు బరువెక్కి మగతగా వుంటుందిగాని, నిద్ర రావడంలేదు.

రాత్రి పది గంటలు కావస్తున్నా, మంచంమీద అటూ యిటూ దొర్లుతూనే వున్నాడు వర్మ.

పది నిముషాలు గడిచాయి. తలుపు కిర్రుమన్న చప్పుడయ్యింది. వర్మ తలుపు వైపు చూసాడు.

పద్దెనిమిదీ యిరవై యేళ్లున్న ఒక స్త్రీ లోనికి రావడం గదిలో ఓ మూలగా వెలుగుతున్న కాగడా కాంతిలో కనిపించింది.

ఆమె చేతిలో చిన్న మట్టిపాత్ర ఉంది. ఆమెను చూడగానే లేచి కూర్చున్నాడు వర్మ.

ఆమె కురుల్ని నున్నగా దువ్వుకుని ముడిచుట్టింది. తిన్నగా నెత్తిమీదున్న ఆ ముడి, మునికన్యను తలపింప జేస్తోంది. చంద్రంగా బలిష్టంగా యెదిగి కండల్లా అవుపించే ఆమె బొమ్మలు, ఏ ఆచ్ఛాదనా లేకుండా బరువుగా వూగాయి, ఆమె కదలి వస్తుంటే నడుం భాగాన్ని మాత్రం మూరెడు పడ్డలీలగా మాత్రం కప్పుతోంది.

ఏ అనుభవం కోసమయితే, యింత దూరమొచ్చాడో తను, అది క్షణాల్లో లభ్యం కాబోతోంది. వర్మ గుండెల్లో ఆవేశం పొంగులు వారింది.

“నిద్ర రావడంలేదు కదూ?” అందామె లోనికి వస్తూ. ఆమె పెదాలమీద లేత వెన్నెల్ని పోలిన నవ్వుంది. తన చేతిలోని మట్టి పాత్ర ఒక వెదురు పీటమీద ఉంచింది.

“అవును, నీకెలా తెలుసు?” అన్నాడు వర్మ, తనకూడా

నవ్వుతూ.

"మాకు తెలుసు. మీరు నాగరికులు......నడక అలవాటు బహుతక్కువ మీకు......మీ పట్నవాసులు యింత దూరం వస్తే బడలికవల్ల నిద్రరాదు." అందామె వర్మకు చేరువగా వస్తూ.

అతని నరాల్లో రక్తం నయాగరా జలపాతంలా ఉరకలు దీస్తోంది.

"ఒహో, అలాగా?" అన్నాడు మత్తుగా.

"అంతేగాదు. మీరు వస్తున్నట్టు కూడా మాకు తెలుసు" అందామె.

అతని మత్తు వదలి పోయింది. "మేం వస్తున్నట్టు తెలుసా? అదెలా?" అడిగాడు ఆశ్చర్యంగా.

"మీరు బాగా అలసిపోయి ఉన్నారు. విశ్రాంతి తీసుకోండి ముందు" అంటూ అతడ్ని మంచంమీద పడుకోబెట్టింది. ఒంటి మీదున్న బట్టలన్నింటినీ తీసేసి, పొందికగా ఓ మూలన బెట్టింది.!

అతన్ని బోర్లగిలా పరుండబెట్టి, మట్టిపాత్రలో తనతో పాటుగ తెచ్చిన నూనె అతని ఒంటికి రాసింది.

ఆ తరువాత ఒంటిమీదున్న ఒక్కోకండను మునివేళ్లతో నొక్కి వదులుతూ, అరచేతితో రుద్దుతూ, వేళ్లతో సుతారంగా రాస్తూ మర్దనా చెయ్య సాగింది ఆమె.

నరనరంలో పేరుకుపోయిన టెన్షన్ మెల్లగా మెత్తబడి చర్మ రంధ్రాల్లోంచి వెలికి వస్తున్నట్టుగా అనిపిస్తోంది వర్మకు.

తన ఒంటిని మాసేజ్ చేసి నిద్ర పుచ్చడానికి వచ్చిందామె అని గ్రహించాడు వర్మ.

అయినా, ఆమెను అనుభవించాలని కోరిగ్గా ఉంది వర్మకు.

ఆమె తనను నిద్రపుచ్చి చల్లగా వెళ్లిపోతే, తన కోరిక
ారే దెలా?

లమెను మాటల్లోకి దించడానికి నిశ్చయించుకున్నాడు వర్మ.

"నువ్వు నాకు ఎంతో సేవ చేస్తున్నావు......నిన్ను జన్మ
ున్మలకు మర్చిపోలేను.......ఇంతకీ నీపేరేమిటి?" మెల్లగా
ంభాషణ మొదలు పెట్టాడు వర్మ.

"మీరు విశ్రాంతి తీసుకోవాలి. మాట్లాడ కూడదు."
ుసగుస లాడుతున్నట్టుగా అందామె. గట్టిగా మాట్లాడితే,
ున నిద్ర చెడుతుందనే ఆమె భయంకాబోలు,.

"ఫరవాలేదు ఇప్పుడు నేను తీసుకొంటున్నది విశ్రాంతేలే
వ్వు. నీపేరేమిటి?" అడిగాడు వర్మ.

"రాగిణి" చెప్పిందామె.

"అదేమిటి? మీ కొండవాళ్లకు విచిత్రమైన పేర్లేవో
ంటాయనుకున్నాను."

"లేదు. మేం మాట్లాడేది సంస్కృతం......మీ పేర్ల
న్నా అందమైన పేర్లుంటాయి మాకు".

రెండు నిముషాలు మవునంగా సాగాయి.

అతడి ఆలోచనలు మళ్లా ఆమెను అనుభవించడం వైపుకు
ుళ్లాయి.

"నేనిలా నగ్నంగా వున్నానుగదా. నీకేం అనిపించడం
దా?" అన్నాడు వర్మ.

"మాకేం అనిపించదు. మీరు వెల్లకిలా తిరిగినా" జవా
చ్చిందామె.

ఇప్పుడు రాగిణి, తన బలమంతా ప్రయోగించి అతని
ుంమీద మర్దనా చేస్తోంది. అప్పుడప్పుడు ఆమె చేతులు
రలకు తగిలి, పులకింతగా గూడా ఉందతడికి.

# 1

"యేం? మీరు ఆడ వాళ్ళు కారా? మీలో స్త్రీత్వ లేదా?" వర్మ సూటిగా అడిగేసాడు. యింకా దాపరి మెందుకని.

"మాలో స్త్రీత్వం లేకపోతే, పిల్లల్నెలా కంటున్నాం తల్లులమెలా అవుతున్నాం?" అంటూ అతడ్ని ఆమె వె కిలా త్రిప్పింది. అతడి గుండెల మీద, పొట్టమీద నూ రాసి, మర్దనా మొదలు పెట్టింది.

"మరి?...........నా అనుమానం తీరలేదు" అన్నాడ వర్మ, రెండు నిముషాలు ఆమె పనికి అడ్డంరాకుండా మౌన వహించి.

"పిల్లల కోసమే మేం మగాడ్ని దగ్గరకు రానిస్తాం మిగతా సమయాల్లో మా కోర్కెలు తీర్చుకోవడానికి స్త్రీల ఉపయోగించుకుంటాం," చెప్పిందామె.

ఒరి దేవుడా, వీరందరూ లెస్బియాన్సా? మగాడ్ని బ్రీడిం బుల్ లా వాడు కోవడం వీళ్ల ఆచారమా?......వర్మ అవాక్కయి పోయాడు.

"మరి మగాళ్ల కోరికల మాటేమిటి?" రెండు నిముషా తరువాత అడిగాడు వర్మ.

"అంతే, పిల్లలకోసం యే ఆడదో పిలిచేంతవరకూ ఆగ ల్సిందే".

"ఆగలేక, అతడు బలవంతం చేస్తే?"

"అతడు ప్రాణాలు వదులు కోవాల్సి వస్తుంది."

"అంటే?"

"ఆ ఆడదే తన వద్దనున్న చక్రాయుధంతో ఆ మగాడ్ని వధించవచ్చు. లేదా రాణికి ఫిర్యాదు చేస్తే, ఆ పని, రాణి చేయిస్తుంది తలార్లను పిలిచి".

భయంతో వర్మ గుండెలు బిగ బట్టు కున్నాయి.

ఆ క్షణం వరకూ అతనిలో పడగలెత్తి బుస కొడ్తున్న
రిక చప్పున తగ్గి పోయింది.

కాని, పొట్టమీద, తొడలమీద తమాషాగా కదుల్తున్న
మె చేతి వేళ్లు, అతడి మగతనాన్ని మళ్లా రెచ్చగొట్టాయి.
గిణి అతడి పాదాలు వత్తడం కూడా పూర్తి చేసింది.
ంత్తుగా కళ్లు మూసుకున్న అతన్ని చూసి, అతడికి నిద్ర
ట్టేసిందను కుందామె.

చప్పుడు చెయ్యకుండా వెనుదిరిగింది. మెల్లగా అడుగు
సుకుంటూ ద్వారంవద్దకు వచ్చింది.

ఆమె గుమ్మందాటితే, ఒక బంగారు అవకాశం చెయి జారి
తుందనుకున్నాడు.

ఒక్క ఉదటున లేచి, ఆమెను తన చేతులతో బలంగా
ట్టేసి, ఆమెను తన వైపుకు తిప్పుకున్నాడు.

రాగిణి అతడి వైపుకు తిరుగుతూనే, కుడి చెయ్యి గోడీగా
ట్టి, అతడి మెడనరాల మీద గట్టిగా కొట్టింది.

వెంటనే అతడు స్పృహ కోల్పోయాడు.

నేలమీద కుప్పగా కూలిన వర్మను అవలీలగా యెత్తి,
ంచం మీద పడేసి, తలుపు దగ్గరగా చేరవేసి వెళ్లి
యింది రాగిణి.

ఉదయం తొమ్మిదయాకగాని వర్మకు మెలకువ రాలేదు.

ఒళ్లంతా పువ్వులా తేలిగ్గా, మనస్సంతా గాలిలో ఎగురు
న్న పక్షిలా హుషారుగా ఉంది.

వర్మ లేచి మంచంమీద కూర్చునేసరికి, రాత్రి తనకు
ర్యలు చేసిన అమ్మాయే యెదురుగా వచ్చి నవ్వుతూ నిలు

చుంది.

ఆమె ఉదయం యెప్పుడు లేచిందో, కాల కృత్యాలు దీర్చుకుని యెప్పుడు ముస్తాబయిందో యేమో, అప్పుడే కడిగిన ముత్యంలా మెరిసి పోతోంది.

"చాలా ప్రొద్దెక్కిపోయింది. లేవండి. రాణిగారు మీ కోసం యెదురు చూస్తున్నారు......నిన్న మీతో వచ్చిన కొండవాళ్లు యీపాటికి ఒక కొండ దిగిపోయి ఉంటారు" అందామె నవ్వుతూ.

అంటే, గైడ్సు, గాడిదలు వెళ్లిపోయాయి. మనస్సులో నోట్ చేసుకొన్నాడు వర్మ.

రాత్రి జరిగిన సంఘటన గుర్తు కొచ్చింది. ఆమె మొహం లోకి చూసాడు. అక్కడ యెలాంటి భావమూ లేదు.

వర్మ మంచం దిగాడు. కాల కృత్యాలు తీర్చుకున్నాడు. కొన్ని పళ్లు, వెదురు బియ్యంతో చేసిన యేదో వంటకం ఉంచిన పళ్లెం అందించింది రాగిణి. తిని, మంచి నీళ్లు త్రాగాడు తృప్తిగా.

"రాత్రి నేను చేసిన పనికి నాకు చాలా విచారంగా ఉంది" అన్నాడు వర్మ. రాత్రి పోగొట్టుకున్న తన మంచితనాన్ని రాబట్టుకోవాలని అతని ఆలోచన.

"మీరు మా అతిథులు. మా ఆచార వ్యవహారాలు. అలవాట్లు నమ్మకాలు మీకు తెలియవు. అందుకే అంతటి తో వదిలేసాను మిమ్మల్ని. అదే, యీ గూడెంలోని యింకో మగాడలాచేస్తే, ఆ క్షణంలోనే వాడి తల నరికేదాన్ని" అంది రాగిణి.

చావు వెంట్రుక వాసిలో తప్పినందుకు, వర్మ గుండెలు జల దరించాయి.

రాగిణి ముందు త్రోవదీయగా, ఆమెను అనుసరించాడు వర్మ.

వర్మను కొండ రాణివద్ద వదిలి, రాగిణి శెలవు తీసుకుని వెళ్లి పోయింది

అంతకు ముందు అయిదు నిముషాల క్రితం రప్పించబడ్డ శాస్త్రి, వెదురు పీటమీద కూర్చుని ఉన్నాడు, రాణి కెదురుగా.

"మీారెంత మంది అన్నదమ్ములు?" కుశల ప్రశ్నలు వేయ సాగింది రాణి, వర్మకూడా ఓ వెదురు పీటమీద కూర్చోగానే.

"మానాన్న గారికి నేనొక్కడ్నే సంతానం"

"మరి, మీానాన్న గారి కెంతమంది అన్నదమ్ములు?"

"మా తాతగారికి ఆయనొక్కరే సంతానం"

"మీాది క్షత్రియ వంశం కదూ?"

"అవును"

"సూర్యవంశమా? చంద్ర వంశమా?"

"సూర్యవంశం"!

ఈ వివరాలన్నీ యీావిడ కెందుకు? అనుకున్నాడు వర్మ.

కొండ రాణి కళ్లల్లో ఎందుకో తృప్తి, ఆమె మొహంలో ఏదో ఆనందం.

ఆ తరువాత, అవే ప్రశ్నలు శాస్త్రిని కూడా అడిగింది. కాని, రెండు ప్రశ్నలు తరువాత మరి, అతని మీాద ఆసక్తి చూప లేదు.

అదే సమయంలో యిద్దరు అమ్మాయిలు అక్కడకు వచ్చారు. వారు కూడా రాణి లానే అలంకరించుకున్నారు.

"నా కుమార్తెలు వీరు. దీని పేరు వినతి. నా తర్వాత యీా గూడేనికి రాణి అవుతుంది. దీని పేరు సుదతి. యే కారణంవల్లనైనా మేమిద్దరం చనిపోతే, సుదతి రాణి అవు

తుంది'' అంటూ ఆ అమ్మాయిల్ని పరిచయం చేసింది రాణి

ఆ అమ్మాయిలిద్దరూ చిరు నవ్వునవ్వి నమస్కారం చేసారు వర్మకు ముందుగా, తరువాత శాస్త్రికి.

ప్రతి నమస్కారం చేస్తూ ''మిమ్మల్ని కలుసు కోవడం మాకు చాలా సంతోషంగా ఉంది'' అన్నాడు వర్మ.

''వర్మ గారూ. మీరు ఈ వూరిలో ఉన్నంత కాలం వినతి మిమ్మల్ని అంటి పెట్టుకుని మీ సదుపాయాన్ని చూస్తుంది.'' అని శాస్త్రి వైపు తిరిగి'' శాస్త్రిగారూ. మీతో సుదతి ఉంటుంది. మీ సదుపాయాల్ని చూస్తుంది'' అని రాణి అనగానే, తమ స్నేహితురాళ్ల వైపు చూసుకున్నారు ఒక్కసారి, శాస్త్రి, వర్మ.

రాత్రి తమ గుడిసెల్లోకి పంప బడిన స్త్రీలకన్నా రెండింతలు అందంగా, వాంఛనీయంగా ఆ అమ్మాయిలు కనిపించగానే, వారి నరనరంలోనూ కోరిక భగ్గున మండింది.

కాని, సంతాన ప్రాప్తికోసం మాత్రమే ఆ స్త్రీలు పురుషుల్ని చేరనిస్తారన్న విషయం గుర్తుకు రాగానే, వారి మనస్సులు నిరాశతో ఉస్సురన్నాయి.

వినతి వర్మకు చేరువగా, సుదతి శాస్త్రికి చేరువగా వచ్చి నిలుచున్నారు.

శాస్త్రి, వర్మ చూపులు ముందుగా వారి మొలల్నున్న చక్రాయుధాల మీద పడ్డాయి.

తెలివి తక్కువగా రాత్రిలా సాహసం చేస్తే, తమతలలు తమవి కావని హెచ్చరిస్తున్నట్టుగా ఉన్నాయి అవి.

''మన ప్రాంతపు వింతలన్నీ మన అతిథులకు చూపండి'', రాణి చెప్పింది, తన కూతుళ్లతో.

వినతి, సుదతి ముందు నడవగా, వారిని అనుసరించారు,

# 7

శాస్త్రి 'రత్తకొండ'కు సగం బలవంతంగానే వచ్చాడు. తీరా వచ్చాక, విచారించవలసిన పని లేదనుకున్నాడు, అర్ధనగ్నంగా న్న ఆడవాళ్ల రాజ్యం చూసి.

అది ఆడ వాళ్ల రాజ్యమైనప్పటికీ మొదట అనుకొన్నంత బలువుకాదు స్త్రీలను పొందడం అనుకున్నాడు శాస్త్రి.

ఆ సంగతి తలుచు కుంటుంటే గుండెలో పుండులా సల్పు తోంది. అతడికి.

దీనికి తోడు వర్మ రాజ వంశానికి చెందిన వాడని తెలియ గానే, రాణి అతని మీద ప్రత్యేక శ్రద్ధ తీసుకో నారంభించింది.

ఏం మాట్లాడినా అతని వైపే చూసి మాట్లాడుతుంది. అతనికి తోడుగా యువరాణి వినతినే నియమించింది.

ఎర్రగా, బుర్రగా కనిపిస్తూ, ఒడ్డూ, పొడుగూ వుండడం క్కటే వర్మకున్న అర్హత. చదువులో శుంఠ. దశలవారీగా ని బి. ఏ. పూర్తి చెయ్యలేక పోయాడు. పాత రోజుల్లో ర్మ తాత కొంత ఆస్తి సంపాయించాడు. పిసనారి తండ్రి నికి మరికొంత సంపాదన చేర్చి ఆస్తి పెద్దది చేసాడు.

పంచుకోవడానికీ, తెంచుకోవడానికీ, తోబుట్టువు లెవరూ క పోవడంవల్ల, ఆ ఆస్తి వర్మ కొక్కడికి యెక్కువై యింది. నిర్లక్ష్యంగా ఖర్చు చేస్తున్నాడు.

ఎందుకూ కొరగాని వాడికి అంత ప్రాముఖ్యత కొండరాణి బస్తుంటే శాస్త్రికి ఒంటికి కారం రాసుకున్నట్టుగా ఉంది.

సుదతి వెంట వెళ్తున్నా, తనపట్ల రాణి చూపిన అలక్ష్యం, మర్యాద గురించే ఆలోచిస్తున్నాడు శాస్త్రి.

"ఈ పనస చెట్టు పళ్ల తొనలు తేనెకన్నా తియ్యగా

వుంటాయి.'' సుదతి అన్న మాటలవల్ల అతని ఆలోచన కం[illegible]
రాయం కలిగింది. దృష్టి! ఆమె చెప్పిన అంశం మీదకు
మళ్లింది.!

''అలాగా?'' అంటూ ఆ చెట్టువైపు పరీక్షగా చూసాడు
శాస్త్రి.

కొండల్లో అడవుల మధ్య ఉండే వాళ్లకు, చెట్లూ చేమల
గురించి తప్ప చెప్పుకోవడానికే ముంటాయ్? అనుకున్నాడు.

సుదతి చెట్టు మొదలు దగ్గరకు పోయి, చెట్టు కొమ్మల్లోకి
పరీక్షగా చూడసాగింది.

''యేమిటలా చూస్తున్నావు?'' అడిగాడు శాస్త్రి.

''ఇది పళ్లకాలం ఒకటైన మిగిలి ఉందేమోనని చూస్తు
న్నాను'' అంది సుదతి, యింకా చెట్టు కొమ్మల్లోకి చూసి
పరీక్షిస్తూనే.

రెండు నిముషాల తరువాత, ఆమెకు ఎక్కడో పండు అగపడి
నట్టుంది. కోతిలా చరచరా చెట్టుచివరకు ప్రాకింది. అయిదు
నిముషాల్లో పండుతో దిగువకు వచ్చింది.

తన వద్దనున్న చక్రాయుధంతో కోసి, నాలుగు తొనలు
శాస్త్రికి యిచ్చి, తనో నాలుగు తొనలు తీసుకుని తిన్నది.

తొనలు కొబ్బరి ముక్కల్లా దళ సరిగా ఉండడమే గాకుండా
పళ్లక్రింద నలిగినప్పుడు తేనె మాధుర్యాన్ని మరిపించే రసా
లూరాయి.

నాలుగు తొనలతోనే శాస్త్రి మొహం మొత్తింది.

చేతుల కంటిన రసాన్ని కడుక్కోవడానికి దగ్గరలో ఉన్న
యేటికి తీసుకెళ్లింది సుదతి.

''ఇలా చూడండి''. అంటూ ఓ రాతిని చూపి ''యిక్కడే
మొదలయింది యీ యేరు. అన్ని వేళల్లోనూ నీళ్ళ ఊర

కాయి యిక్కడ". చెప్పింది సుదతి.

ఆమె మాటలు అతని మనస్సు కెక్కడం లేదు. అతని ఆలోచనలు ఎక్కడో పరిభ్రమిస్తున్నాయి.

అతడు ఆమెను పరిశీలించ సాగాడు నిశితంగా.

వినతికీ, యీామెకీ యెంత తేడా? వినతి యెర్రగా, స్థూలంగా గుండ్రని అవయవాలతో ఉంటే, సుదతి పచ్చగా, సన్నగా, సున్నితంగా వుంటుంది. వినతి కళ్ళు చిన్నవైనా తెపాల్లా కాంతివంతంగా ఉంటాయి. సుదతి కళ్లు పెద్దవి. అర్ధనిమీలితాలయి, ఏవో కలల్లో తేలిపోతున్నట్టుగా ఉంటాయి.

ఒకే రక్తం పంచుకుని పుట్టిన వాళ్లల్లో యెంత తేడా?

తన సందేహాన్ని సుదతి ముందుంచాడు శాస్త్రి.

సుదతి లీలగా నవ్వి "మీాలా యిక్కడి స్త్రీలకు ఒకే పురుషుడివల్ల పిల్లలు కనాలన్న నియమంలేదు. నేను, వినతి, మా అమ్మకు యిద్దరు వేర్వేరు పురుషులవల్ల కలిగిన సంతానం" అని వివరించింది.

కొండరాణి ప్రస్తావన రాగానే, మళ్లీ, ఆమె తనపట్ల చూపుతున్న అమర్యాద, అశ్రద్ధ గుర్తుకు వచ్చింది. అతడి గుండెల్లో మంట మొదలయ్యింది.

ఇంతసేపూ తను వర్మ గురించి చెడ్డగా అనుకున్నాడు కాని, నిజానికి, తను వర్మను ద్వేషించేలా చేసింది ఆమె.

ఆ ఆలోచన రాగానే, కొండ రాణి మీాద కసి, కోపం కలిగాయి, పట్టరానంతగా.

కాని తనేం చెయ్యగలడు, లోలోన మండుకుపోయి చావడం తప్ప?.........శాస్త్రి తీవ్రంగా ఆలోచించాడు.

తనూ వినతి చనిపోతే, సుదతి రాణి అవుతుంది యీనాగాడేనికి అన్న కొండరాణి మాటలు స్ఫురణకు వచ్చాయి.

తనకు తెలీకుండానే, ఆ మాట

శాస్త్రికి.

అవును.........కొండరాణి, వి

కొల్పి వదిలేస్తే......తన కసి తీరు

అలక్ష్యానికి బదులు లభించినట్టవుతుంది. తన కడుపుమంట చల్లారుతుంది.

కాని?......అతడ్ని ఒక్కసారిగా నిరాశ అలముకుంది, సుదతి ఆలోచనా సరళి యెలాగుందో?

సుదతిని కదిలించి చూద్దామనుకున్నాడు శాస్త్రి.

"మీ అమ్మ తరువాత వినతి కొండరాణి అవుతుంది కదూ?" అన్నాడు శాస్త్రి, యథాలాపంగా అడుగుతున్నట్టు.

"అవును" జవాబిచ్చింది సుదతి.

"నీకు రాణి కావాలన్న కోర్కె లేదా?"

"యెందుకు లేదు. కాని, మొదటి కూతురు రాణి కావడం యీ గూడెం ఆచారం".

"ఆచారం మాటలావుంచు. విధి వశాత్తు లేదా ప్రమాద వశాత్తు, రాణి, వినతి చనిపోతారనుకో. నువే అయిపోతావుగా రాణి?"

"అనుకోవడం యేమైనా అనుకోవచ్చు. ఎన్నైనా అనుకోవచ్చు. కాని, తరతరాలుగా వస్తున్న ఆనవాయితీ అది."

"ఆనవాయితీల మాటుంచి, నాకో విషయం సూటిగా చెప్పు. సుదతీ.......నీకు యీ గూడేనికి రాణిగావాలన్న కోర్కె ఉందా, లేదా?

సుదతి వెంటనే జవాబీయలేదు. దీర్ఘాలోచనలో పడిపోయి, రెండు నిముషాలుండి అంది." కోర్కె ఉంది. ఇంతకూ యీలా ఎందు కడుగుతున్నావో తెలుసుకోవచ్చునా?"

న్న యీ గూడేనికి రాణిని చెయ్యాలని ఉంది నాకు.''

ఆ మాటలంటున్నప్పుడు శాస్త్రి కళ్లల్లో తొణికిన కాఠిన్యం క్రూరత చూసి బెదిరింది సుదతి ఒక్క క్షణం.

అయితే, యేం చెయ్యాలను కుంటున్నారు?'' బెదురుగానే అడిగింది!

''ఆ విషయం తరువాత చెప్తాను. ముందు నాకు కొంచెం తెలియాలి......సాధారణంగా యిక్కడ చావులు యెలా సంభవిస్తుంటాయి?''

ఎలా ఓ?''

''కొండల మీంచి దూకి పడటమో, జంతువుల వాత పడటమో, విషసర్పాలకాటు దినడమో మొదలైన ప్రమాదాల గురై మనుషులు చని పోతుంటారా?''

నా ఊహ తెలిసిందగ్గరనుండి, కొండల మీంచి పడి చనిపోయిన వారి గురించి వినలేదు. ఇహ, పాములుగాని, జంతువులుగాని, యీ గూడేనికి మైలులోపు ఆవరణలోకి రాలేవు.''

మరి, యిక్కడ సహజంగా గాక, మరే విధంగా మనుషులు చనిపోరా?''

''యెందుకు చనిపోరు?......చనిపోతారు. నీతి దప్పిన వాళ్లు శిరచ్ఛేదన పొందుతారు''.

''యేమిటానీతి?......ఆ శిక్ష యెవరు వెయ్యొచ్చు?

ఈ రాజ్యంలో స్త్రీ తన లైంగిక వాంఛల్ని స్త్రీ ద్వారానే తీర్చుకోవాలి. పరమ పవిత్రమైన సృష్టి కార్యానికి ఉపయోగించాల్సిన పురుషుడ్ని క్షుద్రమైన లైంగిక తృప్తి కోసం ఉపయోగించినట్టు యే స్త్రీ గురించైనా తెలిస్తే, ఆమెకు శిరచ్ఛేదనే శిక్ష''

"ఒక స్త్రీ ఒక పురుషుడితో కలిసి ఉందనుకో. ఆ వుండడం, సంతాన ప్రాప్తికోసమో, వాంఛ తీర్చుకోవడం క మో అని ఎలా తెలుస్తుంది?"

"సంతానం కోసం పురుషుడి పొందు కావాలనే స్త్రీ ర అనుమతి పొందాలి మొదట. ఆ మీదట, ఆమె అనుమ చిన మగవాడ్ని, ఆమె నిర్ణయించిన రోజున, యిద్దరాడవా సమక్షంలో, ఆమెతో సంగమింప జేస్తారు. సాధారణంగా కా తృప్తికి జరిగే తంతు వాళ్ల మధ్య ఉండదు."

"ఈ నీతిని పాటించనివారికి శిక్ష యెవరైనా వేయొచ్చా

"సాధారణంగా తన కామతృప్తికి పురుషుడ్ని చేరనిం కూడదు స్త్రీ. ఎవడైనా దుస్సాహసం చేస్తే, వాడ్ని ఆ ( చంపితే, ఆ స్త్రీకి శిక్షలేదు. అంతేగాదు. ఏ స్త్రీయై పురుషుడ్ని రహస్యంగా చేరదీసిందని యింకో స్త్రీ ఫిర్యా చేస్తే, ఆ యిద్దరి తలకాయల్ని రాణి కొట్టిం చెయ్యవచ ఒకరి కన్నా, ఎక్కువ సాక్షులు ఉంటే, వారిలో యే ఒ రయినా ఆ నీతి దప్పిన స్త్రీకి శిరచ్ఛేదన శిక్ష వెయ్యొచ్చు"

"నువ్వు అలాంటి అన్యాయం కళ్లారా జూసేవనుకో. ను ఆ నేరస్తుల తలకాయలు కొట్టెయ్య వచ్చునా?"

"నేను రాణి తరువాత రాణి లాంటిదాన్ని. కాబట్టి నే శిక్షవేస్తే, యెదిరించే వారుండరు......కాని, నేనేదైనా అ యం జరగడం చూడ్డం తటస్థిస్తే, రాణికి ఫిర్యాదు చెయ్యా శిక్ష పడేలా చూడాలి. నా అంతట నేను శిక్ష విధించరా మామ్మూలుగా."!

"సరే. అలాంటి అవకాశం కోసం యెదురు చూ కనిపించవచ్చు."

"అలాగే." సుదతి తన అంగీకారం తెలియజేసిం

'డెనికి తిరుగు ముఖం పట్టారు.

ఊరు మాటు మణిగింది.

అంతులేని ఆలోచనలతో అశాంతిగా ప్రక్కమీద దొర్లుతూ, ి రి తన చేతి గడియారం చూసుకున్నాడు శాస్త్రి. రాత్రి న్నర కావడానికి యింకా పది నిముషాలుంది.

ఏవేవో ఆలోచనా తరంగాల మీాద ఊగిసలాడుతున్నాడు. స్త్రి. ఆ ఆలోచనలకు కేంద్రదం ఒకే ఒక్కరు. ఆమెకొండ కి.

వర్మ పట్ల ఆమె చూపుతున్న ప్రత్యేక అభిమానానికీ, తన , ఆమె కున్న అలక్ష్య వైఖరికీ ఆమెకు శాస్తి జరగాలి.

శాస్త్రి మంచం మీాంచి ఒక్క ఉదుటున లేచాడు. అటూ టూ గదిలోపచార్లు చెయ్యసాగాడు.

ఆ సమయంలో కొండరాణి యేం చేస్తుంటుందో?...... టనే పోయి ఆమె యేం చేస్తోందో రహస్యంగా చూసి రావా ఏంచింది అతడికి.

మెల్లగా చప్పుడు చెయ్యకుండా గుడిసె బయటికివచ్చాడు. టి నీడల్ని ఆశ్రయించి, మెల్లగా కొండరాణి గుడిసెవద్దకు ్చాడు. గుడిసె తలుపు మూసి ఉంది. అంచేత లోపల వరున్నారో తెలుసుకోవడం కష్టంగా ఉంది. కాని, లోపల ంచి అస్పష్టంగా చిన్న మూల్గులు, మధ్య మధ్య నిట్టూ ు, అప్పుడప్పుడు బాధకు ఓర్చుకోలేక "అమ్మో. య్యో." అంటున్న రొప్పులు వినవస్తున్నాయి చిన్నగా.

లోపల రాణిగాక యింకో వ్యక్తి ఉంది. వాళ్లు యెవర ా, వాళ్లు మధుర బాధా వృతమైన కామకేళిలో ఉన్నారని ుసుకున్నాడు శాస్త్రి.

వారెవరో చూసి తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది అతడికి. నేల మీద చెయ్యి ఆడించగా, చిన్నకర్రపుల్ల దొరికింది. దాని సాయంతో గుడిసె గోడ మట్టి పెళ్లల్ని పెకలించసాగాడు. అయిదు నిముషాల్లో చిన్న కన్నం యేర్పడి, వెదురు బొంగుల మధ్య కాళీ స్తలం ద్వారా లోనగది, అక్కడి మనుషులు కనిపించసాగారు అతడికి.

లోన యిద్దరు స్త్రీలున్నారు. ఒకరి కౌగిల్లో ఒకరు నలిగి పోతున్నారు. అందులో ఒకామె కొండరాణి అని గుర్తుపట్టాడు. రెండో ఆమె—జాగ్రత్తగా పరిశీలించగా—కృష్ణకుంతల అనే స్త్రీ అని తెలుసు కున్నాడు.

రత్తకొండలో రాణి కూతుళ్ల తర్వాత అందంలో కృష్ణకుంతలకు దీటైన స్త్రీ లేదు.

ఆమెకు ముప్పయి యేళ్లుంటాయి. బిగువైన వక్షాలు. ఏపుగా పొడవుగా యెదిగిన తొడలు. సాధారణంగా పురుషుడు కలలు కనే అందాలన్నీ ఆమెలో ఉన్నాయి.

కొండరాణిలో మగలక్షణాలు యెక్కువగా ఉన్నాయి. ఆమె కృష్ణ కుంతల్ని యెన్నుకోవడం లోని రహస్యం బోధపడి నట్లయింది శాస్త్రికి.

వాళ్లిద్దరి కామకేళి, జుగుప్సాకరంగా, రోతగా ఉంది.

ఆ లెస్బియన్స్‌ని చూసి మనస్సునిండా వెగటు నింపుకోవడం కన్న వెళ్లిపోవడమే మంచిదని శాస్త్రి అనుకుంటున్న సమయంలో, ఆ స్త్రీ లిద్దరూ తమ కలాపం నిలిపివేసి, మాట్లాడుకో సాగారు.

"ఈ మధ్య విశేషాలేమిటి?" అడిగింది రాణి.

కృష్ణకుంతలకు యింకా మత్తుగానే ఉంది. రెండు నిముషాలు పోయాక గాని కళ్లు విప్పలేదు. అప్పుడు మాట్లాడింది.

"శాస్త్రి, సుదతి మాట్లాడుకున్న మాటలు విన్నాను యివాళ" అంది కృష్ణకుంతల.

శాస్త్రి త్రుళ్లి పడ్డాడు. తను సుదతితో అన్నమాటలన్నీ యీామె విన్నదా?

శాస్త్రి గుండెలు భయంతో గుబ గుబలాడి పోయాయి.

"వాళ్లేమనుకున్నారు?"

"ఈ గూడేనికి, రాణి కమ్మని ఆశ కల్పిస్తున్నాడు శాస్త్రి"

"సుదతి యేమంటోంది?"

"తనకున్న ఆశ స్పష్టంగా చెప్పింది."

కొండరాణి రెండు క్షణాలు మవునం వహించి "అయితే, నిన్ను నాగూఢచారిణిగా నియమించి, సుదతి ప్రవర్తన గురించి తెలుసుకోమనడం మంచిదే అయ్యిందన్నమాట" అంది.

"అవును"

"అయితే, వాళ్ల పధకంయేమిటి? ఆ సంగతి మాట్లాడేరా?"

"మీ యిద్దరి నెత్తిమీద యేదో నేరం రుద్ది, మిమ్మల్ని అంతం చెయ్యడం, వారి ఉద్దేశంలా అనుపిస్తోంది".

"ఒహో! అదా సంగతి. అయితే మన జాగ్రత్తలో మనం వుండాలి"

"అంతే రాణీ. నా ఉద్దేశం కూడా."

"నువ్వు యింకా సుదతిని వెన్నాడ్డం మానకు. వాళ్ల గురించి సమాచారం యింకా కావాలి. అతి మెలకువగా వాళ్లని కనిపెట్టి తిరుగు. వినతికి యేం ప్రమాదం వాటిల్లినా నీదే బాధ్యత......ఇంక న్వువెళ్లవచ్చు".

కృష్ణకుంతల లేచింది. రాణికి నమస్కరించి బయటికి నడవసాగింది.

మనస్సులో ఏదో ఆలోచన వచ్చినట్టుంది. ద్వారంవద్ద ఆగి
వెనక్కు చూసింది.

"యేం? ఆగిపోయావేం? ఇంకా చెప్పాల్సిన దేమనా
ఉందా?" అడిగింది కొండరాణి.

కృష్ణకుంతల వెంటనే జవాబీయులేదు. మనస్సులోనిమాట
చెప్పడానికి సందేహిస్తున్నట్టు నిలుచుండి పోయింది.

"చెప్పు. యేంకావాలో సందేహించకచెప్పు. ఇవాళ నాకు
ఎంతో తృప్తి నిచ్చావు. చాలా రోజుల తర్వాత నీతోటి
కూడిక, మధురంగా, మనోహరంగా, మరపురానిదిగా ఉంది'

కృష్ణ కుంతలకు ఆ మాటలు నిబ్బరం కలిగించినట్టు
న్నాయి. ఆమె అంది." నాకు మగవాడు కావాలి".

ఆమె బలహీనతను అర్థం చేసుకున్నట్టు కొండరాణి చిరు
నవ్వి" అలాగే......కాని జాగ్రత్తగా ఉండాలి. ఎవరికంటం
నాబడి అభియోగంవస్తే నీకు శిరచ్ఛేదన తప్పదు......ఎప్పటిలా
రంఫలోయలోకి నీ ప్రియుడ్ని తీసుకెళ్తావు కదూ." అంది.

అన్నింటికీ తలూపి, రాణివద్ద శెలవు తీసుకుని వెళ్ళి
పోయింది కృష్ణకుంతల.

'రత్తకొండలో కూడా, తమకోరికలు దీర్చుకోవడానికి పుర
పుడ్నే కావాలంటున్న వాళ్ళు, అందుకు తమ ప్రాణాలు సైత
లెక్కచెయ్యని వాళ్ళు ఉన్నారన్నమాట.' అనుకున్నాడు శాస్త్రి
రాణి గుడిసె వెలుపల కూచుని.

కాసేపయాక, కొండరాణి మంచం యెక్కింది. సుఖని
చేయసాగింది.

ఇహ తను అక్కడ కూచుని తెలుసుకోగలిగే విశేషా
యింకేవీ లేవని గ్రహించిన శాస్త్రి, మెల్లగాలేచి తన గు
సెకు బయలు దేరాడు.

)

కృష్ణకుంతల అతడి బుజాలమీద చేతులువేసి వెనక్కి
ోయగానే, వెల్లకిలా పడిపోయాడు. కృష్ణకుంతల, ఆకలి
్న్న పులిలా, అతడిమీద ఉరికింది.

అరగంట తర్వాత తృప్తిగా ఊపిరి పీలుస్తూ లేచి కూచుంది
ృష్ణకుంతల.

కడుపులోని పేగులు గోల పెడుతూంటే, తనతోపాటుగ
చ్చిన లేడి మాంసం కొంత తన ప్రియుడికిచ్చి, తనుకొంత
సుకుని తినసాగింది ఆమె.

"ఊ......ఇదన్నమాట...... నీ రహస్య స్థావరం......నీ
ియుడ్ని ఇక్కడన్నమాట కలుసుకుంటున్నావు అక్రమంగా
హాలోని నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ విన్పడ్డాయి మాటలు."

కృష్ణకుంతల, ఆమె ప్రియుడు త్రుళ్లిపడి వెనక్కిచూసారు.

అంతవరకూ ఒ రాతిబండను అడ్డంగా పెట్టుకుని, కృష్ణ
ుంతల్నీ, ఆజానుబాహునీ తదేకంగా కనిపెడ్తున్న సుదతి,
్రస్త్రి వెలుపలికివచ్చి ప్రేమికుల కెదురుగా నిలుచున్నారు.

సుదతిని, శాస్త్రినీ చూడగానే, సగందిగిన ఆహారం గొంతు
ోనే నిలిచిపోయి, మరి మింగుడు ఒడలేదు, వారిద్దరికీ.

వారి ఆకలి మంత్రంవేసినట్టుగా మాయమైంది.

కొండరాణి నియమించిన తలారివచ్చి. వాళ్లిద్దరి శిరస్సుల్నీ,
కే చక్రాయుధంతో ఉత్తరిస్తున్నట్టు, అప్పుడే ఆజాను
హుకళ్లముందు ఓ బొమ్మ ఆడసాగింది.

కృష్ణకుంతల పరిస్థితి గూడా ఇంచుమించు అలాగేఉంది.
దతి, శాస్త్రి ముఖాల్లోకి మార్చి మార్చి చూడసాగింది.

అయితే, అయిదు నిముషాల తర్వాత, కొండరాణి తనకిచ్చిన
ోసా గుర్తుకురాగానే, ఆరాటంతో అదిరిపడుతున్న తన

గుండెల్ని నిభాయించుకుంది కృష్ణకుంతల.

అదే సమయంలో, సుదతి కొండరాణికి వ్యతిరేకంగా పని చేస్తోందన్న రహస్యం తనకు తెలుసనీ, ఆ సంగతి చెప్పి బెదిరించి తమ ప్రాణాలు రక్షించు కోవచ్చునీ గుర్తుకు వచ్చింది.

మునుపటి ధైర్యం పుంజుకుంది కృష్ణకుంతల.

"నా రహస్యం నీ చేతిలో ఉందని మిరిసి పడబోకు సుదతీ. నువ్వూ శాస్త్రీ కలసి వినతి ప్రాణాలు దీయాలని ఆశిస్తున్న సంగతి నాకు తెలుసు." అంది కృష్ణకుంతల తీవ్రస్వరంతో.

సుదతి సన్నగా నవ్వి అంది.

"ఆ సంగతి నాకు తెలుసు. అంతేగాదు. ఆ సంగతి మా అమ్మకు చెప్పినసంగతికూడా తెలుసు. మేమేం చెయబో యేదీ, యేం ఆలోచిస్తున్నదీ కూడా రహస్యంగా మా వద్ద నుంచి తెలుసుకోమని మా అమ్మ చెప్పిన సంగతికూడా తెలుసు".

"రాత్రి మా అమ్మ, నీవూ కలసినప్పుడు మాట్లాడుకొన్న మాటలు శాస్త్రి విన్నాడు, గుడిసె వెలుపల నుండి".

ఆ మాటలు సుదతి అంటూంటే గర్వంగా తలాడించాడు శాస్త్రి.

"అయితే, యిప్పుడేమంటావ్?" అంది కృష్ణకుంతల దిగులుగా. ఆమె కళ్లల్లో పరాజయంవల్ల కలిగిన నిరాశ, నిస్పృహలు స్పష్టంగా కనిపించాయి.

"నేను చెప్పినట్టు వింటావా. నీ ప్రాణాలు, అమూల్యమైన నీ ప్రియుడి ప్రాణాలు దక్కుతాయి. అంతేగాదు. ఇకముందు కూడా యీ విశృంఖల ప్రేమ వ్యవహారం కొనసాగించవచ్చు. లేదా దిక్కుమాలిన చావుచస్తావు యిక్కడే" అంటూ సుదతి తన మొలనుంచి చక్రాయుధం తీసింది.

గడగడ వణికిపోతూ కృష్ణకుంతల సుదతి కాళ్లపై బడింది.

"నువ్వేం చెయ్యమంటే అదే చేస్తాను చెప్పు" అరిచింది కృష్ణకుంతల.!

రెండు క్షణాలసేపు సుదతి కళ్లల్లో తాండవించినశౌర్యం, కర్కశత్వం యిప్పుడు మాయమయ్యాయి.

సుదతి గర్వంగా నవ్వి, చక్రాయుధాన్ని తిరిగి మొలను పెట్టుకుంది.

"మమ్మల్ని వెంటాడ్డం మానెయ్యాలి. మా ఆలోచన లేమిటో, మా పథకాలు యేమిటో కొండరాణికి చెప్పకూడదు. అంతే" అంది సుదతి.

"అంతేనా." తొలిగిన భయంవల్ల కలిగిన ఆనందంతో అంది కృష్ణకుంతల.

"అంతేగాదు. ఇంకొక్కటుంది మా పథకాలు మార్చు కున్నటు మేం యెప్పటిలా రాణికి విశ్వాస పాత్రంగా వుంటు న్నటు రాణికి తిరిగి నమ్మక కలిగించాలి. ప్రస్తుతం మా మీద కొండ రాణి కున్న అభిప్రాయాన్ని మార్చి వేయాలి" ఆలోచన అందించాడు శాస్త్రి. అంగీకారంగా తలూపింది కృష్ణకుంతల.

# 10

"చెప్పు శాస్త్రీ. కొండరాణినీ ఐనతినీ తొలగించెయ్యడానికి నీ ఆలోచన లేమిటి?" అంది సుదతి.

ఏదో విశేషం చూపుతానని చెప్పి, శాస్త్రిని ఓ అడవిలోకి తీసుకుపోయి అక్కడ అడిగింది సుదతి.

శాస్త్రి ఆశ్చర్యపోయాడు రెండు రోజుల్లో సుదతిలో వచ్చిన మార్పు చూసి. ప్రతి మనిషిలోనూ అధికార దాహం ఉంది. ముఖ్యంగా అధికారం చలాయించడం అలవాటయిన

రాజవంశాల్లో. అనుకూల వాతావరణం సమకూడాలేగా ఆఖరుకు కొండ జాతిలో గూడా అది చెలరేగుతుంది.

సుదతిలో ఉన్న యీ బలహీనత ఉపయోగించుకుని, త రత్తకొండ విడిచి వెళ్లే లోపల ఒకరిద్దరు స్త్రీల దగ్గర అ భవం సంపాయించుకుని వెళ్ళాలి.

"ఆలోచనలైతే బోలెడున్నాయి. కాని వాటిని నీ అందిస్తే నాకు కలిగే లాభం యేమిటి?" అన్నాడు శాస్త్రి ఆమెకళ్లల్లోకి సూటిగా చూసి నవ్వి.

శాస్త్రి తీరు సుదతిని దిగ్భ్రాంతిలో ముంచింది.

తవలో రాజ్యకాంక్ష రగిలించింది శాస్త్రి. అందుకు కా ల్సిన ఉపాయాలు చెప్తానని ముందుకు వచ్చిందాయన. సగంల వచ్చాక, ఇపుడు తన లాభాలగురించి మాట్లాడుతున్నా విచిత్రంగా.

అయినా, యేలాభంలేకుండా, యీరోజుల్లో ఒకరి కొక సాయంచేసే దెవరు?

తనలో తాను సమాధానపడి, శాస్త్రి కోరికేదో తెలుసుకు తీర్చడానికే తీర్మానించుకుంది సుదతి.

"అయితే, చెప్పు. యేంకావాలి?" అడిగిందిసుదతి. "నుష కావాలి" చెప్పాడు శాస్త్రి.

"నీకోరిక యెంత ప్రమాదకరమో ఆలోచించావా?"

"తలకాయలు యెగిరిపోతాయి. అవునా?......అయితే ఒ రాజ్యానికి రాణివి కాబోతున్నావు.......అమాత్యునియమోల్ల ఘనంచేస్తే నిన్ను అనేదెవరు?"

సుదతి వెంటనే జవాబియ్యలేదు. రెండుక్షణాలు మవునం ఉండిపోయింది. శాస్త్రి రెట్టించి అడిగాడు" యేమంటా చెప్పు వెంటనే"

అప్పటికి ఆమె ఓనిశ్చయాని కొచ్చినట్టుంది. "సరే! అలాగే
రిక తప్పక తీరుస్తాను." చెప్పింది సుదతి.
శాస్త్రికి సంతోషంతో గంతులు వేయాలన్పించింది.ఆవిడ
రకు జరిగి చెవిలో ఏదో చెప్పాడు.

# 1

కుసుమగాత్రి అడవిలో కట్టెలు కొట్టడం అరంభించింది.
ట్టిన కట్టెల్ని ఓచోట పేర్చింది. నాలుగు పొడవున్న అడ్డ
ర్ని కోసి, కట్టెల్ని కట్టడానికి సిద్ధంచేసింది.
మోపుడు కట్టెలు కొట్టడంకాగానే, కట్ట కట్టింది. చెట్టు
దలుకు దాన్ని చేరవేసి నిలబెట్టింది. ఆలాగయితే సులువుగా
రిసాయంలేకుండా మోపు తలకెత్తుకోవచ్చు.
మోపునెత్తుకుని ఊర్లోకి బయలుదేరే ముందు కాసేపు
శాంతి తీసుకోవాలనుకుంది. దగ్గర్లో ఉన్నయేటికెళ్లికాళ్లూ,
ాలూకడుక్కుంది. కడుపునిండా తియ్యనినీరు త్రాగింది.
అప్పడే యథాలాపంగా, యేటికవతల ఉన్న చెట్లవైపు
సింది.
చెట్లమీద రాబందుల గుంపులు. ఆమెగుండెలు ఝల్లు
న్నాయి.
అంటే, అక్కడేదో కళేబరంవుండి తీరాలి. అయితే, అది
కళేబరం? మనిషిదా? జంతువుదా?
ారణంగా వన్యమృగాలు తాముచంపిన జంతువు మాంసంతప్ప
వు.
అంటే, ఏదోజంతువు యొక్క కళేబరం—మామ్మూలు గా
చనిపోతే—అక్కడ పడి వుండాలి.
యేటినీళ్లల్లో దిగి మెల్లగా అవతలవైపుకు వెళ్లింది
ుమగాత్రి.

చెట్ల గుబుర్లలో నేలమీద అస్తవ్యస్తంగా నగ్నంగా ప
ఉంది ఓ స్త్రీ శవం.

మొహంమీద, కడుపుమీద, తొడలమీద కండలు ఊడి
పెద్దగాయాలు, రక్కులు ఉన్నాయి.

ఎవరీస్త్రీ?

ఊపిరి బిగబట్టి గుబగుబ లాడిపోతున్న గుండెలతో, శవాని
దగ్గరగాపోయి చూసింది నిశితంగా. అప్పడు పోల్చుకుంది, ఆచ
పోయింది యెవరో!

ఆ విషయంతెలియగానే, కుసుమగాత్రి గుండెలు బిగబట
యి భయంతో.

ఆమెవినతి! ఇప్పడున్న రాణి తర్వాత రత్తకొండకు రాణి కా
లసింది ఆమే!

ఇహ, అక్కడ ఒక్కక్షణంనిలవలేకపోయింది కుసుమగాత్రి
తనువినతి మృతదేహాన్ని చూసినట్టుగా రాణికి చెప్పాల్సిఉండ
వినతి గూడెంలో అవుపించడంలేదనుకుంటారు గాని ఎంద
కవుపించడంలేదో యెవరికీ తెలీదు.

పరుగు పరుగున వచ్చి, మోపు నెత్తికెత్తుకుని, ఊర
వైపుకు బయలుదేరింది తొందరగా.

కుసుమగాత్రి తెచ్చిన వార్త వింటూనే కొండరాణి కొయ్య
బారి పోయింది.

కుసుమగాత్రి చెప్పిన వార్త ప్రకారం, వినతి వన్యమృగాల
వాతబడింది.

అయితే అది నిజంగాదు. సుదతే దెబ్బతీసింది.

రత్తకొండకు రాణి గావాలన్న కోరిక సుదతిలో ఉన్నసంగతి
కృష్ణకుంతల తనకు చెప్పింది. అయితే, ఆమే చెప్పింది,
రెండు రోజుల తర్వాత. సుదతిలో మార్పువచ్చిందనీ, తనకు

వెడు తలంపులు కలిగిస్తున్నందుకు శాస్త్రికి సుదతే చీవాట్లు పెట్టిందని చెప్పింది.

కృష్ణకుంతల చెప్పిన మొదటి మాట నమ్మి నట్టుగానే, తను ఆమె చెప్పిన రెండో మాట కూడా నమ్మింది.

లేకపోయుంటే, వినతికి రక్షణ కల్పించి వుండేది.

అయినా, యింత త్వరగా, రెండు రోజుల్లో కొండదేవత ండగవుండగా సుదతి చేస్తుందను కోలేదు.

సుదతీ. ఎంత ఘోరాతి ఘోరమైన పని చేసావే.

కొండరాణి పట్టరాని ఆవేశంతో ఊగిపోతూ సుదతియింటికి రిగెత్తింది.

"సుదతీ." అరిచింది కొండరాణి.

సుదతి యింట్లోనే ఉంది ఆ క్షణం. కొండరాణి ఆవేశం సూసి కాసేపు కలవర పడింది, గాని వెంటనే నిబ్బరం తెచ్చు ంది.

"యేం?" అడిగింది సుదతి మెల్లగా.

"వినతిని చంపింది చాలక యింకా యేం అని అడుగుతున్నా అమాయకు రాలిలా?"

సుదతి గుండె లయతప్పింది.

వినతిని తనే చంపినట్లు కొండరాణి కెలా తెలిసింది? కృష్ణ ంతల చెప్పేయలేదుగదా......లేదు......అలా జరగడానికి వకాశంలేదు. మొదట తను శాస్త్రితో మాట్లాడిన మాటలే మె యిప్పటి అనుమానంకు కారణమై యుండవచ్చు.

ఏది యేమైనా, అడవిలోకి ఒంటరిగా వెళ్లిన వినతిని తను ంబడించి, అడ్డతీగెల ఉచ్చులో బిగించి చంపడం, ఆ తరు ాత, ఓ అడవి జంతువు దెబ్బతీసినట్టుగా, ఒళ్లంతా గాయాలు ేర్పరచడం యెవ్వరూ చూాళ్లేదు.

ఎవరో ప్రత్యక్షంగా చూసినట్టు సాక్ష్య మిచ్చేంత వరకూ తను వినతిని హత్య చెయ్యలేదనే చెప్పాలి.

చెదరిన గుండెల్ని కూడ గట్టుకుని "నేనా? వినతిని హత్య చెయ్యడమా?" అంది సుదతి అమాయకత్వం నటిస్తూ.

"అవును. నువ్వే. నువ్వే వినతిని హత్యచేసింది. అడవి జంతువు మీద బడితే దెబ్బలాడ్డం చేతగానిది కాదు వినతి. దాని మొలనున్న చక్రాయుధం అలానే వుందట. అడవి జంతువు మీద బడివుంటే, చక్రాయుధం చేత బట్టుకుని వుండేది. దురదృష్టవశాత్తు ఎంతలొంగిపోయినా, చచ్చి పోయేముందు జంతువుని ఒకటి రెండు సార్లయినా దెబ్బతీసి వుండేది. జంతువు రక్తం చక్రాయుధానికి అంటివుండేది. అలాంటి దేమీ లేదంటే, వినతి జంతువు వాతబడలేదు. హత్య చేయబడింది. రత్తకొండలో ఆమెను ద్వేషించే వారెవ్వ రూ లేరు......ఇదంతా నీపనే" గుక్క తిప్పకోకుండా, యేక బిగిన సుదతి నేరం నిరూపిస్తూ ఉపన్యాస మిచ్చింది కొండ రాణి.!

ఆమెతార్కికం చూసి అవాక్కయింది సుదతి. ఎంత నేర్పుగా చేసినా, హత్య చెయ్యడంలో హంతకుడు తనను తాను బయటపెట్టుకుంటాడన్న విషయం మొదటిసారిగా ఆమెకు అవగతమయింది.

అయినా తనిప్పుడు చెయ్యగలిగిందేమీలేదు, కొండరాణి ఆరోపణల్ని మూర్ఖంగా మొండిగా త్రోసిపుచ్చడం తప్ప.

గుచ్చి చూస్తున్న కొండరాణి చూపుల్ని తప్పించుకుని యింకో దిక్కు చూస్తూ." అదేమీ నాకు తెలీదు......నేను వినతిని హత్య చెయ్యలేదు." అంది సుదతి యెప్పటిలా.

కాని, సుదతే వినతిని హత్య చేసిందన్న విషయం కొండరాణికి

అయితే, సుదతే హంతకి అని నిరూపించడానికి ఎలాంటి
ాక్ష్యాధారాలు లేవు. పైగా, వినతి యెలాగూ చనిపోయింది.
 మిగిలిందల్లా సుదతి. ఆమె రాణి కాకతప్పదు రత్త
ండకు. అదే సుదతిగాకుండా, రత్తకొండలో యింకే స్త్రీ
ునా ఆ పని చేసివుంటే, తన వాదన చాలు. ఆ వ్యక్తికి
చ్ఛేదన శిక్ష వేసేది.

రెండో కంటికి కనపడకుండా సుదతి అతినేర్పుగానే హత్య
ంది.

ఆ హత్య యెవరైనా చూసి సాక్ష్యం యిచ్చివుంటే, ఇటు
దతిని సామాన్య స్త్రీలా శిక్షించనూ లేక, రత్తకొండ యువ
ిగా ఆమెను రక్షించు కోలేక తనునానా అవస్తలు పడేది.
ఆ ఆలోచనలు రాగానే కొండరాణి శాంతించింది కొంచెం.
తి చేసిన పని ఆ గూడెనికి మంచి చెయ్యదు. కొండరాణి
స్సు ఏదో కీడు శంకిస్తోంది. రత్తకొండ రాణు లెప్పుడూ
ా పదవికోసం హత్యలు చేసిందిలేదు. నీతి దప్పింది లేదు.
''సుదతీ. నిన్ను దోషిగా నిరూపించి, నీకు శిక్ష వెయ్య
కి నాకు సాక్ష్యాధారాలులేవు. అయినా నాకు తెలుసు.
 హత్య నువ్వే చేసావు. పదవీ వ్యామోహంతో చేసావు.
కొండ రాణి వంశం నీతి తప్పి యెరుగదు. దీనికి శిక్ష
క్కర్తికే గాదు. రత్తకొండ రాజ్యానికే వస్తుంది. అదే
ో నాకు తెలియడం లేదు. కాని నామనస్సు చెప్తోంది.
ో కీడు కలగబోతోంది. మన వంశం, సంప్రదాయం
ు మన వ్యవస్తే, మట్టి కలవ బోతున్నాయి. దీనికంతకు
్యరాలవు నీవే అన్న విషయం గుర్తు పెట్టుకో'' ఆవేశంగా
, అక్కడ ఉండలేక, తన గుడిసెకు వచ్చేసింది కొండరాణి.

4

1

కొండదేవత కపాలేశ్వరి పూజకు భారీగా సన్నాహాలు జరు
తున్నాయి.

రత్తకొండకు పది ఆమడల దూరంలో ఒక లోయ
'యేకుమాను' ఒకరకం చెట్టు ఉంది. దాన్ని నరికి తీస
కువచ్చారు పదిమంది, కొండరాణి పురమాయించిన స్త్రీలువెళ్ళి
యేకుమాను సాధారణంగా వంద అడుగులకు తక్కు
పెరగదు.

కొండరాణి రత్తకొండకు రాణిగాకుండా, కొండదేవత కపా
లేశ్వరికి పూజారిణి కూడా.

కొండ దేవత జాతరలో పూజారిణిని తీసుకెళ్ళడానికి యేక
మాను ఉపయోగిస్తారు.

యేకుమాను యెప్పుడూ ఒకే చోట దొరకదు. అది
దేవతా వృక్షం. అది యే దిక్కున దొరుకుతుందో, అదెల
వుంటుందో, ఎంత దూరంలో దొరుకుతుందో కపాలేశ్వరి
కొండరాణి కలలో కన్పడి చెపుతుంది, జాతరకు నెలరోజుల
ముందుగా.

కఱ్ఱ పచ్చిదనం ఆరకుండా వాడేందుకు, జాతరకు రెండు
రోజుల ముందుగా మాత్రమే నరికి తీసుకు వస్తారు, కొండ
రాణి యిచ్చిన ఆనమాళ్ల ప్రకారం.

రెమ్మలు, కొమ్మలు లేకుండా సాపుగా నరికి సిద్ధంచేసిన
యేకుమాను చివరిలో కొండ రాణి కూచోవడానికి వీలుగా ఒక
అడ్డకఱ్ఱ మేకులు కొట్టి బిగిస్తారు.

యేకుమాను సిద్ధం అయింది, లాంచన ప్రాయంగా.

జాతరకు కావాల్సిన రెండోది, కపాలేశ్వరి విగ్రహం. కాపాలి
లోయలో కపాలేశ్వరి రాతివిగ్రహం ఉంది. అయితే, అర్చన

యి పోగానే, 'అనుపు' జరపడానికి వేరే విగ్రహం అవుసరం
ంది.

ఈ విగ్రహానికీ, కపాలిలోయలోని విగ్రహానికి యెక్కడా
లిక ఉండదు.

రాతి విగ్రహం చిరు నవ్వులు చిందించే ప్రసన్న వదన
యిన దేవి అయితే, అర్చన విగ్రహం అలా కాదు భీభత్సం
ల్పుతూ వుంటుంది. విగ్రహం శరీరం అంతా పసుపురంగు
ాయబడుతుంది. మెడ పై భాగం, మొహం తెల్లనిరంగు
ఉంటాయి. కళ్లకు రక్తవర్ణం వేస్తారు. సాధారణంగా
కళ్లు ఉరిమి ఆగ్రహంతో చూస్తున్నట్టు ఉంటాయి.
రని పెదాలకు అటూయిటూ తెల్లని కోరలు, నొసలు మీద,
ట్లిస్తున్నప్పటి ముడతలు సన్నని గీతలతో దిద్ది ఉంటాయి.
ుడలో పుణుకుల పేరు వ్రేల్లాడుతున్నట్టు రంగు పూస్తారు.
విగ్రహానికి తల ఉండాల్సినచోట, మనుషుల కేశాల్ని అతి
ంచి దువ్వి ఉంచుతారు.

ఆ యేడాది కూడా రాత్రి తొలి జాము అయ్యాక జాతర
రంభమైంది.

అవాళ పౌర్ణమేమో, నేలంతా పాలు ఒలికినట్టుగా, వెన్నెల
ండింది అంతటా.

కొండ రాణిని యేకుమాను మీద కూర్చోబెట్టి, తూగి
డిపోకుండా, తాళ్లతో గట్టిగా కట్టేసారు. కొండరాణి కుడి
తిలో, పసుపు కుంకుమలు అంటించి, మొనకు నిమ్మకాయ
చ్చిన చక్రాయుధం ఉంది.

ఆ చక్రాయుధం జాతర సమయంలో మాత్రమే ఉప
ాగిస్తారు. ఒక్క కొండరాణి మాత్రమే దాన్ని ముట్టు
వడానికి అర్హురాలు.

కపాలేశ్వరి మట్టిబొమ్మను భుజాన్నెత్తుకున్నప్పుడు, కొండ రాణిని కూర్చోబెట్టిన యేకుమాను నిలబెట్టినపుడు, దిక్కులు పిక్కటిల్లేటట్టు డోళ్లు, బాకాలు మ్రోగాయి. ఆ మీదట, విచిత్రమైన లయానుగుణంగా మ్రోగసాగాయి.

యేకుమాను యిప్పుడు ఒక బండికి కట్టబడింది. దాని ముందు, కపాలేశ్వరి బొమ్మను మోస్తున్న స్త్రీ నడుస్తోంది.

యేకుమాను బండిమెల్లగా కదలుతోంది, జనంతోస్తుంటే.

సన్నగా, సాపుగా, నిటారుగా ఆకాశంలోకి పొడుచుకుని పోయిన యేకుమాను ఊగుతోంది సన్నగా, బండి కదులుతుంటే

ఇంకాస్త యెక్కువుగా కదిలితే, మాను ఫెళ్లున రెండుగా విరిగిపోయి, మాను చివరలో కట్టబడిన కొండరాణి నేలగూలి, తల పగిలి చస్తుందేమోనన్న భీతి కలిగిస్తోంది, చూసేవాళ్లకు.

బండి వెనుక తండోపతండాలుగా జనం బయలు దేరారు.

ప్రతీ వ్యక్తివద్ద, ఒక కోడో, గొర్రె పోతో, యెనుబోతో ఉంది, వారి వారి స్తోమతులను తెలియజేస్తూ.

వినలి ఆకస్మిక మరణం తరువాత, వర్మకు తోడుగా ప్రభావతి అనే అమ్మాయిని యిచ్చింది కొండరాణి.

వర్మ, ప్రభావతి ఒక జట్టుగా బయలు దేరారు.

రత్నకొండ మిగతా ప్రజలేగాకుండా, ప్రభావతి చేతిలో యేజంతువూ లేదు. వర్మ ఆశ్చర్య పోయాడు.

"అమ్మ వారికి బలి యివ్వడానికి కోడో, గొర్రో తీసు కెళ్తున్నారు ప్రతి ఒక్కరూ. నీవేదీ తీసుకెళ్లడంలేదేం?" అన్నాడు వర్మ.

"నేనేం తీసుకెళ్లక్కర్లేదు" అంటూ, నవ్వింది ప్రభావతి.

ప్రభావతి కళ్లల్లో మెరిసిన మెరుపులు వర్మను రాత్రి అను భవాల జ్ఞాపకాల్లోకి లాక్కుపోయాయి.

కొండజాతి స్త్రీతో సంపర్కం యెలాగుంటుందో మొదటి సారిగా అనుభవంలోకి వచ్చిందతడికి.

ఆమె అంతట ఆమె రాత్రి తొలి జాము అయ్యాక వర్మ గుడిసెకు వచ్చింది.

"నన్ను నేను అర్పించుకుంటున్నాను. ఆనందించు" అంటూ వివస్త్ర అయి యెదురుగా నిలుచుంది, తినమంటూ చేత ఉంచిన మిటాయిలా.

వాత్సాయన కామసూత్రాల్లో చెప్పిన వివిధ బంధనాల్లో సుఖాన్ని అతడికి చిలికి యిచ్చింది ప్రభావతి.

నీరసం, నిర్వీర్యత వర్మ దరి చేరకుండా, ప్రతి రెండుగంటల కూ అరుదైన ఓషధుల సారం కలిపిన పాలు మట్టి పాత్రలో నిండుగా ఆమె వర్మకు అందించి త్రాగించేది..

రేయంతా ప్రభావతి పొందులో జాగరణ సలిపినా,అతడి ఉత్సాహం, ఉత్తేజం, శక్తిరవంత సడలలేదు. కాని, యేదో వింతమత్తు ఆవరించి ఉన్నట్టుగా ఉంది అతడికి.

నేలను, నీటిని, ఆకాశాన్ని జయించిన మానవుడు చుక్క ల్లోకి కూడా చొచ్చుకుపోయి అక్కడ నివాస మేర్పర'చు కోవాలని ఆలోచిస్తున్నాడు. ఇలాంటి యుగంలో, రత్తకొండ లాంటి సమాజం ఒకటి ఉండడమే ఒక పెద్ద విచిత్రం అను కున్నాడు వర్మ, జాతరకు జరుగుతున్న తంతు చూస్తూ.

లయాన్వితంగా మోగుతున్న డోళ్లు, బాకాలు అనిర్వచ నీయమైన ఉత్తేజాన్ని నింపుతున్నాయి జనంలో.

జాతర జనం ఊరి దాటి కాపాలి లోయ దిక్కుగా సాగి పోతోంది.

వర్మ, ప్రభావతికి కాస్త దూరంలో శాస్త్రి, సుదతి జట్టు గా నడుస్తున్నారు.

జాతర జనం కాపాలి లోయ చేరుకునే సరికి గంటకుపైగ
టైము పట్టింది.

కాపాలిలో ప్రత్యేకత యేమీలేదు. అక్కడ కాపాలేశ్వరిని
రత్తకొండకు వచ్చిన కొండరాణి పూర్వీకు లెవ్వరో స్థాపించారు
కపాలేశ్వరి విగ్రహం చాలాచిన్నది. దానికి కాస్త వెనుగ్గా
పెద్ద బండవుంది. బండకు రెండు గజాల దూరంలో పెద
మర్రిచెట్టు ఉంది. ఆలాంటి చెట్లు, బండలు, వలయాకారంలో
ఉండి, మధ్య చదునైన ప్రదేశం ఉంది.

ప్రతి సంవత్సరం జాతర జరపడానికి రెండు రోజుల
ముందుగా, కొండరాణి మనుషులు కొందరొచ్చి, కాపాలి
లోయకు పోయే మార్గం, లోయలో జాతర జరిగె ప్రదేశం,
శుభ్రం చేసి ఉంచుతారు.

జనంలోయలోకి ప్రవేశించగానే, వలయాకారంగా యేర్పడి
నుంచున్నారు.

కపాలేశ్వరి రాతి విగ్రహం ప్రక్కగా ఉత్సవ విగ్రహం ఉంచ
బడింది.

పది మంది సాయం పట్టి, యేకుమాను మెల్లగా వంచి,
దాని చివర్న కట్టి తీసుకెళ్లిన కొండరాణిని నేలకు దింపారు
అంతటితో యేకుమాను ఉపయోగం అయిపోయింది. గత
సంవత్సరం తెచ్చిన యేకుమాను ప్రక్కగా, యీ సవంత్సరంది
ఉంచ బడింది.

కొండరాణి కపాలేశ్వరికి ప్రణామంచేసింది, ఉధృతంగా మ్రో
గిన డోళ్ల మోతల మధ్య.

ఆ మీదట రత్తకొండ ప్రజ ఒకరి తర్వాత ఒకరు తమ
తో తెచ్చిన బలుల్ని విగ్రహం ముందుంచితే, ఏవో మంత్రాలు
పఠిస్తూ, ఆ జంతువుల తలల్ని నరికేయ సాగింది కొండరాణి

శన చేతనున్న చక్రాయుధంతో.

జంతువుల తలలు తెగి నేలమీద పడి రక్తంచిమ్ముతుంటే 'జై కపాలేశ్వరి.'' అంటూ జనం నినాదాలు చేస్తున్నారు ోయ గింగురు పెట్టేలా.

బలి యివ్వడం అయ్యాక, బలి సమర్పించిన వ్యక్తి, కాపాలిక ు నమస్కరించి, చిందిన రక్తంలో వేలుముంచి, బొట్టు పెట్టుకుని, వెనక్కి వచ్చి తన స్థానంలో నుంచుంటున్నది.

ఉండలోంచి వచ్చిన దారంలాగు జనం ఒక క్రమంలో వెళ్లి ివికి తమ బలుల్ని సమర్పించు కుంటున్నారు.

"దేవికి మనం బలి యివ్వక పోయినా, ప్రణామంచేసైనా ద్దాం పద'' అంది ప్రభావతి, వర్మతో.

వాళ్లిద్దరే ఆఖరుకు మిగిలి పోయారు. వారు దేవికి నమ కరించి వచ్చేస్తే, ఆ సంవత్సరానికి జాతర ముగిసినట్టే. నం తిరుగు ప్రయాణం ఆరంభిస్తారు.

వారు వెళ్లి రావడం కోసమే ఆగినట్టు జనం చూస్తున్నారు ిరిద్దరి వైపు," అయితే పద''.

వర్మ ముందుకు కదిలాడు. అంతమందిలో ఆమె కోరిక దనలేక పోయాడు.

అతడి వెనుగ్గా ప్రభావతి నడిచి వెళ్లింది.

జాతర యిహ ముగుస్తోందన్న సంతోషంవల్ల కాబోలు ఎం "జై. జై. కాపాలికా.'' అంటూ మూకుమ్మడిగా అరవ గారు.

వర్మ ముందు, ఆ వెనుక ప్రభావతి నడుస్తుంటే, జనం ిలువెయ్యడం చూసి శాస్త్రి రక్తంమరగసాగింది, యీర్ష్యతో.

రత్తకొండ ప్రజలు వర్మకేదో ప్రత్యేక సన్మానం చేస్తున్న ుగా అనిపిస్తోంది శాస్త్రికి.

ఎందుకంటే, అంతకు ముందు, పావుగంటముందు, తను సుదతి దేవికినమస్కరించి వచ్చారు. సుదతి గొర్రె పోతు బ
యిచ్చింది. ఇంత పటాటోపం జనం చెయ్యలేదు.

"వర్మ కెందుకీ స్పెషల్ ట్రీట్‌మెంటు? యీ కొండజా
అతడిలోయేం చూసిందని యీ గౌరవం?"

ఈర్ష్యనిండిన కళ్లతో వర్మవైపు తదేకంగా చూస్తున్నాడ శాస్త్రి.

వర్మ దేవి విగ్రహం వద్దకు హుందాగా నడిచి వెళ్ళాడు భక్తి ఉట్టిపడేలా కళ్లుమూసుకుని, చేతులు జోడించి, దే ముందు ప్రణమిల్లాడు.

అదే సమయంలో మిన్ను ముట్టేలా, దిక్కులు బ్రద లయ్యేలా డోళ్ళు, బాకాలు పెద్ద యెత్తున మోగాయి.

కోళ్లు, గొర్రెలు, యెనుబోతుల తలల్ని నరికి, వాటి రక్త అప్పటికే చవిచూచిన కొండరాణి చేతిలోని చక్రాయుధం గాలి లోకి లేచింది.

శాస్త్రి గుండె ఆగిపోయింది. ఓరి దేవుడా. ఇందుకా వర్మను అంత ప్రత్యేకంగా చూసారు యీ కొండప్రజ....... అతడ్ని రక్షించు. అతడు యీ దిక్కుమాలిన చావు చావడానికి వీల్లేదు..

అప్రయత్నంగా ఓ మూగ ప్రార్థన శాస్త్రి గుండెలోంచి వెలువడింది.

ఇంకో క్షణంలో వర్మ తలకాయ తెగి నేలమీద బంతిలా దొర్లి వుండేదే, అయితే, ఆదే క్షణంలో, గాలిలో తుపాకీ మోతలు, "బలి నిలపకపోతే, కాల్చిపారేస్తాం" అన్న అరుపులు బిగ్గరగా విన్పించాయి.

కాపాలేశ్వరికి నమస్కరిస్తున్న వర్మ ఆశ్చర్యంగా కళ్ళ

ప్పాడు.

తన రక్తం రుచి చూడ్డానికి సిద్ధంగా గాలిలోకి లేచిన
ండరాణి చేతిలోని చక్రాయుధం చూడగానే, రవంతలో తను
ృత్యువునెలా తప్పించుకున్నాడో అర్థం చేసుకున్నాడు వర్మ.
తని గుండెలు జలదరించాయి భయంతో.

అప్పటికే, సబిన్స్పెక్టరు సీతాపతి, అయిదుగురు పోలీసులు
ర్మను చుట్టూ ముట్టారు, అతనికే ప్రమాదం కలగకుండా.

"పదండివర్మా! ఇక్కడ మీరుండడం ప్రమాదకరం. శాస్త్రి
రేరీ?" అంటూ శాస్త్రి కోసంచూపు విసిరాడు సీతాపతి.

శాస్త్రి ముందుకు నడిచాడు. అదే సమయంలో గుప్తా
ుందుకు వచ్చాడు. అతడ్ని చూడగానే, శాస్త్రి, వర్మల
శ్చర్యానందాలకుమేరలేదు.

పోలీసు రక్షణలో, వర్మ, శాస్త్రీలు అప్పటికప్పుడే, తిరుగు
పయాణం కట్టారు. చింతపల్లికి.

"సీతాపతిగారూ. మీరు సమయానికి పోలీసు సిబ్బందితో
చ్చి వర్మను రక్షించినందుకు మీకు నా ధన్యవాదాలు.
యితే నా కోసందేహం?" అన్నాడు శాస్త్రి త్రోవలో.

"చెప్పండి." అన్నాడు సీతాపతి, సమాధానం యివ్వడానికి
న సంసిద్ధతను తెలియజేస్తూ.

"గత వారం రోజులుగ నేను రత్నకొండలో ఉన్నాను.
ంతేగాదు రాణి రెండో కూతురయినసుదతితో ఎంతో చను
ుగా, స్నేహంగా కూడా వున్నాను. అయినా, ఆఖరి క్షణం
రకూ, మావర్మ కాపాలేశ్వరికి బలి పశువు కాబోతాడని
లగానయినా గ్రహించలేకపోయాను. అలాంటిది మీరొచ్చి
ాడ్నెలా రక్షించగలిగారు? ఈ మిస్టరీ విడదీయండి,"
న్నాడు శాస్త్రి.

వర్మ మాటలుడిగి, జరుగుతున్నదంతా తనుకలలో చూడ్డ
లేదుగదా అన కుంటూ ఉన్నాడు.

సీతాపతి, గుప్తా వైపు తిరిగి "మీ స్నేహితునికి జవా
మీరిస్తే నే బావుంటుంది" అన్నాడు నవ్వుతూ.

గుప్తా చెప్పసాగాడు.

"రత్తకొండ గురించి, అక్కడి సామాజిక వ్యవస్థ గురిం
యెప్పుడో యెక్కడో చదివాను. అయితే, రెడ్డి మొ
మొదట ఆ పేరు చెప్పినపుడు, ఆ వూరు, ఆ పేరు పరిచం
మైందిగానే అనుకున్నాను గాని, దాని గురించి యెంత ఆ
చించినా జ్ఞప్తికి రాలేదు. నేను విశాఖపట్నం వెళ్లిపోయాన
రత్తకొండను మర్చిపోదామనుకున్నాను. మరుపురాలేదు.

నా చదువు మూలకు నెట్టాను. యూనివర్సిటీకి పోం
యాంత్రపోలజీ మీద పుస్తకాలు తిరగేయసాగాను. రోజున్న
తరువాత, రెండు వందలకు పై చిలుకు పుస్తకాలు క్రిం
మీద వేసి పారెయ్యగా నా ప్రయత్నం ఫలించింది. ఒ
పుస్తకంలో రత్తకొండ పేరుంది. కాని దాని గురించి పూ
వివరాలు కావాలంటే, కలెక్టరాఫీసు ఆర్కైల్స్‌లో దొరుకుతాం
అని ఉంది.

అలా రత్తకొండ గురించి విషయసేకరణ చేసాను. ర
కొండ ఆడవాళ్ల రాజ్యం, లెస్బియనిజమ్ చట్టరీత్యా అమ
జరుపబడుతున్న అతి అరుదైన సాంఘిక వ్యవస్థల్లో అదొక
మొదలైన సంగతులు నాకు విచిత్రంగా, తమాషాగా అనిపిం
నా, మీకు కలిగే ప్రమాదం శంకించిన విశేషం ఒకటుంద
అదే మానవబలి. రత్తకొండ స్త్రీలు తమ కొండ దేవ
కాపాలేశ్వరికి మగవాడ్ని బలియివ్వడం ఆచారం. అది ప్ర
పదేళ్లకూ యివ్వ బడుతుంది.

1910 లో అలా యివ్వబడిన ఓ బలిగురించి పూర్తివర్ణన
ంది. ఆ రికార్డులో. ఇది 1970. అంటే, మానవ
ి యివ్వాల్సిన సంవత్సరం. అంతేగాదు, మానవ బలి
ంవ్వడానికి ఎన్నుకోబడిన వ్యక్తికుండాల్సిన అర్హతలగురించి
ాడా అందులో రాసిఉంది. మన వర్మ ప్రమాదంలో ఉన్నా
ి ఆ క్షణంలోనే నా కనిపించింది.

అంతేగాదు. ఒకసారి, రత్తకొండ అడవుల్లో తప్పిపోయి,
రి కనిపించకపోయిన యువకుడి గురించి చదివాను పేపర్లలో.
సంవత్సరం 1960. నా కెందువల్లనో ఆ సంవత్సరం,
వార్త గుర్తుంది. క్షణం ఆలస్యం చెయ్యకుండా చింతపల్లి
ుగెత్తుకొచ్చాను. సబిన్స్పెక్టరు సీతాపతికి రెడ్డి
ారా అన్ని సంగతులూ చెప్పాను. సీతాపతి మొదట నమ్మ
ు. నేనే పట్టుబట్టాను. పందెంకాసాను. దాంతో,
ిన్స్పెక్టరు సీతాపతి తన బలగంతో కదిలాడు. దేవుడి కృప
ి సమయానికి చేరుకొన్నాం..'' అని ముగించాడు గుప్త.

''చాలా విచిత్రంగా ఉందికదూ......అందుకే......కపాలే
ికి అర్పించే నైవేద్యంగా వర్మను గుర్తించి స్పెషల్ ట్రీట్
ంట్ యిచ్చారు. అదినా కర్మం కాలేదు, చివరివరకూ. నాకో
దేహంఉంది....... మేం అక్కడికి పోకుండా వుంటే,
ానవ బలి యెలాగిచ్చేవారు?'' అన్నాడు శాస్త్రి.

''అదా?......అదో మిస్టరీ......రత్తకొండ ప్రజల నమ్మకం
ిమంటే, కపాలేశ్వరి తనకు బలి యివ్వాల్సిన మనిషిని
ే రప్పించుకుంటుంది. ......వాళ్ల నమ్మకంలో నిజం
ది.......లేకపోతే, పట్నం వదిలి వెళ్లని మీరు, స్నేహి
ష్టి చూసేనెపం మీద చింతపల్లి వెళ్లడం యేమిటి,
ివెళ్లాక, అక్కడనుంచి యెక్కడో అడవుల మధ్యలో ఉన్న

రత్నకొండకు పంతంబట్టి బయలు దేరడమేమిటి...వారి నమ్మకంలో అర్థం ఉందనిపించడంలేదూ?''

''మరయితే, కపాలేశ్వరికి బలి అయిపోకుండా యీసారి నేనెలా తప్పించుకున్నాను?'' అడిగాడు వర్మ.

''యేమో. ఆ ప్రశ్నకు మాత్రం జవాబీయలేను. ఆ రికార్డ్సులో మాత్రంలేదు.'' అన్నాడు గుప్త, తన అశక్తత వెలిబుచ్చుతూ.!

ఒక్క క్షణం దీర్ఘంగా ఆలోచించి అన్నాడు శాస్త్రి. ''ఆ ప్రశ్నకు సమాధానం నేనివ్వగలను. సుదతి, కొండరాణి రెండోకూతురు రాజ్య కాంక్షతో వినతిని హత్యచేసింది. ఆ విధంగా రత్నకొండ రాణి వంశానికి కపాలేశ్వరి పెట్టిన నియమం తప్పింది. అంతేగాదు, కొన్ని స్వప్రయోజనాల కోసం. నీతి బాహ్యాల్ని క్షమించి వదిలి వేయసాగింది కొండరాణి, బహుశా అందువల్లనేమో, కపాలేశ్వరి తన బలిని తిరస్కరించింది.''

''ఏది యేమైన మన వర్మ రక్షింపబడ్డాడు'' అంటూ సీతాపతి తను యెక్కిన కంచర గాడిదను అదిలించాడు, త్వరగా పోవడంకోసం అతని వెనుక, మిగతా వారు యెక్కిన గాడిదలు కూడా పరుగెత్త సాగాయి. చింతపల్లి వైపు.

—:అయిపోయింది:—

# జాడ తెలియని జయ

సుజనశ్రీ

రైలు, స్టేషన్లో ఆగిందోలేదో, అంతలోనే గార్డు విజిల్ వేసి పచ్చజెండా ఊపాడు.

అదో చిన్న స్టేషను. కారడవుల మధ్య రైలు పెట్టెలోంచి మమత హడావిడిగా దిగింది, ఒక చేత్తో బ్యాగ్, మరో చేత బ్రాండ్ సూట్ కేస్ తో.

రైలు కదిలి పోయింది. ప్లాట్‌ఫారమ్ మీద మమత ఒక్కతే ప్రయాణికురాలు దిగింది. ఆమె తప్పితే ఆ స్టేషన్లో ఎవరూ ఎక్కినవారులేరు, దిగినవారూలేరు.

తనను రిసీవ్ చేసుకోవటానికి ఎవరన్నా వచ్చారేమో అని స్టేషన్‌లోనూ రోడ్డుమీదకూ తేరిపార చూసింది మమత. కాని ఎవరూ కనబడలేదు ఆమెకు. టిక్కెట్లిచ్చే చోట వాకబు

చేద్దామని వెళితే అక్కడా ఎవరూ లేరు. బహుశా ఈ స్టేషన్లో ఎవరూ రైలెక్కరని స్టేషను మాస్టరుకు బాగా తెలుసు కాబోలు అనుకుంది మమత.

తనకు ఇక ఆ మట్టి రోడ్డుమీద కాలినడకే శరణ్యం కాబోలు అని నిట్టూర్చింది మమత. తన స్నేహితురాలు జయ వ్రాసిన ఉత్తరంలోని వివరాలు ఆమె మదిలో మరోసారి మెదిలిసయ్.

"ప్రాణ ప్రదమైన మమతా,

నా వివాహం ఇంకా రెండునెలల్లో జరగబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాను. నేను మనసారా ప్రేమించిన సుందరమే వరుడు. నీవు నా చెంత ఉండాలి తప్పకుండా. అన్నట్టు నీ పెళ్లికి నేనూ, నా పెళ్లికి నీవూ తోడి పెళ్లికూతుర్లుగా ఉండాలని మనం ఒప్పందం చేసుకున్నాం గుర్తుందా.

ఈ లోపుగానే నీవు వెంటనే బయలుదేరి రావాలి. నా పెళ్లికి అనుకోని అవాంతరాలు వచ్చిపడేలా ఉన్నయ్. అందుకు నీ సాయం చాలా అవసరం. ఈ ఉత్తరాన్ని టెలిగ్రామ్‌గా భావించి వెంటనే రావాలి సుమా!" వీలయితే స్టేషనుదగ్గరకు నేను వస్తాను. లేదా సుందరాన్ని పంపుతాను.

నీ ప్రాణ స్నేహితురాలు

జయ

తనూ, జయ కాలేజీలో క్లాసుమేట్స్. జయ తండ్రి అదేదో అడవి ప్రదేశంలో పెద్ద బంగళా కట్టాడు పాలరాతితో. అడవిలో చౌకగా లభ్యమయ్యే కలప వ్యాపారం ఉంది ఆయనకు. అదీగాక, అతడుండే గ్రామంలో, అతడి ఎస్టేట్‌లో పాలరాతి క్వారీ ఉంది. దానిపై లక్షలు గడించాడు జయ

తండ్రి లక్ష్మణరావు.

లక్ష్మణరావు మిలిటరీలో పని చేసి విరమించుకుని, తరువాత ఈ వ్యాపారాన్ని మొదలెట్టాడు. అతడి భార్య చాలాకాలం క్రితమే చనిపోయింది. లక్ష్మణరావు మళ్లీ వివాహం చేసుకోలేదు.

స్టేషను అనబడే సిమెంటు రేకుల షెడ్‌లో నిలబడి, కాలి నడకనే బయలుదేరుదామా అనుకుంటూ ఉండగానే, రోడ్డు మీద దూరంగా ఎర్రని దుమ్ము రేగటం కనుపించింది ఆమెకు.

బహుశా రోడ్డువెంట ఏదైనా కారుగానీ, గుర్రపుబండీగాని వస్తూండవచ్చు అనుకుంది మమత. ఆమె అంచెనా నిజ మయింది.

పాతకాలం రాజాలు వాడే గుర్రపు బగ్గీ, 'విక్టోరియా 404' సినిమాలోలాంటి గుర్రపు బగ్గీ వచ్చి స్టేషనుముందు ఆగింది.

దాదాపు ఆరడగుల ఎర్రని అందమైన వ్యక్తి బండిమీద నుంచి క్రిందకు దూకాడు, చేతిలోని కొరడాతోనే. బెల్‌బాటం ప్యాంటూ, దానికి సరిపోయే చొక్కా, పొడవాటి మీసాలూ, మీసాల చివరల్ని అందుకోవటానికి ప్రయత్నించే చంపల మీది జుట్టూ. అతడు అధునాతనంగా కనుపించాడు మమతకు.

నాగరికతకు దూరంగా ఉన్న ఈ అడవిలో ఆ మాత్రం అందగాడు, నవీన నాగరికతకు అనుగుణంగా ఉన్న వ్యక్తినిచూసి మెచ్చుకుంది మమత.

ఇతడే జయ వరించిన సుందరం అయి ఉంటాడు. మొత్తానికి, జయ మంచి ఎన్నికే చేసింది, అని ఆమెను మనసులోనే అభినందించింది మమత.

"మీరు మమతకదూ?" అతడు దగ్గరకు వచ్చి సౌమ్యంగా

అడిగాడు.

"అంటే మీరు సుందరం అయిఉండాలి." మమత చిరు నవ్వుతో జవాబిచ్చింది.

"ఆలస్యానికి క్షమించాలి. అప్పటికీ త్వరగానే బయలు దేరాలని అనుకున్నాను. కానీ అర్జెంటు పనులవల్ల......"

"ఫరవాలేదులెండి." అంటూ మమత తన బ్యాగ్, సూట్ కేసుని బగ్గీలో పడేసి, అందులో ఎక్కి కూర్చుంది.

సుందరం తన చోటులో కూర్చుని, కళ్లేలు అందుకుని "చల్." అంటూ గుర్రాల్ని అదిలించాడు.

# 2

"జయ రాలేక పోయిందా? ఆమె ఎలా ఉంది? తనపెళ్లి హడావిడితో ఇల్లంతా నానా హంగామా చేస్తుండాలి. అవునా?" జయ గురించి తన కుతూహలాన్ని ఆపుకోలేక అడిగేసింది మమత.!

"ఓ! జయ గురించా? ఇంటికి వెళ్లాక మాట్లాడుకోవచ్చు లెండి ఆమె గురించి."అతడు ముభావంగా అనడం మమతకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

తను వివాహమాడబోయే అమ్మాయి గురించి, అతడు అదోలా అనటం ఆమెకు గిట్టలేదు. జయ లోగడ వ్రాసిన ఉత్తరంలో తనూ, సుందరం గాఢంగా ప్రేమించుకున్నట్టూ, ఎంతో అన్యోన్యంగా, ఒకరిపట్ల ఒకరు ఆప్యాయతగా ఉన్నట్టు రాసింది.

"ఇక్కడినుంచి ఊరు ఎంత దూరం ఉంటుంది?" మమత అడిగింది.!

"రెండు మైళ్ల పైనే! లక్ష్మణరావు ఇల్లు గ్రామం మొదట్లోనే ఉంది. మా ఇల్లు అక్కడికి దగ్గరలోనే ఉంది. మా

అమ్మా, నాన్న ఇద్దరూ చాలా కాలం క్రిందటే చనిపోయారు. ఈ మధ్యవరకూ, మా నాయనమ్మ ఒకామె నా ఆలనా పాలనా చూస్తుండేది. నిరుడేడాది ఆమె గూడా దేముడి దగ్గరకు వెళ్లి పోయింది. ఇప్పుడు నేను ఒంటరి వాడ్ని.''

''ఇంకెంతకాలం లెండి? మీకు తోడువస్తోంది గదా త్వరలోనే! అయినా అంతటి పెద్ద కొంపలో లక్ష్మణరావూ, జయా, తండ్రీ కుమార్తె లిద్దరే ఎలా ఉంటున్నారో! పని మనుషులున్నారనుకోండి! అది వేరే విషయంగదా?''

''అయితే మీకు జయ తండ్రి మళ్లీ వివాహంచేసుకున్న విషయం రాయలేదా?'' సుందరం అడిగిన ప్రశ్నకు మమత ఆశ్చర్య పోయింది.

''ఏమిటీ? లక్ష్మణరావు వివాహం చేసుకున్నాడా? ఇన్ని సంవత్సరాలు కుమార్తె కోసం వివాహమాడకుండా ఉన్నవ్యక్తి, ఈ వయసులో పెళ్లి చేసుకున్నాడా? ఆశ్చర్యంగా ఉందే? కుమార్తెకు పెళ్లి చేయాల్సింది పోయి, తనే ముందు చేసు కున్నాడా?''

''లక్ష్మణరావు పాలరాయి వ్యాపారంమీద మద్రాసు వెళ్లా డట. అక్కడే ఆతనికి వరలక్ష్మితో పరిచయం అయి, క్షణాల మీద రిజిస్ట్రార్ సమక్షంలో పెళ్లాడి, ఆమెతో ఇంటికి తిరిగి వచ్చాడు. వరలక్ష్మి, తన పోషణలో ఉన్న చెల్లెలు పద్మినీ, తమ్ముడు నాగరాజులను గూడ తన వెంటే తెచ్చింది.''

''పాపం! జయకు తల్లి ప్రేమ ఎలా ఉంటుందోతెలీదు, కాని తండ్రి పాలనలో ఆమెకేలోటు రాకుండా జరిగిపోతున్నది. ఇప్పుడా తండ్రి, ఈ వయసులో మరో సుందరాంగిని భార్యగా జేసుకుని తెచ్చుకున్నాడంటే, జయకు అది పెద్ద షాక్‌గా పరిణమించి ఉండాలి.''

"నిజానికి ఆమె సవతి తల్లి జయను ప్రేమగానే చూసు కుంటూన్నది. అయితే జయకు మాత్రం, ఇంతకాలం తనను మరచిపోయి మరో వగలాడివలలో పడ్డాడని ఎంతో బాధ పడింది." సుందరం దీనంగా చెప్పాడు.

"వరలక్ష్మి స్వభావం ఎలాటిది?"

"ఆమె మంచి అందగత్తె. నెమ్మదైన స్వభావంకలది. ఇల్లూ, భర్తా అంటే ఆమెకు అభిమానం. కాకపోతే వయసు మీరినా వాడ్ని పెళ్ళాడింది. పైగా పట్నంలో నివసించిన వ్యక్తి, ఈ అడవిలో ఒక సినిమాగానీ, లేదా షాపింగ్ సౌకర్యం గానీ లేకుండా ఎలా నివసించ గలుగుతున్నదా అనే నా అనుమానం!"

"ఆడవాళ్ళు కొత్త పరిసరాలకు ఇట్టే అలవాటు పడి పోతారు. ఆమె చెల్లెలూ, తమ్ముడూ ఎలాంటి వారోచెప్పండి?" మమత కుతూహలంగా అడిగింది.

"ఆమె చెల్లెలు పద్మిని గూడ అందమైనదే! మీరా అంత అందగత్తె కాదనుకోండి. మంచి కలుపుగోలుతనం గలవ్యక్తి, కాని ఆమెకు అంతలోనే కోపం, అంతలోనే దుఃఖం కలుగు తుంటయ్. ఒట్టి అసూయా పరురాలిలా తోస్తుంది. ఆమె తమ్ముడు నాగరాజు నాజూకు మనిషి. పైగా సుకుమారుడు. ఆడపిల్లగా పుట్టాల్సింది, పొరబాటున మొగపిల్లవాడిలా పుట్టాడు."

"అంత అసూయా పరురాలితో జయ ఎలావేగుతోందో?"

"పద్మినికీ, నాగరాజుకీ ఈ అడవిలో భవంతి సుతరామూ నచ్చలేదు. అంత అందంగా కట్టిన పాలరాతి భవంతిని చూసి అదేదో ఈజిప్టు రాజులు కట్టించిన సమాధిలా ఉందని గేలి చేశారు."

"ఇంతకు పూర్వం ఆ భవనం బోసిగా ఉండేది. ఇప్పుడు ఈ జనాభాతో ఇల్లు నిండుగా ఉండి ఉంటుంది!"

"అవుననుకోండి! కాని ఆ ఇంట్లో ఇరవయ్ ఎనిమిది గదులున్నయ్. ఒక్కొ గదిలో ఒక్కొక్కళ్ళు కూర్చున్నా ఇంకా మిగిలి పోతయ్. అన్నట్టు మీాకు జయ పెత్తల్లి జలజమ్మ వచ్చినట్టు చెప్పలేదు గదూ?"

"ఆవిడ అక్కడెక్కడో దూరదేశాన ఉండేదికదూ?"

"అవును. ఆమె జయ పెళ్లికని ఇప్పటికి రెండువారాల ముందే వచ్చి, ఆ ఇంట్లోతిష్ట వేసింది."

ఇద్దరూ నవ్వుకున్నారు పెద్దగా.

"ఆ ఇంట్లో నౌకరుగా గత పదేళ్లనుంచీ ఉంటున్న కామమ్మ మీాకు తెలుసనుకుంటాను?" సుందరం అడిగాడు ఈ దఫా.

"అవును తెలుసు. జయ తల్లి చనిపోయేక ఈ కామమ్మే జయను కన్న తల్లిలా పెంచిందట. లక్ష్మణరావు ఆమె పేరిట ఒక యిల్లు గూడా కట్టించాడు గదూ?"

"నిజమే! అయినా కామమ్మ ఎక్కువగా పాలరాతి భవంతిలోనే ఉంటుంది. రాత్రిళ్లు గుర్రపు బగ్గీలో ఆమెను ఇంటి దగ్గర దిగవిడిచి వస్తాడు బగ్గీతోలేవాడు."

గుర్రపు బగ్గీ మలుపు తిరిగింది. దూరంగా ఇళ్లు కనబడుతూ ఉన్నయ్.

మహా సముద్రంలో చిన్న ద్వీపంలా, అంతపెద్ద, దట్టమైన అడవి మధ్య ఊరు కనుపించింది. అడవిలో చాలా ఎత్తయిన చెట్లు దట్టంగా ఉన్నయ్. మెడ విరుచుకునితలపైకెత్తితేగానీ వాటి శిఖరాగ్రాలు కనుపించటం లేదు.

అడవి మధ్యలో ఉన్న ఊరిలోకి ప్రవేశించింది బగ్గీ. ఈ

రోడ్లమీద కార్లయితే రెండు రోజుల్లో చెడిపోతాయ
గుర్రపు బగ్గీని వాడుతున్నారల్లే ఉంది, అనుకున్నది మమత
చిన్న గుడిసెల మధ్య చిన్న డాబా కనుపించింది. "అది
అదే కామమ్మ ఇల్లు." అంటూ చూపించాడు సుందరం.
కేవలం ఒక పనిమనిషికి, ఆమె ఎంత నమ్మకమైనదే అయి
ఎన్నేళ్ల నుంచీ ఆ ఇంటికి సేవ చేస్తున్నాగానీ, పనిమని
అంత మంచి ఇల్లు కట్టించడం అబ్బురంగా తోచింది మమత
రోడ్డు వెంట మిట్ట పల్లాలను తప్పిస్తూ, అతి నేర
నడుపుతున్నాడు సుందరం, బగ్గీని. దాన్ని బట్టి,
చుట్టుపట్ల ప్రతి అంగుళం మేరా అతడికి బాగా తె
ఉండాలనుకుంది ఆమె.

రోడ్డుకు పదిగజాల దూరంలో పెద్ద అగాధం ఉ
రోడ్డు వైపుగా మాత్రం రాతి స్థంబాలు పాతబడి ఉన్న
రాత్రివేళ చీకట్లో బండ్లు అగాధంలో పడకుండా. అగాధ
మరో ప్రక్క అడవి ఉంది. రెండుగజాల వెడల్పున, అగా
అంచునే చెట్ల ప్రక్కగా, కాలిబాట పోతున్నది. మరి మి
రెండు వైపులా అడవి ఆక్రమించుకుని ఉంది.

"ఆ కనుపించే అగాధం చూశారా? అదే పాలరాయి లక
క్వారీ. ఇదివరలో అక్కడ పెద్దకొండ ఉండేది. పాలర
తవ్వకం మూలాన కొండ తరిగిపోయి, అగాధం ఏర్పడి
ఆ క్వారీ మీదనే లక్ష్మణరావు లక్షలు గడించాడు."

"అగాధంలో నీళ్లుగూడ ఉన్నాయి?"

"అవును. వానలకు నీళ్లు నిలుస్తయ్. ఆ చెరువు గ
లోతుగానే ఉంటుంది."

గుర్రపు బగ్గీ మరో మలుపు తిరిగి ఆగింది.

ఎదురుగా రెండంతస్తుల తెల్లని పాలరాతి భవనం ఉం

"చూడండి మిస్టర్ సుందరం. మనం ఇంత దూరం
ాట్లాడుకుంటూ ప్రయాణించాంకదా? మాట వరసకైనా
్కసారి జయ ప్రస్తావన తేలేదు మీారు. నేనా పేరు ఎత్తితే
ారు అదోలా బాధ పడుతున్నారు. మీా ప్రవర్తన నాకర్థం
వటంలేదు."

"ఈ పాలరాతి భవంతిని చూస్తుంటే, ఇదోనివాస మంది
లా కనుపించటం లేదు నా కంటికి. వెనుకటి పాదుషాలు
ో చనిపోయిన తమ ఆప్తులకు నిర్మించిన సమాధిలా
ూ? నా అనుమానం నిజమై, దాని తాలూకు చాయలు
్రడే జయను ఆక్రమించుకున్నాయ్." ఏదో వేదాంతిలా
ాట్లాడాడు సుందరం.

"ఏమిటీ? మీారేం మాట్లాడుతున్నారో నాకు ఒక్కముక్క
డా అర్థం కావటం లేదు."

"ఇంట్లోకి వెళ్లాక అన్నీ వాటంతటవే మీాకు అర్థం అవు
ు లెండి." సందరం చిరునవ్వు నవ్వాడు.

మమత బగ్గీలోంచి దిగింది. క్షణాల్లో ఆమె మనసు
పోయింది. తనను రిసీవ్ చేసుకోవడానికి జయగూడా
ునుకు వస్తే బాగుండును అనుకుంది. కానీ ఆమెరాలేదు.
ు బదులుగా వచ్చిన సుందరం కాబోయే తన భార్య గురించి
మాటైనా మాట్లాడక పోవడం ఇంకా విడ్డూరంగా
ంది. ఈ పాలరాతి సమాధిలాంటి భవనంలో తనకోసం
ఎన్ని విడ్డూరాలు కాచుకుని ఉన్నాయో అనుకుంటూ
లోంచి నడుచుకుంటూ ఇంట్లోకి అడుగుపెట్టింది
ుత.

ఒమ్మంలోనే లక్ష్మణరావు ఎదురు పడ్డాడు ఆమెకు.

"ఏమ్మా. ప్రయాణం బాగానే గడిచిందా? మీ అమ్మా నాన్న కులాసాయేగా?" అంటూ కుశల ప్రశ్నలతో సాదారం ఆహ్వానించాడు.

లక్ష్మణరావు మంచి పొడగరి. పైగా కండలు దిరిగి ఎర్ర హుందాగా ఉంటాడు. తెల్లని గుబురు మీసాలు అతడి మిలిట సర్వీసుని గుర్తుకు తెస్తాయి.

హాల్లో సోఫాలో కూలబడింది మమత. లక్ష్మణర నౌకర్ని కేకేసి కూల్ డ్రింక్ తెప్పించి ఇచ్చాడు.

"లక్ష్మి! ఇలారా!" అంటూ పిలిచాడు లక్ష్మణరావు.

మేడమెట్లు దిగుతూ ముప్పయ్యేళ్ల స్త్రీ కనుపించిం ఆమె అందంగా ఆకర్షణీయంగా ఉంది.

"ఈ అమ్మాయేనా మమత అంటే! ఏమిటో అమ్మా మీ జయ గురించి మేం ఎంత తల్లడిల్లి పోతున్నామో!"

"వరలక్ష్మి. అవన్నీ నిదానంగా మాట్లాడుకోవచ్చు. ముం ఆ అమ్మాయి స్నానానికి ఏర్పాట్లు చూడు," లక్ష్మణ ఆమెకు అడ్డు తగిలాడు.

"అవునండీ! జయ తనే రాలేక పోయిందా స్టేషను ఈ కొత్త పెళ్ళికొడుకు చూస్తే, ఆమె పేరు ఉచ్చరి టానికే సిగ్గు పడి పోయాడనుకోండి." అంది, పెట్టె, బెడ్డి మోసుకుని అప్పుడే లోపలకు వస్తున్న సుందరాన్ని చూపు

"ముందు నీవు స్నానం చేసిరా తల్లీ! ఆ విషయాలన్నీ వాత మాట్లాడుకోవచ్చు!" లక్ష్మణరావు ముఖంలో వి రేఖలు అలుముకున్నయ్.

మమత మనసు కీడుని శంకించసాగింది. తను వస్తున్న తెలిస్తే చాలు, జయ, గేటు దగ్గరే ఎదురయి నానా హంగ చేసేది. అటువంటిది ఈ దఫా ఆమె అసలు కంటికే

డలేదు, ఇంట్లోకి వచ్చినాగాని.

"మామయ్యా! నేను వెళ్ళొస్తాను. మళ్ళీ కలుస్తానండీ."
ందరం, లక్ష్మణరావువద్దా, మమత వద్దా సెలవు తీసు
న్నాడు.

"హల్లో సుందరం. ఎప్పుడొచ్చావ్! అప్పుడే వెళ్లిపోవటానికి
ల్లేదు. నీకోసం ఎంత సేపటినుంచి ఎదురు చూస్తున్నా
ుసునా?" మేడ మెట్లు మీాదనుంచి చక చక, చిన్నపిల్లలా,
ుతూ మరో సుందరాంగి, సుందరం దగ్గరకు పరుగెత్తుకు
్చింది.

"సారీ పద్మినీ! నాకవతల చాల అర్జెంటు పనులున్నయ్!"
ందరం ముఖం నల్లగా మాడి పోయింది.

"నాకు తెలుసులే! నీ అర్జెంటు పని ఏమిటో! జయకోసం
కటమేగదా?"

"పద్మినీ! ఏమిటా అధిక ప్రసంగం!" లక్ష్మణరావు
ంచాడు.

పద్మిని మాటలకు మమతకు మతిపోయినంత పనయింది.
ును వెదకటమా? ఆమె ఎక్కడకు వెళ్లింది. ఆమెకు
యింది? అయితే ఇంతకూ జయ ఇంట్లో లేదన్నమాట!
పోతే క్షణాలమీాద తనముందుకు వచ్చి వాలి ఉండేదికదా?
సుందరం వెళ్లిపోయాడు చడీ చప్పుడు లేకుండానే.

"ఈ అమ్మాయి పద్మిని, ఇందాక నిన్ను పలకరించింది నా
్య వరలక్ష్మి, పద్మిని నాభార్య చెల్లెలు, అడుగో, ఆ మూల
్లో కూర్చుని చదువుకుంటున్న వాడు నా బావమరిది
రాజు. వరలక్ష్మితో నాకు ఇదివరకే పరిచయం అయింది.
న్న మద్రాసు వెళ్లినపుడు మేమిద్దరం ఒక నిర్ణయానికి
ం, అప్పటికప్పుడే పెళ్లి చేసుకోవటం జరిగిపోయింది."

శాంతపడిన లక్ష్మణరావు నిదానంగా చెప్పాడు.

"అలాగా? ఇన్నాళ్ళూ ఈ ఇంట్లో జయ ఒక్కతే బిక్కు బిక్కుమంటూ ఉండేది. ఇప్పుడామెకు ఆడతోడు దొరికిందన్న మాట?" మమత చిరునవ్వుతో అంది.

లక్ష్మణరావు ఊరట చెందాడు, ఆమె మాటలకు. ఈ వయసులో తను వివాహం చేసుకున్నందుకు, ఆఖరుకు ఇంటికి వచ్చిన అతిథి మమత గూడ దుయ్యబడుతుందేమో అని ఇంతదాకా కుతకుతలాడి పోతున్నాడు.

"పద్మినీ! అమ్మాయికి పైన జయ రూమ్‌లోనే బస ఏర్పాటు చేయి." అన్నాడు లక్ష్మణరావు పద్మిని నుద్దేశించి.

# 4

పద్మిని వెంట మమత మేడ మెట్లెక్కి పైకి వెళ్ళింది. పద్మిని అందంగానూ, ఆకర్షణీయంగానూ ఉంది. ఆమె సుందరాన్ని పెళ్లి చేసుకోవాలని ఉబలాట పడుతున్నదేమో. అయినా సుందరానికి జయతో నిశ్చితార్థం అయిందని తెలిసి గూడా అతనిపై ఆశ పెట్టుకోవటమేనా?

జయ వివాహమాడబోయే వ్యక్తితో, ఆమె కళ్ళెదుటే ఈ పద్మిని ప్రేమ వ్యవహారం మొదలెట్టి ఉంటుంది. అసలే ఆమె ప్రాణ ప్రదంగా చూసుకునే తండ్రి సైతం, కన్న కూతురి పెళ్లికంటె ముందుగా తను జీవితంలో మరోసారి పెళ్లి కొడుకై, తన కొత్త సంసారాన్ని వెంటబెట్టుకుని మరీవచ్చాడు. ఆ దుఃఖంతోనే కుమిలిపోయే జయకు ఈ పద్మిని చేష్టలు రోకటి పోటులా బాధించి ఉంటుంది. దాంతో ఆమె ఆత్మ హత్యకు తల పడిందా? లేక మతిస్థిమితం కోల్పోయి ఈ అడవిలో దిక్కు తెన్ను తోచక బాధ పడుతోందా?

"సుస్వాగతం మమతగారూ. ఈ పాలరాతి సమాధిలాంటి

ఈ భవంతిలోకి మీరు రావటం మాకు ఎంతో ఆనందంగా ఉంది. ఎండలో పోయే ప్రయాణికుడిపై తొలకరి జల్లు పడ్డట్టు హాయిగా తోస్తోంది మీరాక '' పలికాడు అప్పుడే పైకి వచ్చిన నాగరాజు.

''ఒరేయ్! నీ పైత్యపు కవిత్వం ఇక్కడ కట్టిపెట్టు! ముందు బయటకు పోతావా? బావని పిలవనా?'' అంతలోనే పద్మిని సీరియస్‌గా అయి పోవడం చూసిన మమత ఆశ్చర్య పడింది.

ఈ పద్మినికి కోపతాపాలుఎక్కువలా ఉన్నాయే! కాకపోతే అంతలోనే అసూయ, అంతలోనే కోపాన్ని ప్రదర్శిస్తున్నది. సుందరాన్ని తనవాడిగా చేసుకోవాలనే అహంతో ఈ వయ్యారి పద్మిని, తన స్నేహితురాలు జయకు ఏదైనా ఆపద తలపెట్ట లేదుకదా!

''పైత్యపు కవిత్వంకాక నీవు సుందరానికి అప్పగించినట్టుగా ప్రేమ పాటాలు అప్పజెప్పనా?'' నాగరాజు వెటకారంచేశాడు.

ఏది ఏమయినా సొంత అన్నా చెల్లెళ్లు అలా పోరాడుకోవడం మమతకు సుతరామూ నచ్చలేదు.

పద్మిని కొంత తగ్గింది. ''చూడు నాగరాజూ! నా కోసం కాకపోయినా, మన అతిధి మమత గురించైనా, ఇక్కడనుంచి వెళ్లిపో!'' అన్నది.

''అలా అన్నావ్ బాగుంది! మమతగారు మనల్ని అపార్థం చేసుకోకూడదనే వెళ్తున్నాను నేను! మమతగారూ! మా మాట లు కటువుగా ఉంటయ్. కాని మేం అంత కటినులంకాము.. మీరే చూస్తారుగా! స్నేహానికి ప్రాణం ఇచ్చే తత్త్వం మాది! నాగరాజు బయటకు వెళ్లి పోయాడు.

''ఏమిటోనండీ మమతగారూ! ఈ అడవిలో మేమే బాధ

పడుతుంటే మీరుగూడ వచ్చారు. అడవిలో మృగాలుండవల సిందేకాని, మనుషులు నివసించలేరు. పట్నవాసాలకు అలవాటు పడిన వారు అసలే ఉండలేరు.'' పద్మిని విసుగ్గా చెప్పింది.

మమత చిరునవ్వులతో ఊ కొట్టింది. తను డ్రెస్ మార్చు కోవాలి. ఈమె వెళ్ళిపోయేలా కనుపించటంలేదు. తనున్న పోర్షన్‌వంక చూసింది.

అందులో డ్రాయింగ్ రూమ్, బెడ్‌రూమ్ రెండున్నయ్. చాలా విశాలంగా ఉన్నయ్. డ్రాయింగ్ రూమ్‌లో రెండు సోఫాలు, మధ్యగా టీపాయ్, ఒక ప్రక్కగా పెద్ద బీరువా, బహుశా జయ గుడ్డలదై ఉంటుంది, ఉన్నాయి. ఇంకా స్టాండ్ మీద జయ రెండురోజుల క్రితం విడిచిన చీరలు అలాగే పడి ఉన్నాయ్.

''ఏమిటా ఈ అమ్మాయి ఉన్నమాట ఉన్నట్టుగానే ముఖానే కుండ బద్దలు కొట్టినట్టుగా చెబుతోంది అని ఆశ్చర్య పడుతున్నారా? నా తత్వమే అంత. అంతేకాదు. నేనేది అనుకుంటే అది జరుపుకుతీరతాను. సరిగా జయది నాకు వ్యతిరేకమైన తత్వం అనుకుంటాను!''

''అఫ్‌కోర్స్! జయ మీ అంత ముక్కుకు సూటిగా మాట్లాడలేదు. పద్మినీ! నేనొకటి అడుగుతాను. నిజం చెబుతావా?'' మమత లాలనగా అడిగింది. ఆమె హృదయం జయ గురించి నిజాన్ని తెలుసుకోవటానికి ఆరాటపడుతోంది.

''అడగండి! నాకు తెలిసినదైతే తప్పక చెబుతాను!''

''జయ నన్ను ఉన్న పళాన రమ్మనమని ఉత్తరం రాసింది. తీరా నేను వచ్చాక ఆమె కనుపించలేదు. ఆమె ఏమయింది? ఎక్కడకు వెళ్ళింది?''

పద్మిని ఒక్కసారి నిట్టూర్చింది. ''ఈ రహస్యం బయ

టకు పొక్కరాదని మా బావ లక్ష్మణరావు కట్టడి చేశాడు. నేను చెప్పానని మాత్రం మీరు వెల్లడి కానీయద్దు. లక్ష్మణ రావు తన నోటంట చెప్పేదాక, మీకీ విషయం తెలియనట్టే ఉండాలి. సరేనా?''

''అలాగే! మాట ఇస్తున్నాను సరా? ఆమెను కలుసుకోవాలని నాకు ఆతృతగా ఉంది.''

''జయను ఇక ఎన్నటికీ మీరు కలుసుకోలేరు?''

''అంటే?'' మమత నోరు తెరుచుకుని ఉండిపోయింది.

''ఆమె ఈ ఇల్లు వదలి వెళ్లిపోయింది, ఎవరికీ చెప్ప కుండా. ఎక్కడికి వెళ్లిందో తెలీదు. లక్ష్మణరావు ఇరవయి మంది మనుషుల్ని పంపాడు అన్ని వైపులకూ, ఆమెను వెదికే టందుకు! రెండో రోజు గడుస్తున్నా ఆమె జాడ ఇంతవరకు తెలీలేదు. బహుశా చచ్చిపోయిందేమో అని నా అనుమానం!''

పద్మిని చెప్పిన మాటలకు మమత నెత్తిన పిడుగు పడినట్ట యింది.

# 5

స్నానం పూర్తి చేసుకుని మమత డైనింగ్ హాల్లోకి వెళ్లింది. ఆమె ముదురు నీలం రంగులో జపాన్ నైలెక్స్ చీర కట్టు కుంది. జయ, మమత ఇద్దరూ అదే రకం చీరలు కొను కున్నారు, క్రితంసారి సిటీకి వెళ్లినప్పుడు.

డైనింగ్ టేబుల్ చుట్టూ అప్పటికే లక్ష్మణరావు, నాగ రాజు, పద్మినీ కూర్చుని ఉన్నారు. వరలక్ష్మి టేబుల్ మీద అన్నీ అమరుస్తున్నది. అక్కడ మరో కొత్త వ్యక్తి కనుపిం చింది మమతకు. ఆమె జలజమ్మ. జయ పినతల్లి. మమతను నీలం చీరలో చూస్తూనే ''అమ్మా! జయా! వచ్చావా తల్లీ?'' అని అరిచింది ఆమె.

"జలజమ్మా! ఈ అమ్మాయి జయ కాదు! మమత! ఃః
జయ క్లాస్‌మేట్!" లక్ష్మణరావు విచారంగా అన్నాడు.

"ఏమిటీ? మన జయకాదూ? అచ్చం అలానే ఉంటే.
అయితే మన జయ ఇక మనకు దక్కనట్టేనా?" అంట
కండ్ల నీరు ఒత్తుకుంది జలజమ్మ.

"మన ఇంటికి వచ్చిన అతిథికి కన్నీటితో స్వాగతం చెప్ప
భావ్యంకాదు!" లక్ష్మణరావు జోక్యం చేసుకున్నాడు.

"ఏది భావ్యం అవునో, ఏది కాదో నాకు చెబుతున్నా
లక్ష్మణా! ఒక ప్రక్క, కూతురు జాడ తెలియకుండాపోతే, నీ
నింపాదిగా విందులు ఆరగిస్తున్నావా? చూడమ్మా మమత
నీవు ఎవరికోసం వచ్చావో వారు లేరిక్కడ! నీవు వచ్చినదా
వెళ్లవచ్చు!" అంది జలజమ్మ.

"ఏవమ్మోయ్! ఆమె ఈ ఇంటికి అతిథిగా ఎన్నాళ్ళయి
ఉంటుంది. వెళ్లమని చెప్పటానికి నీవెవరివి?" ఈ ద
వరలక్ష్మి, జలజమ్మను కసరింది.

"నేనెవర్నా? దారుణంగా హత్యచేయబడిన జయ పినతల్లి
జయకు నిశ్చయమైన వరుణ్ణి నీ చెల్లెలికి అంటగట్టాల
నీవూ, నీ చెల్లెలూ, నీ తమ్ముడూ కలిసి చేసిన కుట్ర కద
ఇదంతా?" జలజమ్మ పిడికిళ్ళు బిగించి, పళ్ళు కొరుకుత
అంది.

"అబ్బబ్బ! నీవు ఆడదానివి కాదు! బ్రహ్మరాక్షసివి. నీ
వచ్చిన మరునాటినుంచీ ఈ కొంపలో శాంతి కరువైపోయిం
అసలు నీవు ఎందుకు వచ్చినట్టు? పెళ్లిగురించి రెండునె
ముందే వచ్చి తిష్ట వేసుకున్నావ్! ఆ తర్వాత జయ మా
మయింది. ఈ అనర్థాలన్నిటికీ నీవే కారణం! ఇక నోరెత
వంటే తలకాయ చితక్కొడతాను." లక్ష్మణరావు గర్జించాడ

0

అతడికి అంతకోపం రాగా ఎన్నడూ చూడలేదు మమత. ...ా మామూలుగా శాంతంగా ఉండే మనిషి, అంతగా కోపగించు ...ంటున్నాడంటే, ఎంతో విచారంలో ఉండి ఉంటాడనుకుంది ...మమత.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్న వాళ్ళ ముఖాలన్నీ ...వార గ్రస్తంగా ఉన్నయ్.అసలే జయ జాడతెలియక అందరూ ...ధ పడుతుంటే, ఈ జలజమ్మ మాటలు శూలాల్లాగ ...చ్చుకుంటున్నయ్.

"మా ఇంట్లో పనిచేసే కామమ్మ తెలుసుగదూ నీకు?" ...క్ష్మణరావు మమత వంక చూస్తూ అడిగాడు.

"తెలియకేం? గత పదేళ్లనుంచీ ఇక్కడ నమ్మకంగా చేస్తు ...ది కదూ? జయను సాకింది ఆమే గదా?"

"అవును! ఆమెకు జ్వరంగా ఉంటే చూసిరావటానికి ...ళ్ళింది జయ. వాళ్లింట్లో సాయంత్రం దాకా ఉండి, పొద్దుగూకే వేళకు ఇంటికి మరలిందట. దగ్గరదోవఅని, ...లరాతి క్వారీ ప్రక్కగా, అదే అగాధం లేదూ, నీవు వచ్చే ...వలో, ఆ దోవన బయలు దేరిందని కామమ్మ చెప్పింది. ఆ ...వేవ వెంట వెళ్ళవద్దని కామమ్మగూడ వారించిందట. అంతే! ...య ఇంటికి రాలేదు ఎటు వెళ్లిందీ తెలియలేదు."

"క్వారీ అగాధంలో పడిపోయిందేమో వెదికారా!?" మమత ...డిగింది.

"అక్కడా వెదికించాం! నీళ్లల్లో బోటువేసుకుని మరీ, ...గాధంలోని నీళ్లంతా కలయబెట్టి మరీ వెదికారు. బెస్త ...ళ్లను పిలిపించి, నీళ్ల అడుగున గూడా వెతికించాం! జయ ...డ తెలియలేదు! నా కన్నతల్లి ఎక్కడుందో? ఎన్ని అవస్తలు ...

"ఒకవేళ నాకోసం బయలుదేరిందేమో? రైల్వేస్టేషన
ఆమె అటుగా వచ్చిందేమో వాకబు చేశారా?"

"అదీ అడిగి చూశాం! ఆమె ఆ చాయలకే రాలేదనిచెప్పార
నాగరాజు అందుకుని బదులు చెప్పాడు.

(

తెల్లవారుతూనే తలుపు తట్టారెవరో. అప్పుడే నిద్రలేచి
మమత లేచి వెళ్లి తలుపు తీసింది.

గుమ్మంలో కాఫీ ట్రే పుచ్చుకొని వరలక్ష్మి నిలబడిఉంది.

"అయ్యో! మీరే వచ్చారా? నేనే క్రిందకు వచ్చేదా
గదా?" అంది మమత నొచ్చుకుంటూ.

"ఫరవాలేదులేవమ్మా! నేను కాఫీ తెచ్చాను గదా! ఈ తడవ
తాగేయ్, అదీగాక జయ ఉన్నన్ని రోజులూ నేను ఈ గదిలో
వచ్చిన పాపాన పోలేదు, కాదు! కాదు! జయ నన్ను రానీయలేద
ఈ రకంగానన్నా ఆమె గది చూస్తాను." అంది ఆమె.

ఎంతైనా వరలక్ష్మిని అంతగా జయ బాధించినట్లు తెలి
మమత బాధ పడింది, కాఫీ త్రాగాక ట్రే తీసుకుని వరలక్షి
వెళ్లి పోయింది.

మమత బాతురూమ్‌లోకి వెళ్లి పళ్లు తోముకుని, ముఖ
కడుక్కొని, మళ్లీ బెడ్‌మీద వాలి పోయింది బద్ధకంగా.

తను వచ్చి గూడా ఒకరోజు గడిచింది. జయ జాడ తె
యలేదు. కనీసం ఆమె ఇంట్లోంచి పారిపోవాల్సినంత బా
ఎందుకు కలిగిందో? తనకు నెలకు రెండుసార్లన్నా ఉత్తరా
రాసేది. ఆ ఉత్తరాల్లో అన్నా, తనకు ఫలానా కష్ట
వచ్చిందని మాట వరసకైనా రాయలేదే?

ఆమె మాయం అవటానికి ఎవరు కారకులై ఉంటారు
మొదటి కారణం లక్ష్మణరావు అవచ్చు. కుమార్తె వివాహ

యేదాకానన్నా అతడు తన వివాహం వాయిదా వేసుకుని
ండాల్సింది. చెప్పా చెయ్యకుండా, తన కంటికి నచ్చిన స్త్రీని
వాహమాడి, నేరుగా ఇంటికి తెచ్చుకోవటం, జయకు తీరని
ుఃఖాన్ని కలిగించి ఉంటుంది.

ఆ దు:ఖంతో ఆమె ఇంటికి దూరమైపోయి, తనగురించి
ండి కుమిలి పోతుంటే తద్వారా తన కసి తీరిందని సంతో
స్తూ ఉంటుందా?

కొత్తగా ఇంటికి వచ్చిన వరలక్ష్మి పాత్ర ఎంతవరకుంది,
యు అదృశ్యమవటంలో. ఎంతైనా ఆమె సవతి తల్లి. జయ
లన పోషణ చేసే బాధ్యత ఆమెదే! జయను హత్యచేసి, ఆ
్థనంలో తన చెల్లెలు పద్మినిని కూర్చోబెట్టాలనీ పద్మినికి
ుందరంతో పెళ్ళి చెయ్యాలనీ వరలక్ష్మి ఈ పనికి పాల్పడిందా?

పద్మిని స్వతహాగా గిల్లి కజ్జాలు పెట్టుకునే స్వభావం
ుది. ఆమె ఏది కోరితే అది నెరవేర్చుకొనే తత్వం ఆమెది.
ొండమీద కోతి కావాలన్నా తెచ్చి పెట్టాల్సిందే! ఆమెను
యు వివాహమాడబోయే సుందరం ఆకర్షించాడు. అతడ్నే
నూ పెళ్ళి చేసుకోవాలని కోరిందా?

అదే గనుక నిజమయితే ఆమె జయను హత్య చేసేందు
ుయినా వెనకాడదు? మరి ఈ పని ఆమె ఒక్కదానివల్ల అవదు.
ందుకు సుందరంగూడ పద్మినితో సహకరించాడా!

లక్ష్మణరావు, వరలక్ష్మి, నాగరాజు, సుందరం, పద్మిని
ంతా జయ మరణానికి కారకులే. అయితే జయ చని
యిందనటానికి ఇంకా ఏ ఆధారమూ దొరకలేదు కనుక
ంకా ఆమె బ్రతికున్నదనే అనుకోవాలి.

పద్మిని, జయ పినతల్లి జలజమ్మ, వీరిద్దరూ జయ చని
యిందని రూఢిగా చెబుతున్నారు. వీరికేమైనా జయ

అంతర్ధానంలోని రహస్యం తెలుసునా?

ఈ విషయమై పద్మినిని అడిగినా ఆమె నిజం చెబుత
దన్న ఆశలేదు. జలజమ్మను వాగిస్తే ఏమైనా కొంత సవ
చారం బయటపడవచ్చు.

మమత మేడ మెట్లు దిగి డ్రాయింగ్ హాల్లోకి అడు
పెట్టింది. సోఫాలో కూర్చుని నాగరాజు ఇంగ్లీషు పేప
చదువుతున్నాడు. మరో సోఫాలో జలజమ్మ తెలుగు ది
పత్రిక చదువుతోంది.

"శ్రీ కాకుళంలో నక్సలైట్లచే ఇద్దరు గ్రామస్థుల వ
కడపజిల్లాలోని ముఠా తగాదాలవల్ల, రెండువర్గాలలో ఆరుగు
మరణం! ఛీ! ఛీ! ప్రొద్దున్నే లేచి పేపరు చదివినంత బు
తక్కువ పనిలేదు. అన్నీ హత్యలూ, మరణాలే తప్ప వీళ్ల
మరో వార్తే దొరకదేమో!" పైకి పెద్దగా గొణక్కుం
జలజమ్మ.

"జయ విషయం ఏమైనా తెలిసిందా?" మమత ఆ
ర్ధాగా అడిగింది.

జలజమ్మ పేపర్లోంచి తలపైకెత్తి చూసింది." ఇం
ఎక్కడి జయ తల్లీ! ఇదిగో ఈ పేపర్లో మరణ వార్తల మ
రేపో, మాపో ఆమె పేరూ కనబడక తప్పదు."

"మీరు పదే పదే అలా అనటం నాకు బాగోలేదు. జ
నా క్లాస్‌మేటే కాదు. నా ప్రాణ స్నేహితురాలు." మమ
విసుగ్గా అంది.

" ఆ విషయం నాకు తెలుసు! కాని నీవు వచ్చింది జ
కోసం! ఆమె ఇక లేదు. కనుక నీవు ఇక్కడ ఉండటం వృథ
ఎంత త్వరగా తిరుగు ప్రయాణం కడితే అంత మంచిది!"

మమతకు కోపం ముంచుకువచ్చింది. "చూడు జలజమ్మా

ను ఇప్పట్లో చస్తే కదలను! జయ ఆచూకీ తెలియాలి!
ప్పుడు గానీ నేను వెళ్లను. ఏం నాగరాజూ! మీ బావగారు
క్కడికో వెళ్లినట్లున్నారు?''

అంతవరకూ వారిద్దరి సంభాషణతో తనకే మాత్రం
ంబంధం లేనట్లుగా ఊరుకున్న నాగరాజు తలపైకెత్తి మమత
ంక చూశాడు.

''మా బావ సంగతేనా అడుగుతూంది! అడవి మధ్యలో
ున్న కార్చిచ్చుకు రగులుకుని, అందులో ఎవరో స్త్రీ చిక్కు
ని చనిపోయిందని వార్త వస్తే, లక్ష్మణరావు, సుందరం
ద్దరూ వెళ్లారు అక్కడకు!'' చావు కబురు చల్లగా చెప్పాడు
గరాజు.

''భగవాన్! ఆమె జయ కాకూడదనే నా ప్రార్థన!''
మత బాధగా అంది.

''ఏమిటో! ఎవర్ని చూసినా ఏమీ చెప్పరు. జయ ఆచూకీ
తవరకూ తెలీలేదు. ఆమె కేమయిందో ఏమో!'' సోఫాలో
ాలబడుతూ అంది మమత.

''మా కందరికీ ఆ విషయమే హృదయాన్ని కోసివేస్తున్నది.
బాధను బయటకు వ్యక్తం చేయలేక, ఎవరికివారు మౌనంగా
ాస్తూ లోలోపలే కుమిలి పోతున్నాం!'' నాగరాజు నిదానంగా
న్నాడు.

''ఈ నాడు ఇంతమంది పడిన ఆ వేదనను నా చిట్టి తల్లి
్రతే అన్నిరోజులు భరించి ఉంటుంది!'' జలజమ్మ, పాయింటు
ొరికిన ప్లీడరులా అంది.

''జయ ప్రవర్తన ముందు, మాకు కొంత కష్టం కలి
దినా, ఆమెతో సర్దుకు పోవటానికి అలవాటు చేసుకున్నాం.

అయినా ఆమె మాలో తప్పులు వెదికి, ఏదో నెపంతో సా
స్తూనే ఉంది. పద్మినితో అయితే కాట్లకుక్కల్లా పోట్లా
కునేవారు. తన తండ్రి చేసిన పనికి ఆమె మాపై ప్ర
కారాన్ని తీర్చుకున్నదేమో అని నా అనుమానం. అయినా ఆమెన
మేం సహించాం. అంతకంతకూ ఆమెకు తండ్రిపై ద్వేష
ఎక్కువై ఈ ఇంట్లో ఉండడం ఇష్టం లేక పారిపోయిందని న
అనుమానం. కాని ఈ అడవి ప్రాంతం అందమైన అమ్మా
యిలు పారిపోయేందుకు అనువైనది కాకపోగా, మరిం
ప్రమాదకరమైనది. పులులూ, ఎలుగుబంట్లూ, విష సర్పాలూ
మాన ప్రాణాల్ని రెంటినీ హరించే మోటు మనుష్యులు
వీళ్లతో అడుగడుగునా ఆపదలే!"

"అయితే ఆమె ఈ పాటికి ప్రాణాలు కోల్పోం
ఉంటుందా?" మమత విచారంగా అడిగింది.

"అదీ చెప్పలేం! ఆమె అడవిలో చనిపోయిఉంటే ఆ ప్ర
శంలో ఆకాశంలో గ్రద్దలు ఎగురుతూ ఉంటయ్. ఆమె శవ
కంటబడేదాకా చనిపోయిందని నమ్మటానికి వీల్లేదు."

"నాగరాజూ! జయను వెదకటానికి నీవు వెళ్లలేదేం?
మమత అనుమానంగా చూసింది.

నాగరాజు నవ్వాడు. "మేం ఇక్కడకు వచ్చి ఎన్నోరోజుల
కాలేదు. ఈ అడవి ప్రాంతం నాకు కొత్త. అడవిలో నేనెక్క
డన్నా తప్పి పోయానంటే, నాకోసం గూడ మరో జట్టు వె
కాల్సి ఉంటుంది"

జలజమ్మ పేపరు సోఫాలో పారేసి ఇంట్లోకి వెళ్లిపోయింద

"ఈవిడ వాలకం చూస్తుంటే నాకు ఒళ్లు మండుతోంది
జయ చచ్చిపోయిందని నాక్కి మరీ చెబుతుంది." అంది మమత

"సరేలే! ఆమె ఈ ఇంట్లో అడుగు పెట్టిన రోజుయి

మ్మల్నందర్నీ హంతకులూ, దోపిడీ దొంగల్లా చూసింది.
రా మాటలంది. తన బావ లక్ష్మణరావుకి మందోమాకో పెట్టి
పరచుకుని, జయకు అన్యాయం చేశామని అరిచింది. క్రమేపీ
ం ఆవిడ మాటల్ని లక్ష్య పెట్టటం మానేశాం.''

అంతలోనే వాకిట్లోకి గుర్రపు బగ్గీ వచ్చి ఆగింది. బగ్గీ
ంచి లక్ష్మణరావు దిగి లోపలకు వచ్చాడు, అతడేం వార్త
స్తాడో అని అందరూ అతడి ముఖం వంకే ఆతృతగా
స్తున్నారు.

"అడవిలో కార్చిచ్చు మంటల్లో చనిపోయిన స్త్రీ మన
ముకాదు! మరెవరో స్త్రీ!'' జేబుగుడ్డతో ముఖం మీద
ంట తుడుచుకుంటూ చెప్పాడు లక్ష్మణరావు.

"హమ్మయ్యా! ఏ చెడ్డ వార్త వినవలసి వస్తుందో అని
ం ఇందాకటి నుంచి బాధ పడుతున్నాను.'' వరలక్ష్మి తేలికగా
ట్టూర్చింది.

రాత్రయింది, అందరి ముఖాల్ని విచారం పులుముకుంది.
ఎకి వారు మౌనంగా, లోలోపలే బాధ పడుతూ బెడ్‌మీద
పోయారు.

మమత తన గదిలోకివెళ్ళి తలుపుమూసి గడియపెట్టింది.
గదిలో కొవ్వొత్తి వెలుగుతోంది. బాతురూమ్‌లోకి వెళ్ళొచ్చి
మీద వాలిపోయింది.

ఆమెకు లైట్లు ఆర్పేసి నిద్రపోయే అలవాటు. కొవ్వొత్తి
గు కొంచెమే అయినా, ఆమెకు చికాకు వేసింది. మళ్లీ లేచి
వ్వొత్తిని ఆర్పేసింది. అవసరమైతే మళ్ళీ వెంటనే వెలిగించ
ఎకి అగ్గిపెట్టెను అందుబాటుగా ఉండే చోట ఉంచింది.
అర్ధరాత్రి వేళ ఆమెకు ఏదో అడుగుల చప్పుడు వినిపించి,

నిద్రా భంగమైంది. చుట్టూ చీకటి, కళ్ళు నులుముకుని అలికిడి విన వచ్చిన వేపు చూసింది. ఆమె గుండె జల్లుమన్నది.

జయ గుడ్డల బీరువా ప్రక్కగా నల్లని ఆకారం నిలబడి ఉంది. ఆ ఆకారం చేతులకు గాజులున్నయ్. దాన్ని బట్టి ఆ వ్యక్తి స్త్రీ అయి ఉంటుందనుకుంది. మమత.

"ఎవరది? వరలక్ష్మి? నువ్వేనా?" అని అరిచింది భయంతో అవతలి వేపునుంచి జవాబు రాలేదు.

ఒక వేళ జయగాని వచ్చిందా అని ఆలోచన కలిగింది ఆమెను "జయా! నువ్వేనా అది! "అంటూ సంతోషంగా అంది.

కానీ ఆ ఆకారం ఉలకలేదు, పలకలేదు.

కొవ్వొత్తి వెలిగిద్దామని అగ్గిపెట్టెకోసం తడిమింది. సమయానికి, భయంలో అదీ చేతికి దొరకలేదు. అగ్గిపెట్టె కోసం వెతుకులాటలో మమత ఆ ఆకారం నుంచి దృష్టి మరల్చింది. తల ఇటు త్రిప్పి, మరోసారి వెదికింది అగ్గిపెట్టెకోసం.

అగ్గిపెట్టె దొరకపుచ్చుకుని, అగ్గిపుల్ల గీసి, క్యాండిల్ వెలిగించింది. మళ్ళీ ఇటు తిరిగి చూసేసరికి ఆ ఆకారంలేదు.

మమత బెడ్‌మీదనుంచి లేచితలుపు దగ్గరకువెళ్ళింది. తను వేసిన గడియ వేసినట్టే ఉంది. అయితే మరి ఆమె ఎలా వచ్చింది? మళ్లీ ఎలామాయ మయింది?

ఆమె దయ్యమేమో? కానేకాదు. ఆమె ఆకారాన్ని, అడుగుల సవ్వడిని తను ప్రత్యక్షంగా చూసింది, విన్నది. అయితే ఆమె ఎటు వెళ్లింది? కిటికీలోంచి బయటకు గాలిలో తేలిపోయిందా ఆ ఆకారం కిటికీ వేపుకు వెళ్లనే లేదు.

ఆ ఆకారం బీరువా ప్రక్కగా వెళ్లటం తనకుశీలగా గుర్తు. కానీ, బీరువావెనుకగా రహస్యమార్గం ఏదన్నా ఉందా?

బీరువా హేండిల్ త్రిప్పితెరిచి చూసింది. లోపల జయ

చీరలూ, జాకెట్లూ, అండర్‌వేర్‌లూ అన్నీ పొందికగా మడతలు పెట్టి ఉన్నయ్. బీరువా లోపల పరీక్షగా వెదకి చూసింది. కాని అందులో ఆమెకు ఎలాంటి రహస్యద్వారమూ కనపడలేదు.

బీరువాపై అరలో జయ పెండ్లి చీర, జాకెట్టూ కనుపించి నయి. అవి చాలా విలువైనవని గ్రహించింది మమత. చీర ఒక్కటే రెండు వేలరూపాయలని లక్ష్మణరావు చెప్పినట్టు గుర్తు. బంగారు రంగులో వెండినేతగలది ఆ చీర. దానిమీద అతి రమ్యంగా ఎంబ్రాయిడరీ ఉంది. జాకెట్‌గూడ అదే రంగులో ఉంది. దానిమీద అక్కడక్కడా పూలూ, లతలూకుట్టి ఉన్నయ్.

ఈ డ్రెస్ ధరిస్తే జయ అందం చూడటానికి రెండుకళ్ళు చాలవు. ఆ శుభక్షణాల కోసం సుందరం ఎంత తపించిపోయి ఉంటాడో?

బీరువా మూసేసి, మళ్ళీ బెడ్‌మీద వాలిపోయింది. అసలా ఆకారం తన గదిలోకి ఎలా రాగలిగింది? తనకు కనిపించటంలో ఆమె ఉద్దేశ్యం ఏమయి ఉంటుంది? తనకు అపకారం తలపెట్ట టానికిగాను వచ్చిఉంటే, తను నిద్రపోతున్నప్పుడు సునాయా సంగా చంపివేసి ఉండచ్చునే? కనుక ఆమె తనకు అపకారంచేసే ఉద్దేశ్యంతో రాలేదు! బహుశా తనను, రానున్న ప్రమాదాల గురించి హెచ్చరించటానికి వచ్చిందేమో!

లేక ఇదంతా పద్మిని తనను భయపెట్టటానికి పన్నిన పన్నా గమా? ఆ గడుసు పిండం ఎంతకైనా తగును? ఈ రకంగాతను జడుసుకొని, ఇక్కడనుంచి త్వరగా ప్రయాణమై తిరిగి వెళ్ళి పోవాలని ఆమె ఆకాంక్షిస్తున్నదేమో!

ఒకవేళ పద్మినికి సుందరంపై ప్రేమ కలిగిందేమో! కానీ అప్పటికే అతగాడితో జయ వివాహం నిశ్చయమైపోయింది.

ఇప్పుడు జయను తొలగిస్తే, సుందరాన్ని తనవాడ్ని చేసుకోవచ్చని ఆమె ఊహించి ఉండవచ్చు.

ఆ ఉద్దేశ్యంతోనే జయను హత్యచేసి, రెండోకంటికి తెలియకుండా మాయంచేసిందా? ఆమెకు తనేవిధంగా అడ్డు తగలలేదు తనపై ఆమెకక్షను తీర్చుకోవాల్సిన అవసరం ఏముంది? ఒకవేళ తను ఆమె హత్యానేరాన్ని వెదికి వెల్లడిస్తానని భయమా?

ఈ హత్యలు చేసేవారు ఎంతకైనా సమర్థులు. ఒకహత్యచేసే వరకే బెరుకుగా ఉంటారు. ఆ తర్వాత ఎంతవరకైనా తెగిస్తారు. మొదటి హత్యను కప్పిపుచ్చుకునేటందుకు మరోపది హత్యలైనా చేయటానికి వెనుకాడరు.

తన గదిలోకి ప్రవేశించిన ఆకారంగురించి ఇంట్లోవాళ్లకి చెప్పాలా, వద్దా? అన్న సంశయం కలిగింది మమతకు, ఒకవేళ ఇది తనను భయపెట్టటానికే గనుక అయితే, ఈఇంట్లో ఉన్న వ్యక్తుల్లో ఈ నాటకాన్ని ఆడిస్తుంటారు కనుక తను ప్రస్తుతానికి మౌనంగా ఉంటే, రాత్రిజరిగిన సంఘటనకు తనెంతగా బెంబేలు పడిందీ' ఆ వ్యక్తి తనను తప్పక గమనించటానికి ప్రయత్నిస్తుంటాడు. వాడ్ని తను ఇట్టే పట్టేయవచ్చు.

తన తెలివికి మురిసిపోతూ బెడ్మీద వాలిపోయి గొంతు వరకూ దుప్పటి కప్పుకుంది మమత.

ఆమె వెలుగుతున్న కొవ్వొత్తి వంకే చూస్తూపడుకుంది. మళ్ళీ కొవొత్తిని ఆర్పే సాహసం ఆమెలో కొరవడింది.

# 9

గుర్రపు బగ్గీ తోలుకుంటూ సుందరం వచ్చాడు. పద్మిని లోపలఎక్కడో ఉన్నట్టుంది. మమత సుందరాన్ని కలవటంకోసం వాకిట్లోకి వచ్చింది.

"లక్ష్మణరావుగారు లేరా?" సుందరం అడిగాడు,"లేరు!

ఎక్కడికో వెళ్లినట్టున్నారు! ఎందాకా మీ ప్రయాణం?''

''స్టేషనుదాకా వెళ్ళాలి. ఫారెస్ట్ ఆఫీసర్ ఎవరో వస్తున్నా డట, తనిఖీకి. ఏం అలా అడిగారు?''

''మరేంలేదు! కామమ్మను ఒకసారి కలుసుకోవాలనుంది. జయ గురించి ఆమెనుంచి కొంత సమాచారం అడగాలని ఉంది. నన్నందాకా దిగడబెడతారా సుందరంగారూ!''

''అలాగే రండి! దానిదేముంది?''

నాగరాజుతో తను కామమ్మ ఇంటికి వెడుతున్నట్టుగా చెప్పి వచ్చి, బగ్గీలో ఎక్కి కూర్చుంది మమత.

గుర్రపు బగ్గీ సాగిపోయింది. అప్పుడు వాకిట్లోకి వచ్చిన పద్మి నికళ్ళు వెళ్లిపోతున్న బగ్గీవంకా, అందులోని ఇద్దరువ్యక్తులవంకా కోపంగా చూసింది, ఆమె కళ్లల్లో నిప్పులు కురిసినయ్.

అగాధం ప్రక్కగాపోతూ గుర్రపుబగ్గీ చిన్నగోతిలో దిగబడి, కుదుపుతో మళ్ళీ పైకెక్కింది.

మమత భయంగా ''ఏమయింది?'' అని అడిగింది.

సుందరంనవ్వాడు. ''మరేంలేదు. నీ లాంటి అందమైన అమ్మాయిని ఎక్కించుకున్నందుకు ఆ గుర్రంకు గూడా ఈర్ష్య కలిగినట్టున్నాది!'' అతడు చిలిపిగా చూశాడు ఆమె వంక.

మమత బుగ్గలు ఎరుపెక్కాయి సిగ్గుతో, అంతలోనే ఆమె, మనసులో మరో ఆలోచన మెదిలింది. సుందరం పద్మినితోగూ డా ఇలానే పరాచకమాడాడా! జయ కళ్లదుటే! జయ గురించి అతడు ఒక్క మాటైనా మాట్లాడకపోవడం ఆమెకు మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

''సుందరం! నీవూ, జయాఏమైనా పోట్లాడుకున్నారా?''

''మేమిద్దరం ఎన్నడూ పోట్లాడుకుని ఎరగం!''

''ఆ భవంతిని నీవుబాగా ఎరుగుదువా సుందరం?''

"ఆ తెలుసు! "

"అందులో రహస్య ప్రదేశాలు అంటేనేలమాళిగలు ఏమైన
ఉన్నాయా?"

"నాకు తెలిసినంతవరకూ లేవు. జయగూడా ఎన్నడూ చె
లేదు అలాంటివి ఉన్నట్టుగా."

"నిన్నరాత్రి నేను నాగది తలుపులు లోపల గడియ వేసుకు
పడుకున్నాను. అర్ధరాత్రివేళ ఏదో ఆకృతి నాగదిలోకి వచ్చింది.
నేను కొవ్వొత్తి వెలిగించే ప్రయత్నంలో ఉండగా ఆ ఆకృ
మాయమయిపోయింది. వేసిన తలుపులు వేసినట్టే ఉన్నా
ఆమె నా గదిలోకి ఎలా రాగలిగింది?"

"ఆ ఆకృతి నీకేంఅపకారం తలపెట్టలేదుగదా"

"లేదు. నా అనుమానం, పద్మిని గానీ, జలజమ్మగానీ నన్న
భయపెట్టేందుకు చేసిన పనేమో అని!"

"అవచ్చు! అన్నట్టు జలజమ్మ నిన్ను ఇంట్లోంచి వెళ్లిప
మ్మని చెప్పిందట గదా?"

"అవును! జయ చనిపోయిందనీ, కనుక నన్ను తిరుగుప్రయా
ణంకట్టమనీ చెప్పింది. కానీ నేను మొండిఘటాన్ని జయ
ఆచూకీ తెలుసుకానిగానీ ఇక్కడనుంచి కదలను."

బగ్గీ ఊరి చివరగా వచ్చింది. సుందరం బగ్గీని ఆపాడ
"అదుగో! అదే కామమ్మ ఇల్లు. ఆమెతో మాట్లాడి ప్రొద్దు
ప్రుంకకముందే ఇంటికి తిరిగి వెళ్లు. అడ్డదోవకదా, త్వరగా
వెళ్లవచ్చని, క్వారీప్రక్కనే వెళ్ళేదోవంట వెళ్లకు. కాస్త అలస్యం
అయినా రోడ్డమ్మటే వెళ్లు".

మమత సరేనని తలూపిందిదిగుతూ. గుర్రపు బగ్గీముందుక
కదిలిపోయింది.

# 10

"ఎవరదీ! తలుపు తీసే ఉంది. నెట్టండి!" లోపల్నుంచి కామమ్మ కంఠం వినిపించింది.

"నేను మమతను కామమ్మా!" అంది మమత, లోపలకు ప్రవేశిస్తూ.

"ఓహో! జయ స్నేహితురాలివా? ఎప్పుడొచ్చావ్? కూర్చోవమ్మా! నాలుగు రోజుల్నుంచి నాకు ఒకటే జ్వరం!"

"అలాగా! పాపం! ఒక్కదానివే ఉన్నట్టున్నావ్? నిన్ను చూసే టందుకు ఎవరూ లేరా?"

"గుర్రపుబగ్గీ కుర్రాడు పొద్దునా, రాత్రీ వచ్చి పథ్యం ఇచ్చి పోతున్నాడు."

"జయ గురించి తెలుసుకోవడానికి వచ్చాను." అంది మమత.

"ఇంకెక్కడి జయ! ఆమె ఎప్పుడో చనిపోయి ఉంటుంది."

కామమ్మ గూడా జలజమ్మలా కటువుగా జయ మరణాన్ని గురించి మాట్లాడడం మమతకు బాధ కలిగింది.

"ఏమిటో! నాకా పెద్దతనం వచ్చేసింది. ఒంటరిదాన్ని, నన్నైనా ఎత్తుకు పోయాడు కాదు ఆ దేవుడు, పండంటి జయను తనలో కలుపుకోకపోతే!"

పనిమనిషి ఇంట్లోకూడా అందమైన పేము కుర్చీలూ, మేజా బల్లా, వంట ఇంట్లో డైనింగ్ టేబులూ, ఇంకా అధునాతనమైన ఫర్నిచర్ ఉండటం, మమతకు అనుమానం కలిగించింది.

"అది సరే కామమ్మా! జయను ఆఖరి సారిగాచూసింది నువ్వేనట! నీ దగ్గర్నుంచి వెళ్లిపోయేటప్పుడు ఆమె మామూలుగానే ఉందా? లేక ఏమైనా బాధ పడుతున్నట్టుగా ఉందా?"

"ఆమె తండ్రి ఈ వయసులో పెళ్ళాడిన వైనంగురించి

చెప్పుకుని ఏడ్చింది. నేనే ఆమెను ఊరడించి పంపాను, నేను వద్దంటున్నా వినక, అగాధం వెంబడే దగ్గర దోవన బయలు దేరింది. అంతే! జయ ఆ తర్వాత కనరాలేదు.,,

"ఇంకా ఏం చెప్పింది?"

"అదే! ఆ వగలాడి తనతో క్షణ క్షణం పోట్లాడుతున్న ట్టుగా చెప్పింది. ఆఖరుకు తను పెళ్ళాడబోయే సుందరాన్ని గూడ ఆమె తన వలలో వేసుకో జూస్తున్నదని చెప్పింది.!"

"ఎవరు? పద్మిని గురించేనా?"

"అవును! దాని పేరు పద్మినో, పిశాచమో! దాని అక్క జయ తండ్రిని లోబరుచుకుంటే, అది జయ కాబోయే భర్తను ఆకట్టుకుంటే, ఇక జయకు ఎవరు దిక్కు?"

"కాబట్టి నా అనుమానం నిజమే నన్నమాట! ఆ లక్ష్మణ రావు కుటుంబమే జయ మరణానికి బాధ్యులనే నా ఉద్దేశ్యం! సరేను కామమ్మా! ఇక నేవెళతాను" అంటూ మమత కూర్చున్న చోటు నుంచి లేచింది.

"చూడమ్మా!నేను లేవలేకుండా ఉన్నాను. స్టౌ వెలిగించి కాస్త కాఫీ కాచి నా గొంతులో పోస్తావా?" కామమ్మ దీనంగా అడిగింది.

పడమటి దిక్కున జారిపోతున్న సూర్యుడి గురించే మమత మరిచి పోయింది. ఆమెలో వరలక్ష్మి, పద్మినీల మీద కోపం రగులుకుంటోంది. ఆ కోపంలో సుందరం చేసిన హెచ్చ రికను గూడ మరచింది.

కామమ్మకు కాఫీ కలిపిఇచ్చి, మమత ఆ ఇంట్లోనుంచి బయటపడే సరికి, పూర్తిగా ప్రొద్దుగూకింది.

ఆమెలో పద్మిని మీదా, వరలక్ష్మిమీదా కోపం అంతకంతకూ ఎక్కువ అవుతున్నది. ఆ వేశంలో ఆమె ఆలోచన లేకుండానే

దగ్గర త్రోవ, అడ్డ త్రోవ అయిన అగాధం ప్రక్కగా పోయే బాట వెంటనే నడుస్తున్నది.

దోవ వెంబడే నడచి అగాధం దగ్గరకు వచ్చేసరికి కనుచీకటి పడింది. దోవ కొత్త అవటంవలన అగాధం అంచుదాకా వెళ్లి మళ్ళీ సర్దుకుంది. ఒడ్డునే ఉన్న చెట్లనానుకుని నడవ సాగింది.

కాలిబాట ఎత్తయిన గుట్ట మీదకు దారి తీసింది. ఒక ప్రక్కన జుట్టు విరబోసుకున్న దయ్యాల్లాగ గాలికి ఊగు లాడుతున్న చెట్లూ, మరో ప్రక్క తనను కబళించటానికి నోరు తెరుచుకుని వెంటబడే భూతంలా, అగాధమైన అగడ్త! హత్యలు చేయటానికి ప్రపంచంలో ఇంతకన్న అనువైన ప్రదేశం ఎక్కడుంటుంది అనుకుంది మమత. రేపు ఒక బోర్డు తగిలిస్తే సరి, ఇక్కడ హత్యలు చేయబడును' అని! తన ఆలోచనకు తనే నవ్వుకుంది మమత.

ఆ అగాధం ఒక మైలు వైశాల్యం ఉంటుందని ఆమె అంచెనా వేసింది. తను నడుస్తున్న గుట్ట మీదనుంచి, అగాధం అడుగువరకూ వందగజాల లోతు తేలికగా ఉండొచ్చు.

జయ ఒకవేళ రాత్రిపూట ఈ దోవనే వచ్చినా ఆమె కాలు జారి అగాధంలో పడే అవకాశం ఉండి ఉండదు! ఎందుకంటే ఈ ఊరు ఆమె పుట్టి పెరిగిన దవటంవల్ల, ఇక్కడ ప్రదేశం ప్రతి అడుగూ ఆమెకు బాగా పరిచయం అయి ఉంటుంది. అయితే ఆమెను వెనుకగా ఎవరైనా వచ్చి అగాధంలో త్రోసి వేశారా? లేక గట్టునే చంపివేసి, ఆమె మెడకు రాయి కట్టి అగాధంలోకి నెట్టేశారా? లేదా ఆమె, కావాలని ఆత్మహత్య చేసుకుందా? ఏమైనా హత్యలు చేయటానికిగానీ, ఆత్మహత్యలు చేసుకోవటానికిగానీ ఇది చాల అనువైన ప్రదేశం!

# 11

మమత వెనుకగా నేలమీద ఎండుటాకులు గలగలమనడం ఆమెకు దడపుట్టుకు వచ్చింది. ఎవరైనా హంతకులు తనను వెంటాడుతున్నారా? క్రితం రాత్రి తన గదిలో ప్రత్యక్ష మయిన ఆకారం తనను వెంబడిస్తున్నదా మళ్ళీ!

ఏదైనా పందిగానీ లేక మరేదైనా జంతువేమో అని సరి బెట్టుకోజూసింది. ఒక్కక్షణంఆగి వెనుకకుతిరిగి చూసింది. ఆమె దృష్టికి ఎవరూ కనబడలేదు. అప్పటికీ "ఎవరది?" అని గట్టిగా అరిచింది. సమాధానం రాలేదు.

ఆమె అరుపుకు చెట్లమీద పక్షులు గోలగాలేచి మళ్ళీ సర్దుమణిగినయ్. గుడ్లగూబ ఒకటి వికృతంగా అరుస్తూ అటుగా ఎగిరిపోయింది.

గుండె చిక్క బట్టుకుని ఆమె మళ్ళీ అడుగులు వేయ సాగింది. తనను ఎవరన్నా వెంబడించే మాటే గనుక నిజ మైతే, ఆ వెంబడిస్తూన్న వ్యక్తికి ఈ ప్రదేశం కుణ్ణంగా తెలిసి ఉండాలి. లేకపోతే తనకు చీకట్లో నడవడమే కష్టంగా ఉన్నచోట, తనను అనుసరిస్తూ, చెట్ల మాటున దాక్కుంటూ తన ఉనికి బయట పడకుండా వెంబడించగలడా?

దోవ కొద్దిగా మలుపు తిరిగింది. తనకు ఆహారంగా పనికి వచ్చే జంతువు మీదకు అతి లాఘవంగా దూకే పులిలా ఆగంతకుడు ఆమెపై బడాడు.

అసలే దోవ సన్నం, కాళ్ళు వణకుతున్నయ్. అడుగులేమో తడబడుతున్నయ్. మెరువులా, వెనకు దిరిగి, తనను ఎదు ర్కొనే ఆగంతకుడ్ని ఆనవాలు పట్టటానికి ప్రయత్నించింది మమత.

కాని ఆగంతకుడు తన చేతిలోని కర్రతో ఆమె మోకాళ్ల

క్రింద బలంగా కొట్టాడు. మమత నేల బారుగా క్రింద బోర్లగా పడిపోయింది. ఆమె తల అగాధంలోకి చూస్తున్నది. అయితే మమత ముందే జాగ్రత్త పడడంవలన ఆగంతకుడు ఊహించినట్టుగా ఆమె నేరుగా అగాధంలోకి దూకలేదు!

నేలమీద పడటంలో రాళ్ళు ఆమె ముఖానికి కొట్టుకుని నుదట గాయం చేసినయ్. మోచేతులు దోక్కుపోయాయి. మోకాళ్ల దగ్గర చీర చిల్లులు పడింది.

ఆగంతకుడు ఆమె కాళ్ళు పట్టుకుని ఆమెను మరింత ముందుకు జరిపి వదిలేశాడు. సరిగా అదే సమయంలో మమత తన రెండు చేతుల్తోనూ అగాధం గోడను తడిమింది. అగాధం అంచునుంచీ నేలలో నుంచి వచ్చిన చెట్ల వ్రేళ్లు అక్కడక్కడ ఎడల్గా ఉన్నాయ్. ఆమె వాటిని దొరక బుచ్చుకుంది.

ఆ చెట్ల వ్రేళ్లు చాంతాళ్లకన్న లావుగా ఉన్నయ్. వాటిని రెండు చేతుల్తోనూ పుచ్చుకుని గాలిలో, నేలమీదినుంచి వంద గజాల ఎత్తులో ఊగులాడ్తూ, గుండెలవిసి పోయేలా ఆ క్రందన చేసింది, మమత.

ఆమె ఆర్తనాదం క్వారీ గోడలకు తాకి డజను కంఠాలు అరచినట్టుగా మారు మ్రోగి పోయింది. ఆ కేక విని ఆ చుట్టుపట్ల ఎవరైనా పరుగెత్తుకు వస్తారేమో అని ఆమె ఆశపడింది.

ఆమె చేతులు లాగేస్తున్నయ్. తన శరీరం బరువంతా చేతుల్లోని శక్తిపై ఆధారపడి ఉండి. అలా తను ఎంతసేపు అని ఉండగలదు? తన చేతుల్లోని చెట్ల వ్రేళ్లు ఏ ఒకటి తెగిపోయినా, తను తెగినగాలి పటంలా అగాధం అడుక్కి చేరు కోవటం ఖాయం!

తనను ఆవరించిన భయాన్ని పార్రదోలి, కొంత గుం
డిటవు కలిగించుకుంది ఆమె. తన కాళ్లతో గూడ గోడ
తడిమింది. లావుగా ఉన్న చెట్ల వ్రేళ్ళ చిన్న మెట్లులాగ ఆ
కాళ్ళ నిల్రదొక్కు కోవటానికి ఆసరా ఇచ్చినయ్.

అలాగే నెమ్మదిగా, ధైర్యంగా ఒక్కోవేరునే పట్టుకుని ఆ
పై అంచుకు చేరింది. ఒక చేత్తో చెట్టువేరుని పట్టుకు
కొద్దిగా ఎగిరి బాటకు అటుగా ఉన్న చెట్టుబోదెను లంకిం
కోవటానికి ప్రయత్నించింది.

నిజానికి ఆ ఎగురుడికి, ఆమె చేతికేమీ దొరకని పక్షంల
ఆమెనేరుగా అగాధంలోకి జారిపోయి ఉండేది. ఆమె అదృష్ట
బాగుండి, ఆమె చేతికి చెట్టు బోదె ఆసరాగా దొరికిం
రెండో చేయిగూడ చాచి ఆ బోదె చుట్టూ చేతులు వేసిం
రెండు చేతుల్ని కలిపి బంధం వేసింది.

ఆ తర్వాత నెమ్మదిగా ప్రాకుతూ, శరీరాన్ని పూర్తి
గట్టున పడేసింది. బాటమీదకు చేరి కూలబడ్డాక ఆమె
ఎక్కడలేని భయం కలిగింది. ఆగంతకుడు ఇంకా అక్క
పొంచి ఉన్నాడేమో, మళ్ళీ వచ్చి పడతాడేమో అని ఒ
క్షణం చూసింది.

కానీ ఆగంతకుని జాడలేదు. తను అగాధంలోకి పడిపోత
వేసిన పొలికేకకు వాడు ఎప్పుడో పారిపోయి ఉంటాడని
యించింది.

నెమ్మదిగా లేచి నిలబడింది. ఒక చెట్టు తర్వాత మ
చెట్టుని పట్టుకుని నడుస్తూ, అగాధానికి దూరమయి
మమత.

పాలరాతి భవంతి చేరువలోకి వచ్చింది. ఆమె జుట్టుం
చిందరవందరగా ఉంది. చీర చాలా చోట్ల చిరిగిపోయిఉం

కులమీద, ముఖం మీదా గాయాలయినయ్. వాటినుంచి
౨న నెత్తురు ఆమెను ఇంకా భయంకరంగా, చూస్తే భయ
లా చేసినయ్.

అప్పటిదాకా జయ ఇంకా బ్రతికే ఉందని నమ్మిన తను,
ుడు జయ హత్య చేయబడే ఉంటుందని విశ్వసిస్తోంది.
మె గూడా అగాధం అడుగున శాశ్వత నిద్రలో ఉండి
టుంది. తనకూ అదేగతి పట్టబోయి, వెంట్రుక వాసిలో
ప్పోయింది. మృత్యు దేవత నోట్లోకి వెళ్లి, మళ్ళీ బయట
గలిగింది తను. జయకు ఏ ప్రమాదం సంభవించి
టుందో, తను ప్రత్యక్షంగా చూడగలిగింది ఈ రోజున.

## 2

వాకిట్లోనే మమతకు ఎదురయాడు లక్ష్మణరావు. ఆమెను
ూస్తూనే "మమతా! ఏమయింది తల్లీ నీకు!" అంటూ
ుగా అరిచేశాడు.

మమత వాకిలిమెట్లదగ్గరే కుప్పగా కూలబడిపోయింది.

లోపల్నుంచి వరలక్ష్మి, నాగరాజూ, పద్మినీ పరుగెత్తు
్చారు. అంతా కలిసి సాయంపట్టి, చేతులమీద ఆమెను
మీద పడుకోబెట్టారు.

వంటమనిషి వేడికాఫీ తెచ్చి ఆమె చేత త్రాగించింది.
లక్ష్మి వేడినీళ్లలో గుడ్డను తడిపి ఆమె గాయాల్ని శుభ్రం
, మందువేసి కట్టు కట్టింది.

"ఏం జరిగింది? ఎక్కడన్నా పడ్డావా?" వరలక్ష్మిఅడిగింది.

"నేను పడలేదండీ! ఎవరో నన్ను అగాధంలోకి నెట్టి వేయ
నికి ప్రయత్నించారు!" అంటూ జరిగినదంతా చెప్పుకొ
ది మమత.

"అరి దేవుడా? ఎంత పని జరిగింది. చూడమ్మా మమతా!

ఇక ఎన్నడూ నీవు ఒంటరిగా బయటకు వెళ్ళోద్దు!'' అన్నాడు లక్ష్మణరావు.

''అబ్బ! వింటానికే. గుండె లవిసిపోతున్నయ్. ఇంకా ఆమె ఎంత క్షోభించిందో!'' పద్మిని సానుభూతి చూపింది.

మమత తల త్రిప్పి పద్మినికేసి చూసింది.

పద్మిని జుట్టు కొద్దిగా రేగిపోయి ఉంది. చీరమీద అక్కడక్కడా ఎర్రమట్టి, అగాధం చుట్టూ ఉన్నటువంటిదే! ఎర్రమట్టి మరకలున్నాయ్. ఆమె మోచేతి క్రింద గీక్కుపోయి నట్టుగా ఉంది.

మమత అనుమానంతో కళ్ళు పెద్దవిచేసి చూసింది మళ్ళీ. మమత చూపులకు తాళలేని దానిలా పద్మిని తల వాల్చుకుంది.

తన 'మనసులోని అనుమానాన్ని ఆమె పసిగట్టినట్టుంది, ఏడ్పుగొంతుతో'' నేను మాత్రంకాదు మమతా! ప్రమాణంచేసి చెబుతున్నాను. నిన్ను త్రోసింది నేను మాత్రంకాదు. ఈ సాయంకాలం నేను అడవిలో అగాధందాకా వచ్చిన మాటనిజమే! కాని సూర్యుడు దిగిపోగానే నేను ఇంటికి తిరిగి వచ్చేశాను.'' అంది.

''చీకటి పడుతూన్నదనే ఆత్రంలో నేను వస్తుంటే కాలి కేదో ఎండుకొమ్మ తగిలి నేను బోర్లా పడ్డాను. నా మాట నమ్మ!'' పద్మిని అతిదీనంగా అంది.

అక్కడ చేరినవారంతా నోరు తెరచుకుని ఆశ్చర్యంతో మమత, పద్మిని ముఖాలవంక చూశారు. ఏమీ అర్థం కానట్టుగా.

నాగరాజు మాత్రం తన చెల్లెల్ని సమర్థించాడు. ''అవును మమతా! ఆమె చెప్పేది నిజమే! నేను భవంతిపై అంతస్థులో నిలబడి అడవి వైపుగా చూశాను. పద్మిని గబ గబ వస్తూ

న్నది. అంతలోనే ఆమె బోర్లా పడిపోయింది నేలమీద బహుశా తొందరలో ఆమె చీరకుచెళ్లు అడ్డం పడి, ఆమె పడిపోయి ఉండవచ్చని నేను ఊహించాను.''

పద్మిని కళ్ల వెంట జలజల నీళ్లు రాలినయ్.

''అయితే బాగా చీకటిపడిన తర్వాతే నీవు ఆ దారివెంట వచ్చావన్నమాట! ఆ దారి పగలే ప్రమాదకరం. ఇక చీకట్లో చెప్పాలా? నీవు అసలు అటు ఎందుకు వెళ్లాల్సి వచ్చిందమ్మా'' లక్ష్మణరావు ఆప్యాయంగా అడిగాడు.

''జయ గురించిన సమాచారమేమైనా తెలుసుకుందామని కామమ్మ ఇంటికి వెళ్లి, చీకటి పడుతున్నదనే ఆత్రం కొద్దీ ఆ దారంట వచ్చాను.''

''అయితే నిన్ను అగాథంలోకి తోసిన వ్యక్తిని నీవు గుర్తించనే లేదన్నమాట?'' లక్ష్మణరావు అడిగాడు.

''లేదండీ! అంతా కనురెప్ప పాటులో జరిగి పోయింది. అదీగాక ఆగంతకుని తలకు ముసుగు ఉంది.''

''ఏవరయితేనేం లెండి! మమత సురక్షితంగా ఇల్లు చేరింది. అదే పదివేలు! కానీ ఈ ఇంట్లో, నివసించే వ్యక్తులందరూ పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నారనిపిస్తున్నది.'' భయంతో బిక్కు బిక్కుమంటూ పలికింది వరలక్ష్మి.

''ఇప్పటికయినా జయకు ఏం సంభవించి ఉంటుందో తెలుసుకున్నారా?'' జలజమ్మ పెద్ద పోజుపెట్టి అడిగింది.

''అలా ఎందుకనుకోవాలి? మమత, ఆపదలోంచి బయట పడ్డట్టే, జయగూడ బయటపడి ఎక్కడో తిరుగుతూ ఉండ చ్చని ఎందుకనుకో గూడదు?'' నాగరాజు వేసిన ప్రశ్నకు జలజమ్మ చికాకు పడింది.

''ఇదుగో నాగరాజా! ఒకసారికాదు, వందసార్లు చెబుతాను,

జయ చనిపోయిందని. ఆమె గూడ మమతలాగే ఆ అగాధం
లోకి త్రోసి వేయబడి ఉంటుంది. అసలీ ఇల్లే అంత! నిష్ఠ
దరిద్రపుది. ఈ కొంపలోకి వచ్చిన వారెవరూ ఆరునెలలన్న
జీవించరు!'' జలజమ్మ సణిగింది పెద్దగా.

''అలా అయితే ఇంకా తమరెందుకిక్కడ? తక్షణం నీ
మూటాముల్లె సర్దుకుని వెళ్ళిపో!'' లక్ష్మణరావు ఆమెన
శాసించాడు.

''అంత తేలికగా వెడతానా? జయ ఆచూకీ తెలుసుకుని
గానీ వెళ్ళను. ఈ లోగా నన్ను వెళ్ళమనటానికి నీకుగూడ
అధికారంలేదు!'' రుసరుస లాడుతూ జలజమ్మ వంటగదివేపు
నడిచింది, అన్నం పళ్ళెల మీద దాడి చేయటానికి.

# 13

గత రెండు రోజులుగా మమతకు సుందరం కనబడలేదు.
అతడికోసం, ఈ భవంతిలో పద్మిని, మమత అనే ఇద్దరు అంద
మైన అమ్మాయిలు కాచుకుని ఉన్నారని అతగాడికి తెలియ
దేమో!

సుందరం ఇంటికి వెళ్ళి అయినా సరే, అతడ్ని కలుసు
కోవాలనే కోరిక కలిగింది మమతకు.

డ్రెస్ అయి మేడమెట్లు దిగి హాల్లోకి వచ్చింది మమత
హాల్లో జలజమ్మ సోఫాలో కూర్చుని ఏదో వారపత్రిక
చదువుకుంటున్నది.

మమతను చూడగానే ఆమె పుస్తకం మూసేసింది.

''ఏమమ్మాయ్! నీవు ఇంకా ఇక్కడే ఉన్నావూ? ఈ
ఇంట్లో ఉండే మనుష్యులకు అడుగడుగునా ఆపదలు వాటిల్లు
తున్నయ్. నీ మేలు కోరి చెబుతున్నాను. మరో ప్రమాదం
ముంచుకు రాకముందే వెళ్ళిపో!''

"ఇదుగో జలజమ్మా! ఇదే చెబుతున్నాను నీకు! ఈ మమత
ర్రయపడి ఏ పనీ చేయదు. జయ ఆచూకీ తెలిసేదాకా ఈ
ఇంట్లోంచి కదలను."

"నీ మంచికే నే చెబుతూంట!"

"నా మంచి నాకు తెలుసులే!"

"నువ్వొట్టి మొండి ఘటానివి. మళ్లీ ఏదో ఆపద వచ్చి
ప్పుడు నా మాట విననిదానికి నీవు చింతిస్తావ్!"

మమత విసురుగా తలుపు తెరుచుకుని బయటకు నడిచింది.
సుందరం ఇల్లు గుర్తులు చెప్పాడు లోగడ. ఆ గుర్తుల
పకారం వెళ్ళింది మమత.

సుందరం ఇల్లుగూడ ఎంతో అందంగా ఉంది, చిన్నదైనా.
అతగాడు ఇంట్లో ఉంటాడో ఉండడో అనిసంశయిస్తూ
వెళ్ళిన మమతకు అతడు వాకిట్లోనే ఎదురు పడడం ఆనందాన్ని
కలిగించింది.

"దారి తప్పలేదు కదా!" సుందరం నవ్వుతూ అడిగాడు.

"లేదు! నీ కోసమే వచ్చాను! ఇంట్లో లక్ష్మణరావుగారు
రు! నీవూ రెండు రోజుల్నుంచి కనబడలేదు. జయ సమా
రం ఏమన్నా చెబుతారేమో అని వచ్చాను ఇలా! కాకపోతే ఈ
రగారికి ఎప్పుడూ పనేగదా, ఇంట్లో ఉంటారోఉండరో అని
ంశయించాను".

"నీకా భయం అక్కర్లేదు, నేను ఇంట్లో ఉన్నా లేకపోయినా
ఈ గృహం ద్వారాలు నీ కోసం ఎప్పుడూ తెరిచే ఉంటయ్!"

"ఏమిటో ఆ ప్రత్యేకత! ఇంతకీ జయ విషయంఏమైనా?"

"ఇంకా ఏమీ తెలియలేదు. లక్ష్మణరావు పోలీస్ రిపోర్టు
వ్వటానికి టౌన్‌కి వెళ్లారు."

మమత మౌనంగా ఉండిపోయింది.

సుందరం ఆమెకు దగ్గరగా వచ్చాడు. ఆమె మీదక
వంగి ఆమె పెదవులపై స్పృశించాడు.

మమత చిరుకోపం చూపింది. "ఏమిటీదౌర్జన్యం? మనిద్ద
చర్యలను జయ చూస్తూనే ఉంటుంది!"

"అవును! జయ కోసమే నీవూ వచ్చావ్! నేనూ కాచుకు
ఉన్నాను! ఆమె ఏమయిందో ఏమో!"

బయట, వాకిలి తలుపు భళ్లున కొట్టుకున్న చప్పుడవటం
తో ఇద్దరూ ఉలిక్కిపడి దూరంగా జరిగారు. సుందరం గబ
గబ వాకిలి దగ్గరకు వెళ్లి చూశాడు.

దూరంగా, వెళ్లిపోతున్న పద్మిని కనుపించింది. "హా
భగవాన్! ఈ శూర్పణఖ కంటపడనే పడ్డాం! ఇక ముందు
ఆపదలు రాబోతాయో!" అన్నాడు పెద్దగా.

మమత, తనకూ, కామమ్మకూ మధ్య జరిగిన సంఘర్ష
ణను చెప్పింది సుందరానికి.

"ఆమె ఇంటినుంచి వస్తూనే గదా నేనూ ప్రమాదాని
గురైంది. ఆమె ఇంటినుంచి బయలుదేరిన జయ గూడ
మాయమయింది. ఆమె ఇంటికి ఈ సంఘటనలకూ ఏదైన
లంకె ఉందా?" అంది మమత.

"ఆమె ఆడది. కాకపోతే కొంచెం గయ్యాళి స్వభావంకలది
ఆమె హత్యలు చేస్తుందని నేను అనుకోను! ఎందుకయిన
మంచిది. నీవు మాత్రం మళ్ళీ అగాధం చాయలకు పోవద్దు!"

మమత తలూపి కుర్చీలోంచి లేచింది. సుందరం దగ్గర
సెలవు తీసుకుని ఇంటికి తిరిగి వచ్చింది.

# 14

తన గది తలుపు బార్లా తెరచి ఉండటం చూసి మమత
ఆశ్చర్యపోయింది. ఒకవేళ _ జయగాని తిరిగి వచ్చిందా అ

ఊహాగూడ కలగకపోలేదు.

ఆతృతగా లోపలకు వెళ్లిన మమతకు, తన బెడ్‌మీద
ూర్చున్న పద్మిని కనుపించింది. ఆమె కోపంతో బుసలు కొడు
ున్నది.

"ఇన్నాళ్ళూ నీవు మంచిదానివని సహించాను! నీ అంత నీచు
ాలు ఇంకోతె ఉండదు!" అంటూ ఎగిరింది పద్మిని, మమతను
ూస్తూనే.

"ఏమిటి నీవనేది?" విసుక్కుంటూ అడిగింది మమత.

"అదే! నీవు ఎవరింటికి వెళ్లి కులికి వస్తున్నావ్? సుందరంతో
 రంకునంతా కళ్లారా చూశాను!"

"ఇంకేం! వెళ్లి పేపర్లో వేయించుకో!" అతి నిర్లక్ష్యంగా
ల ఎగురవేసింది మమత.

"పేపర్లో వేయిస్తానో? తీట ఒలిపిస్తానో? నాతడాఖా
ూపిస్తానేవ్!" అంటూ పద్మిని మమత మీదకు దూకింది.
న గోళ్లతో ఆమెను రక్కింది. అందిన చోటల్లా కొరికింది.

"ఏయ్ పద్మిని? ఏమిటీ దౌర్జన్యం? నాకు కోపం వస్తే
ను మనిషిని కాదు సుమా!"

"అబ్బ! పెద్ద ఆరింద వచ్చింది! జయ మంచికోరేదానిలా
ఈ ఇంట్లో ఎందుకు తిష్టవేశావో నాకు తెలిసిందిలే! సుంద
న్ని నాకు కాకుండా చేయాలనేగా?" అంటూ మళ్లి ఆమె
ాద కలయబడింది.

మమతలో ఓర్పు నశించింది. తన పిడికిళ్ళు బిగించి,
ద్మినిని దభీ దభీ మని గుద్దింది మమత.

ఈ ఎదురుదాడికి తట్టుకోలేక పద్మిని పడిపోయింది,
ంమీద.

"నీ ప్రేమ వ్యవహారం అంతా నాకు ఇప్పుడు అర్దమవు

తోంది. కామమ్మ ఇంటికి వెళ్లేదానిలా నటిస్తూ, సుందరాన్ని కలుసుకోవటానికే నీవు అగాధం వేపుగావెళ్లావ్! చీకటిపడే దాకా వాడితో కులికి, ఒళ్ళుమరచి నడిచి అగాధంలో పడ బోయావ్! నిన్నెవరో నెట్టటానికి ప్రయత్నించారనేది నీ రంకుతనాన్ని కప్పి పుచ్చుకోవటానికి నీవు అల్లిన కట్టుకథ!''

ఉద్వేశంతో రొప్పుతూ, ఏడుస్తూ అంది పద్మిని.

''అయితే నేనెక్కడకు వెళ్లినా నా వెనుకే దొంగచాటుగా'' వస్తున్నావన్నమాట. నన్ను అగాధంలోకి నీవే త్రోసిఉంటావ్, నాపై ఈర్ష్యతో.

ఇద్దరూ కోపంలో ఒకొర్నొకరు ఆరోపించుకోసాగారు.

ఈగోల విని వరలక్ష్మి పైకి వచ్చింది.

''సుందరంతో నాకే సంబంధమూ లేదు నువ్వనుకుంటున్నట్టుగా!'' మమత అనునయంగా పలికింది.

''నీవు రాక పూర్వం అతడు నాతో నవ్వుతూ మాట్లాడే వాడు. నీ మూలంగానే అతడు నా వంక చూడడం లేదు. అతడ్ని నీ చూపుల వలలో వేసుకోలేదూ నువ్వు? నిన్ను నిజంగా అగాధంలోకి త్రొసినా పాపంలేదు.'' పద్మిని పెద్దగా అరుస్తోంది.

''ఏమిటే ఈ గోలంతా?'' వరలక్ష్మి జోక్యం . కలుగ జేసుకుంది.

''నేనేమీ చేయక పోయినా, పద్మిని నాపై ఏవో ఆరోప ణలు చేసి నన్ను రక్కి, గికి, కొరికింది.'' అన్నది మమత తన ఒంటిపై గాట్లు చూపిస్తూ.

''అబ్బ! అక్కడకు నీవు సత్య సంధురాలివి. అపర దేవతవు. నేనేమో రాక్షసిని. పిశాచాన్ని!'' అని ఎక్కిరించింది. పద్మిని. ఆ తర్వాత తన తల్లివంక చూసి అంది,'' చూడమ్మా! నన్ను

అగాధంలోకి త్రోసి చంపుతుందట!''

''పద్మినీ! నీ అహంకారాన్ని తగ్గించుకో! నీ తొందరపాటు వల్లనే కష్టాలు కోరి తెచ్చుకుంటావ్! నీవు అనవసరంగా నోరు జారిందానికి మమతకు క్షమాపణ చెప్పుకో ముందు! ''వరలక్ష్మి కోపంగా అంది.

''నాతో యుద్ధం చేసి అదే నన్ను పడేసింది. దాన్నే క్షమాపణ చెప్పుకోమను!''

వరలక్ష్మి అసహనంగా మమతకేసి చుసింది.

''నిజమే! ఆమెను గుద్ది, క్రిందపడేశాను. అందుకు క్షమాపణ చెప్పుకోవడానికి గూడ నేను సిద్ధంగానే ఉన్నాను. కాని ముందు చేయి చేసుకున్నది పద్మినే!'' వరలక్ష్మికి కష్టం కలిగించటం ఇష్టంలేక ఉన్నమాట చెప్పేసింది.

''అగాధంలోకి నిన్ను నెట్టింది పద్మినే అని అనుమానిస్తున్నావా.'' వరలక్ష్మి మళ్ళి అడిగింది.

''అబ్బే లేదండీ! ఒకవేళ నేను అలా నోరుజారినా, అది కేవలం కోపంలో అని ఉంటాను.''

వరలక్ష్మి టేబుల్‌మీద నీట్‌గా సర్ది ఉన్న సూట్‌కేస్ చూసింది.'' ఏమిటి? ప్రయాణమా?'' అడిగింది.

''అవునండీ!''

''ప్రస్తుతం అదే మంచిది. జయ సమాచారం తెలిసినవెంటనే నీకు జాబువ్రాస్తాం. ఇంకా ఈ ఇంట్లోనే ఉంటూ నీవు కష్టాలనుకొని తెచ్చుకుని, మమ్మల్ని ఇరకాటంలో పెట్టేకన్న అదే మంచిది. రావే పద్మినీ, పోదాం!'' అంది వరలక్ష్మి.

వరలక్ష్మి వెంట పద్మినిగూడ వెళ్ళిపోయింది.

మమత ఆలోచనలో పడిపోయింది. ఈ ఇంట్లో ఏ క్షణానికి ఏం ముంచుకు వస్తుందో తెలీకుండా ఉంది. అందుకని

ముందు ఈ ఇల్లుని వదలిపోవటమే మంచిది.

కాని ఆమెకు ఈ తరుణంలో తిరిగి వెళ్లిపోవటానికి మనసు ఒప్పడంలేదు.

తనపై హత్యా ప్రయత్నం, తను జయ చీరను ధరించినప్పుడు కామమ్మ పోట్లాడడం, ఇప్పుడు పద్మిని అసూయతో తనను ఎదుర్కొనటం, ఇవన్నీ యదాలాపంగా జరిగిన సంఘటనలు కావనీ, వీటి వెనుక అభేద్యమయిన కుట్ర ఉందని పిస్తున్నది ఆమెకు.

కనుక తను మరికొద్ది రోజులు ఈ ఇంట్లో, లేదా ఈ ఇల్లు వదల దల్చుకుంటే, ఈ గ్రామంలోనే మరికొద్ది రోజులు ఉండగలిగితే! తన మొదటి ప్రయత్నం విఫలమయిందని గ్రహించిన హంతకుడు మళ్లీ తనను, రెట్టించిన కసితో, ఎదుర్కొంటాడు.

ఆ ప్రయత్నంలో అతడ్ని తను దొరక బుచ్చుకోవాలి!

ఆమె మనసులో సుందరం ఇల్లు మెదిలింది. అందులో అతడూ మరో పని మనిషి ఉంటున్నారు. తను అక్కడ కొద్ది రోజులు ఉండదలిస్తే అతడు కాదనడని తనకు నమ్మకంఉంది రేపు తెల్లారుతూనే తను ఈ పాలరాతి భవనానికి స్వస్తి చెప్పాలి

# 15

సిటీ నుంచి లక్ష్మణరావు తిరిగి రాలేదు. ఆ రాత్రి అందరూ విడివిడిగా, ఒకరి తర్వాత ఒకరు భోజనాలు కానిచ్చారు, ఒకరికొకరు తారస పడటం ఇష్టంలేని వాళ్లలా.

రాత్రి తొమ్మిది గంటలు కావస్తున్నది. పల్లెసీమల్లో త్వరగానే ఊరు సద్దుమణుగుతుంది. ఎంతో ప్రశాంతంగా ఉంది వెన్నెల అడవిలో విరగగాస్తున్నది.

మమతకు నిద్ర రావటంలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా

ఎప్పుడు ఈ ఇంట్లోంచి బయట పడదామా అని ఆతృతతో కళ్లు మూతలు పడటంలేదు.

ఆమె గదితలుపు లోపల గడియవేసుకుంది. కొవ్వొత్తులు రెండుమూడు వెలుగుతున్నయ్.

తలుపుమీద ఎవరో గీకిన చప్పుడయింది. మమత ఉలిక్కిపడింది. లేచి బెడ్‌మీదనే కూర్చుంది. శ్రద్ధగా ఆలకించింది, ఆ చప్పుడు ఎక్కడనుంచి వస్తున్నదా అని?

పిల్లిగానీ, పందికుక్కగానీ గోడను గీరుతున్నట్టుగా శబ్దం అవుతోంది. ఆ శబ్దం బాతురూమ్ నుంచి వస్తున్నదని గ్రహించింది ఆమె.

బెడ్‌మీద నుంచి దిగి కొవ్వొత్తిని చేతిలో పుచ్చుకుని బాతురూమ్ దగ్గరకు వెళ్లింది. బాతురూమ్‌కి గజందూరంలో నేల గచ్చులోంచి ఒక పాలరాయి పలక కొద్దిగా జరపబడి ఉండటం చూసింది. ఆమె గుండె గబగబ కొట్టుకుంది.

అయితే ఆనాడు తన గదిలోకి వచ్చిన వ్యక్తి ఈ రహస్య ద్వారంలోంచి వచ్చి ఉండాలి. తను దీపం వెలిగించేలోగా అతను మళ్లీ ఈ దారంట నేల మాళిగలోనికి జారుకుని ఉండాలి.

రహస్యం తెలిసిపోయినదానిలా మమత ఆనందంతోఎగిరింది. పాలరాతి పలకను పూర్తిగా ఇవతలకు జరిపింది.

భూమిలోకి సన్నని మెట్లు కనుపించినయ్. ఎవరన్నా మనుష్యులు కనబడతారేమో అని కొవ్వొత్తిని లోపలకు పోనిచ్చి చూసింది. ఆమె కంటికి ఎవరూ కనబడలేదు.

తన ప్రాణాలు పోయినాసరే, జయను మాయం చేసిన హంతకుడ్ని లేదా హంతకురాల్ని పట్టుకోవాలనే తాపత్రయంతో మమత, కొవ్వొత్తిని చేత్తో పట్టుకుని మెట్లు దిగి పోసాగింది.

హంతకుని ఆచూకీ దొరుకుతుందనే ఉత్సాహంతో ఆమె

ఒక్కొక్క మెట్టే దిగి అంతకంతకూ పాతాళంలోకి దిగుతోం
ఒక చేత్తో కొవ్వొత్తి పట్టుకుని, మరో చేత్తో మెట్ల ప్రక్క
ఉన్న రెయిల్స్‌ను పట్టుకుని మెట్లు దిగసాగింది.

లోపలంతా చెడువాసనగా ఉంది. కన్ను పొడుచుకున్నా కా
రాని కటిక చీకటి. ఎటువంటి ధైర్యస్తులకైనా భీతావహం కలి
గించేదిగా ఉంది ఆ వాతావరణం.

మెట్లు ఇంకా ఎంతదూరం ఉన్నాయో అని వంగిచూసిం
మమత చేయిజాపి. కొవ్వొత్తిని దూరంగా ఉంచింది. ఇం
ఎక్కువ దూరం కనబడుతుందని.

అదే ఆఖరు మెట్టు. ఆ తర్వాత నేల కనబడుతోం
చేయిజాపి కొవ్వొత్తిని అన్నివేపులా చూపుతూ అక్కడ,
నేలమాళిగలో ఏ మున్నదో చూడటానికి ప్రయత్నించింది.

చీకట్లో కప్పుకు వ్రేలాడుతున్న గబ్బిలం ఒకటి, కొవ్వొ
వెలుగుకి ఝడుసుకుని అటూ ఇటూ ఎగిరింది.

ఏదో గబ్బిలంలాంటి వస్తువు వచ్చి కొవ్వొత్తిమీద పడిం
గబ్బిలం ఎగురుతూ, కొవ్వొతి సెగ తగిలి పడిందో లేక అక్క
చీకట్లో దాగిన వ్యక్తి కొవ్వొత్తిని ఆర్పేయాలని చేసిన ప్రయ
త్నమో అని భయపడింది మమత.

ఆమెలోని ఆఖరి ఆశా జ్యోతిలా, ఆమె చేతిలోని కొవ్వొ
గూడా ఆరిపోయింది. గాడాంధకారంలో, ఏకాకిగా, హంతక
దయాదాక్షిణ్యాలపై ఆధారపడి అక్కడ చిక్కుపడిపోయింది

ఏదో నల్లని ఆకారం, ఆడో మగో తెలియని ముసుగేసు
ఆకారం ఆమెనుగట్టిగా పట్టుకుంది, తన రెండు చేతుల్తోనూ
మమత ఆ పట్టులోంచి విడివడడానికి పెనుగులాడింది.

ఆ ఆకారం ఆమెను ముందుకు నెట్టటానికి ప్రయ
స్తున్నది. దాన్నిబట్టి తన ముందు లోతు తెలియని కందక

న ప్రాణాలు తీయగలిగేటంత లోతుగల కందకం ఉండి
ంటుందని మమత ఊహించింది.

ఆమె చేతులకు ఇంకా మెట్లమీద రెయిల్స్ తగలటంతో
ను మెట్లు చివరదాకా, రాలేదనీ, మెట్లు మలుపు తిరగటంలో
న్న దిమ్మను తను నేలగా భ్రమశాననీ గుర్తించింది.

అంటే తను మెట్లకు పైకీ, క్రిందా కాకుండా మధ్యలో
న్నట్టుగా గ్రహించింది. ఆ ఆకారం తనను మెట్ల మధ్యలో
ంచి క్రిందకు తోసేయాలని ప్రయత్నిస్తోంది. అంతలో
ఆకారం తనను వదిలి రెండు మెట్లు పైకెక్కింది. మరు
ణంలోనే ఆకారం తన కాలుతో బలంగా మమత తలకేసి
న్నింది, రెండు చేతుల్నీ రెండు ప్రక్కల రెయిల్స్‌ని పట్టుకుని.

మమత బాధతో మెలికలు తిరిగిపోయింది. చీకట్లో తనకు
ార్పు పడమర తెలీకుండా ఉన్నాగానీ, ఆ ఆకారం చీకటికి
గా అలవాటు పడినట్టుంది, తనను ఎడా పెడా వాయిం
స్తున్నది.

ఆకారం మరోమారు బలంగా తన్నిన తాపుకు మమత
యిల్స్ మీదుగా ఎగిరి అవతల పడింది. పడిపోతూ చేతుల
దిన రెయిల్‌ని పట్టుకుంది. ఆమె కాళ్లూ శరీరం గాలిలో
ట్ల క్రిందుగా వ్రేలాడుతున్నయ్.

ఆకారం బూటుకాళ్లు ఆమె చేతి వ్రేళ్లను నల్లిని నలిపి
ట్టుగా నలిపి వేస్తున్నయ్. ఆ బాధకు తాళలేక ఆమె చేతుల్నీ
లేసింది.

సుమారు అయిదారడుగుల ఎత్తునుంచి ఆమె నేలమీదపడి
ంది. ఏదో కొయ్య పిడిలాంటిది ఆమె ఎడమరొమ్ముకు
ద్దుకుంది. ఆమె స్పృహతప్పి పడి పోయింది.

# 16

మమత కళ్ళు తెరచింది. తను కళ్ళు తెరచినా, మూస కున్నా ఆ చీకటిలో ఒకటేగానే ఉంది. తన చీర అక్కడక్కడ తడిగా ఉండటాన్నిబట్టి తన ఒంటికి గాయాలయనీ, వాట నుంచి రక్తం స్రవించి ఉండవచ్చనీ ఊహించుకుంది.

తను స్పృహలేని స్థితిలో ఎంతసేపు ఉన్నదో ఊహించ కోవటానికి ప్రయత్నించింది. కానీ ఆమెకీ ఏమీ అంతు పట్ట లేదు. తన రిస్టువాచీని గదిలో టేబుల్ మీద ఉంచేసింది

తనను చంపటానికి యత్నించిన వ్యక్తి వెళ్ళిపోయాడో, లే తను కదిలితే, మళ్ళీ తనపని పట్టాలని కాచుకుని ఉన్నాడో ఎందుకయినా మంచిదని, తెలివి వచ్చినాగాని, కొంతసేప అలానే కదలకుండా ఉన్నచోటునే పడుకుంది.

కాళ్ళమీదా, చేతులమీదా ఉన్న పుండ్లు ఈ దెబ్బలకు రే పోయి మరీ బాధ పెడుతున్నయ్.

కాసేపు, ఎక్కడన్నా అలికిడి అవుతుందా అనీ, ఏదైన కదలిక కనపడుతుందా అనీ ఎదురు చూసింది. అలాంటివే లేవని రూఢి చేసుకున్నాక ఆమె లేచి నిలబడింది. ప్రక్క గోడ తగిలింది. దాన్ని ఆసరగా చేసుకుని, కాళ్ళూ చేతులు ఒకసారి విదిలించుకుంది, ఎముకలు విరగలేదని నమ్మకం కలిగా రెండడుగులు వేసి తన పరిసరాల్ని పరీక్షగా చూడసాగింది.

చీకటికి తన కళ్ళుకొంత అలవాటు పడినాగానీ, ఆమె గ్రుడ్డిదానిలా, తన చేతుల్తో ముందున్న వస్తువుని తడిమి చూసిగానీ అడుగు వేయటంలేదు. తనకు చేరువలో తనన గాయపరిచేందుకుగానీ, చంపేందుకుగానీ ఏదైనా ట్రాప్ అమ ర్చబడి ఉండచ్చని ఆమె భయం.

మరో నాలుగు అడుగులు వేసేసరికి ఆమె కళ్ళకు వెండి
పలా తెల్లని కాంతి కనుపించింది. అది వెన్నెల అనీ, గోడ
ందుగానో లేక తలుపు క్రిందుగానో వెన్నెల వెలుగులోపలకు
పతోంది అని గ్రహించేసరికి, మరోసారి తను మృత్యు
ఖంలోంచి బయట పడ్డానని సంబరపడింది.

ఆ వెలుగుకూ తనకూ మధ్య ఏదైనా ప్రమాదం పొంచి
దేమో అని, మోకాళ్ళమీదా పాకుతూ ఆ వెలుగుని
ంకుంది.

చేత్తో తలుపుని తడిమి చూసింది. ఆ తలుపుకు లోపలే
యపెట్టి, తాళం వేయబడిఉంది. తన బొడ్లో
ాల గుత్తి ఉంది, అదృష్టవశాత్తూ. ఆ గుత్తిని తీసి
ొక్క తాళం చెవితో తాళాం తీయటానికి ప్రయత్నిం
ది.

అరగంట సేపు తాపత్రయ పడ్డాక, తాళం ఊడివచ్చింది.
యతీసి, తలుపు తెరచింది. రివ్వుమని చల్లని గాలి లోపలకు
ంది. ఆ కమ్మనిగాలి ఆమె పాలిటి సంజీవిలా తోచింది,
ం తన గాయాల్నీ, బాధనీ మరచిపోయి గడ్డి తివాసీలాంటి
లోకి అడుగు పెట్టింది.

పాలరాతి భవనం చుట్టూ ఉన్న ఆవరణలో పడమరదిక్కుగా
నిలబడి ఉన్నట్టు తెలుసుకుంది. అయితే తనువచ్చిన
ి చుట్టూ పొదలు దట్టంగా అల్లుకుని ఉన్నయ్, బహుశా
ంగా రాకపోకలు లేకపోవడం మూలాన గాబోలు!

పొదలు తప్పించుకుంటూ ఎదురుగా కనుపించిన కాలిబాట
పే నడచి వెళ్ళింది మమత.

ఆ దారి నేరుగా సుందరం ఇంటికి దారి తీసింది. తలుపు
సుందరాన్ని పిలిచింది.

తలుపు తెరుచిన సుందరం ఆమె అవతారాన్ని చూసి ఉ
క్కయి పోయాడు.

మమత అతడి చాతీపై తలవాల్చి భోరున ఏడ్చింది.

"ఏమిటి మమతా? ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగ
సుందరం.

అతి కష్టంమీద ఏడ్పు ఆపుకుంటూ, జరిగినద
చెప్పింది మమత. "రెండోసారిగూడ నా మీద హత్యా ప్ర
త్నం జరిగింది. నేను స్పృహ తప్పి పడిపోవడం చూసి ఆగ
కుడు నేను చచ్చిపోయాననుకుని వెళ్లి పోయి ఉండాలి. :
నికి ఆ వ్యక్తి తన్నులకు నేనుగాని బ్రతికి పోయా
మరొకరయితే అప్పుడే చనిపోయి ఉండాల్సిందే!"

పొరబాటు చేశావ్ మమతా! నీకు ఎప్పుడయితే ఆ బిలం
బడిందో అప్పుడే నా వద్దకు వచ్చి ఉండాల్సింది."

"నిజమే! ఆ తొందరలో నాకా ఆలోచనే రాలేదు."

"సరే! పద! నిన్ను కూడా దిగవిడిచి వస్తాను!" అన్న
సుందరం.

"రేపుదయం నా పెట్టె బేడా సర్దుకుని ఇక్కడకు
స్తాను. ఆ కొంపలో నేనుండ దల్చుకోలేదు. ఏమంట
సుందరం!"

"నీ ఇష్టం! నీవు నా ఇంట్లో ఎన్నాళ్లు ఉండదలుచుకుం
అన్నాళ్లు ఉండవచ్చు!"

మమత, సుందరం ఇద్దరూ తిరిగి పాలరాతి భవ
వచ్చారు.

ఆ ఇంట్లో లైట్లు వెలుగుతున్నయ్ అంత అర్ధరాత్రి
ఇంట్లో మనుష్యులంతా హడావిడిగా తిరుగుతున్నారు.

తను బయటకు వెళ్లిపోయినట్టు గుర్తించారా అని :

ం అనుమానించింది మమత.

ద్వారంలో నాగరాజు ఎదురయ్యాడు.

"పద్మిని కనబడిందా?" అతడి కంఠంలో ఆతృత, దుఃఖం
ండినయ్.

"పద్మిని ఇంట్లో లేదా? మేం చూడలేదు ఆమెను!"
రూ ఒకేసారి బదులిచ్చారు.

"లక్ష్మణరావుగారు పదిగంటల ప్రాంతంలో ఇంటికి తిరిగి
్రరు, అప్పటికే పద్మిని ఇంట్లో లేదు, ఎక్కడికి వెళ్ళిందో
యిందో?"

"ఇల్లంతా చూశారా?" సుందరం ఆశ్చర్యంగా అడిగాడు.

అంతలో లక్ష్మణరావు వచ్చాడు అక్కడకు, మమత వాలకం
స్తూనే "ఏమయింది నీకు మళ్ళీ? నీవు నీ గదిలోపల
రు పెట్టుకొని పడుకున్నావుగదా? ఎలాబయటకు వెళ్ళావ్?

"మళ్ళీ నాపై హత్యా ప్రయత్నం జరిగింది." అంటూ
ంత టూకీగా జరిగినదంతా చెప్పింది.

# 7

ూంతర్యా, చేతికర్రలూ పుచ్చుకుని లక్ష్మణరావూ, నాగ
ా, సుందరం పద్మినిని వెదకటానికి బయలు దేరారు.

ారి అనుమానం ప్రథమంగా అగాథం మీదకే మరలింది.

అగాథం అంచున నిలబడి, చెట్లల్లోనూ, పొదల్లోనూ
స్తున్నారు నాగరాజు, లక్ష్మణరావు. సుందరానికి అగాథం
రాయి ప్రతివంపూ తెలుసు. అందుకే అతడు చకచకా
ుు అగాథంలోని చెరువు గట్టుకు చేరుకున్నాడు.

ురుక్షణంలోనే అతడు పెద్దగా కేక పెట్టాడు. "లక్ష్మణ
ారా! పద్మిని ఇక్కడుంది!"

క్ష్మణరావూ, నాగరాజూ పరుగు పరుగున చుట్టూ తిరిగి

క్రిందికి వచ్చారు.

చెరువులోని నీళ్లకు గజం దూరంలో పాలరాతి బండమీ
పద్మిని పడి ఉన్నది. ఆమె తల పగిలిపోయి మెదడు బయట
వచ్చింది. ఒక కాలు విరిగిపోయిఉంది. ఆమె కళ్ళు మా
తెరుచుకునే ఉన్నయ్, చూసేవాళ్ళు జడుసుకునేలా.

లక్ష్మణరావు చేతిలోని లాంతర్ని జారవిడిచి రెండు చే
లోను ముఖాన్ని కప్పుకున్నాడు.

"వరలక్ష్మి పెంపకంలో అతి గారాబంగా పెరిగిన పద్మి
ఈ పాలరాతి క్వారీకీ బలి అయిపోయింది దారుణంగా." అ
ఆక్రోశించాడు.

పద్మిని మృతదేహాన్ని చాపల్లో చుట్టి ఇంటికి తెచ్చార
బయటకు వెళ్ళిన మగవాళ్లరాక కోసం ఆత్రంగా ఎదు
చూస్తున్న వరలక్ష్మి, మమత వాళ్ళు తెచ్చే చాపచుట్ట
చూస్తూనే, జరగరానిది జరిగిపోయిందని గ్రహించి అవాక్కయి
పోయింది.

మమతను చూస్తూనే లక్ష్మణరావు అడిగాడు. "పద్మిని
చూసి నీవే అని పొరబడి, హంతకుడు ఆమెని అగాధంలో
త్రోసేశాడు. అయితే నిన్ను చంపటానికి యత్నించే హంతక
డెవరై ఉంటారు?"

"ఏమిటో! నాకంతా అయోమయంగా ఉంది. నాకు బు
అసలు పని చేయడంలేదు!" అంది మమత.

వరలక్ష్మి నిల్చున్న పళంగా సోఫాలో కూలిపోయింది. లక్ష్మ
రావు సమయానికి పట్టుకుని ఆమె క్రింద పడిపోకుండా పట్టు
కున్నాడు.

"ఎక్కడదొరికింది నాతల్లి?" వరలక్ష్మి తేరుకునిఅడిగింది.

"ఎవరో ఆమెను అగాధంలోంచి త్రోశారు. అంతక

ర్వం అగాధం అంచున ఆమె హంతకుడితో పెనుగులాడి
ట్టగా నేలమీద గుర్తులు కనబడినయ్!''
''మమతా! నీపై జరిగిన హత్యా ప్రయత్నంలో నీకూ
గా గాయాలు తగిలినట్టున్నయ్ మళ్లీ!'' ఆమె కళ్లల్లోకి
ూస్తూ లక్ష్మణరావు అడిగాడు.
''అవును! బాగా దెబ్బలు తగిలినయ్!''
వరలక్ష్మి కళ్లు పెద్దవయినయ్ ''నిజంగా హంతకుడితో
ప్లణవలన ఏర్పడినవా? లేక నీవే పద్మినితో పెనగులాడి
ను అగాధంలోకి త్రోసేశావా?''
వరలక్ష్మి చేసిన నిందారోపణకు మమత ఆకులా వణికి
ుంది.
''లేదు! నేను ఈ రోజు అగాధం వేపుగా వెళ్లనేలేదు.
గదిలోంచి నేలమాళిగలోకి రహస్యమార్గం ఉంది.''
''అవేం మాటలు వరలక్ష్మి! మమతకు పద్మినిపై అంత
్య ఎందుకుంటుంది?'' లక్ష్మణరావు అడిగాడు.
''మీకు తెలియదు! ఈ రోజు పగలు ఇద్దరూ ఈ కప్ప
ందనే కలియబడి కొట్టుకున్నారు. నేను వచ్చి ఇద్దర్నీ విడ
ను.'' అంటూ మమతవైపు తిరిగి అంది వరలక్ష్మి.
ంట్లో అయితే వీలుపడదని, పద్మినిని ఏదో మిషతో
ధం దగ్గరకు తీసుకువెళ్లి ఆమెను అక్కడనుంచి నిర్దా
్యంగా త్రోసేశావ్! నీకు సుందరాన్ని పెళ్లాడాలని ఉంటే
అమ్మాయిని చంపకుండానే, నీ కోరిక నెరవేర్చుకోలేక
ూవా!'' వరలక్ష్మి కళ్లు కోపంతో, ఏడ్పుతో ఎరుపెక్కాయి.
''అసలు ఈ అమ్మాయి మనింట్లో అడుగు పెట్టినది
దలూ మనకు అన్నీ అరిష్టాలే చుట్టుకున్నాయ్!'' జలజమ్మ
లో ఆజ్యం పోసింది.

“అంతా అబద్ధం! నేనామెను హత్య చేయలేదు. న
ఎవరో హత్య చేయబోతే, చావు తప్పి కన్ను లొట్టబో
తప్పించుకు వచ్చాను. సుందరాన్ని పెళ్లి చేసుకోబోయే జం
ను, పద్మిని హత్య చేసిందంటే ఎంత నిజమో, పద్మినిని నే
చంపాననటమూ అంతే నిజం!” మమత పెద్దగా అరిచింది.

“ఏమిటి నీవనేది?” లక్ష్మణరావు అనుమానంగా అస
నంగా మమత వంక చూశాడు.

“నేను ఈ ఇంటికి వచ్చేసరికి జయ మాయమయిం
మీ కొత్త భార్య ముద్దు చెల్లెలు, జయకు నిశ్చయమై
సుందరంపై మనసు పడింది. సుందరం కోసం, ఈ అకా
చెల్లెళ్లు జయను మటు మాయం చేశారనే నాఅనుమాన
దానికి మీరేమంటారు?” మమత రెట్టించి అడిగింది లక్ష్మ
రావుని.

“భేష్! భేష్! తిన్న ఇంటివాసాల్ని లెక్కపెట్టినట్టుగా వ
ఇంటికేవచ్చి మమ్మల్నే ఆరోపిస్తున్నావ్‌గా! అసలు నీవు చె
రహస్య నేలమాళిగలు ఈ ఇంట్లో లేనే లేవు! నీవు చెప్పే
అబద్ధం!” వరలక్ష్మి ప్రతి నిందారోపణ చేసింది.

మమత లక్ష్మణరావువంక చూసింది.

“ఈ ఇంట్లో అలాటి నేలమాళిగ ఉన్నమాట నిజమే! కా
దాన్ని చాలాకాలంగా వాడటంలేదు! అయినా ఎందుకీ వా
లాట? రేపుదయం పోలీసులువస్తారు. నిజా నిజాలు వా
బయటకు లాగుతారు. అంతదాకా ఎవరి గదులకు వా
వెళ్లిపొండి!” లక్ష్మణరావు కోపంగా, విసుగ్గా అన్నాడు.

## 1{

తన బెడ్‌మీద వాలిపోయింది మమత. చుట్టం చూపు
వస్తే, తన మీదనే హత్యానేరం వేశారు.

తను వచ్చిన నాటి నుంచీ జరిగిన సంఘటనల్ని నెమరు
సుకుని ఒకదానికొకటి ఏమైనా సంబంధం ఉన్నదేమో అని
దికింది.

జయ మాయమయి వారం రోజులయినా, ఆమె జాడ
ంతవరకూ తెలియలేదు. ఆమె చనిపోయినట్లుగా ఏ సాక్ష్య
మూ దొరకలేదు. అలా అని ఆమె బ్రతికే ఉన్నదని నిదర్శనమూ
భించలేదు.

ఆమె గదిలో బస చేసిన తనకు రాత్రిపూట ఒక స్త్రీ
కారం దర్శనమిచ్చింది.

అటు తర్వాత తను కామమ్మను చూసి వస్తుంటే అగా
ంలోకి తనను ఎవరో నెట్టివేశారు. ఆ వ్యక్తి ఎవరై ఉంటారు?
మత మనసు లో మెరుపు మెరిసింది. తనగదిలో మొదటి
జున వచ్చిన ఆకారం, కామమ్మ సైజుకి సరిపోతున్నది.
ంతేకాదు! అగాధం దగ్గర వ్యక్తిని గుర్తుకు తెచ్చుకుంటే
పెగూడా కామమ్మేనా అనిపిస్తున్నది.

జయను గూడా ఆమే హత్య చేసి ఉంటుందా? జయను
పప్పట్నుంచి, తల్లిలాగ పెంచినది కామమ్మే. అటువంటిది,
ష్టకూతురులాంటిదాన్ని చంపే అవసరంఎందుకుంటుంది?

తను కామమ్మ ఇంటికి వెళ్లినప్పుడు, తను తిరిగి రాబో
ంటే, కాఫీ కాచమనీ, అది చేసి పెట్టమనీ, ఇది చేసి పెట్ట
నీ, తనకు చీకటి పడేదాకా పనులు పురమాయించి, అక్కడే
ంచింది. కనుక ఈ ప్రయత్నం కామమ్మ పనే అయి
ంటుంది.

కానీ కామమ్మకు తనను చంపాల్సిన అగత్యం ఏముంది?
గాధంలో పడకుండా తను తప్పించుకు వచ్చానని తెలిశాక
నను నేలమాళిగలోకి రప్పించి మళ్ళీ రెండోసారి హత్య చేసే

ప్రయత్నం జరిపిందీ ఆమేనా?

ఇన్ని పనులు ఒక్కరే చేయగలరా? అందుకు మరో వ్యక్తి సాయం అయినా ఉండాలి. ఆ రెండో వ్యక్తి ఎవరై ఉంటారు బహుశా జలజమ్మ అయి ఉండవచ్చునా?

ఈ హంతకుడు ఎవరన్నాగానీ ఏ ఉద్దేశంతో అయినాగాని పద్మినిని చంపాల్సిన అవసరం ఏముంది.

అన్నీ ప్రశ్నలే! సమాధానాలు అంతుపట్టని ప్రశ్నలు!

ఈ హత్యలకు సుందరం బాధ్యత ఏమన్నా ఉందా? అవును ఒక రకంగా సంబంధం ఉన్నది. సుందరాన్ని వివాహమాడ దలుచుకున్న యువతులిద్దరూ, జయ, పద్మిని, హత్య చేయ బడ్డారు. అంటే ఈ దఫా తన వంతేనా?

కామమ్మ, సుందరం! కామమ్మ, సుందరం! ఈ రెండు పేర్లే మమత చెవుల్లో మారు మ్రోగుతున్నయ్. రేపు తెల్లా రుతూనే వీళ్లిద్దరి అంతు తేల్చుకోవాలి!

లాభం లేదు! రేపుదయానికి పోలీసులు వచ్చేస్తారు రంగ లోకి. ఈ లోపల మరికొన్ని సాక్ష్యాలు మాయ మవుతయ్.

కనుక తను ఏదన్నా చేయదలుచుకుంటే ఇప్పుడే ఈ క్షణంలోనే చేసెయ్యాలి. రిస్టువాచీ చూసుకుంది. అర్ధరాత్రి దాటి రెండుగంటలయింది.

బెడ్‌మీదనుంచి లేచి వులెన్ కోటు తొడుక్కుంది డ్రాయరు తెరచి జయ తండ్రి గదిలోంచి సంగ్రహించిన పిస్టల్ తీసి హ్యాండ్ బ్యాగ్‌లో వేసుకుంది.

పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఆ ఇంట్లోంచి బయటకి జారుకుంది. ఇంట్లో అందరూ ఎవరి గదుల్లో వారు దుఃఖ రేకంలో పడుకున్నట్టున్నారు. ఎక్కడా అలికిడి లేదు.

ఆరు బయట మంచు పడుతోంది. ముందుగా సుందర

ంటికి వెళ్ళి అతడితో తన అనుమానాల్ని చర్చించి, అతన్ని
ంటబెట్టుకుని కామమ్మ ఇంటికి వెళ్ళాలి. ఇన్ని సంఘటనలు
రిగాక, తను ఒంటరిగా వెళ్లటం తన ప్రాణాలకు ముప్పు
మ్చుకోవటమే అవుతుంది.

సుందరం ఇంటి గుమ్మం ముందు నిలబడి సుందరాన్ని కేకే
ంది మమత. లోపల్నుంచి సమాధానం రాలేదు. తలుపు తట్టు
మని తలుపుమీద చెయ్యి వేసిందో లేదో వెంటనే తలుపు
ుచుకుంది.

ముందుహాల్లో పెద్దలాంతరు వెలుగుతోంది. ఒకప్రక్కగా
మనిషి దుప్పటి గొంతువరకూ కప్పుకుని పడుకుని నిద్ర
తున్నది.

సుందరం ఇంట్లో లేడని గ్రహించింది ఆమె. కామమ్మ
టికన్నా వెడదామని వెనుదిరిగింది. ఆమె చూపు టేబుల్
ాదున్న తన ఫోటో మీద పడింది.

తన ఫోటో సుందరం ఇంట్లోకి ఎలా వచ్చిందా అని
శ్చర్య పోయింది. ఆ ఫోటోని తను జయకు ఇచ్చింది ఇది
లో. అదిక్కడకు ఎలా వచ్చింది?

ఆ విషయం తరువాత తెల్సుకోవచ్చుని మళ్లీ బయలు
ంది మమత. అంతలోనే ఆమెకు మరో ఆలోచన వచ్చి
ంది.

చిన్న కాగితం తీసుకుని, తను సుందరం కోసం వచ్చినట్టూ,
ఉడా ఇంట్లో లేనందువల్ల కామమ్మ ఇంటికి పోతున్నట్టుగా
ు మీద రాసింది. ఆ కాగితాన్ని మడచి తన ఫోటో ప్రేమ్
గుచ్చింది.

# 9

గేటు నెట్టుకుని లోపలకు వెళ్లింది మమత. కిటికీల్లోంచి

సన్నని వెలుగు కనుపిస్తున్నది.

తలుపులోపల గడియపెట్టి ఉంది. ఊచలులేని పెద్ద కిటికీల తలుపులు దగ్గరగావేసి ఉన్నాయ్.

మెల్లిగా, అతి కష్టంమీద మమత కిటికీలోకి ఎక్కింది. చప్పుడు కాకుండా లోపలకు జారింది.

టేబుల్ మీద కొవ్వొత్తి మందంగా వెలుగుతున్నది. అడుగులో అడుగు వేసుకుంటూ హాలు మధ్యలోకి వెళ్లి నిలబడి, చుట్టూ కలయ జూసింది.

అంతలోనే ఎవరో ఆమె మెడ త్రిప్పటానికి వీల్లేకుండ గట్టిగా పట్టుకున్నారు. "ఇంత జరిగాక కూడా నీవు ఎంతకైనా తెగించి నా ఇంటికి వస్తావని ముందే ఊహించాను." అన్నద ఆ కంఠం కర్కశంగా.

పాము స్పర్శ తగిలినట్టుగా మమత ఉలిక్కిపడింది ఆమె అనుమానం పటాపంచలైంది. అదే స్పర్శ తనను అగాధంలోకి త్రోసింది. అదే స్పర్శ నేల మాళిగలో తన ప్రాణాలు తీయ టానికి ప్రయత్నించింది.

"కామమ్మా! నీ రహస్యం తెలిసిపోయింది! ఇకనన్ను మభ్య పెట్టలేవు!" అంది మమత.

"నా రహస్యం నీకు తెలియవచ్చు. కానీ నీ నుంచి ఆ రహస్యం బయటకు మాత్రం పొక్కకుండా చేసి తీరతాను. నాచే లోంచి రెండుసార్లు తప్పించుకున్నావ్! రెండుసార్లు నీవ చచ్చి పోయావనే పొరబాటు పడ్డాను. ఈ దఫా, నా క దీరా, తీరిగ్గా, చచ్చేదాకా చంపి తీరతాను." కామమ్మ వికటం నవ్వింది.

సుకుమారంగా ఉన్న మమతను తన ఉక్కు చేతుల్లో బంధించి, ఆమెను లోపల గదిలోకి నెట్టుకెళ్ళింది కామమ్మ.

తాడు తీసుకుని మమత కాళ్ళూ చేతులూ బలంగా బంధం
సేసింది.

వంట ఇంట్లోంచి పెద్దకత్తిని తెచ్చి దాన్ని గట్టిగా రుద్ద
గింది, రాతిమీద.

మమత తను ఇలా వచ్చినందుకు బాధపడలేదు. ఆమె
ంనసులో సరికొత్త ఆలోచన వచ్చింది.

"కామమ్మా! నీ చేతిలో నాకు ఎటూ చావు రాసిఉంది.
యితే జయ ఏమైందో తెలుసుకోవాలని ఉంది, చచ్చేలోపుగా?

మమత మాటలకు కామమ్మ గర్వంగా నవ్వింది."ఇదే
త్తితో జయను హత్య చేశాను. ఆమె అస్తిపంజరం ఇంకా
ల మాళిగలోనే ఉంది నీవుచూడలేదా?

"నీవా? జయను హత్య చేయుటనా? చిన్నప్పట్నుంచీ నీ
తులతో పెంచిన జయను! నేను నమ్మలేకుండా ఉన్నాను!"

ఆమె పొగడ్తకు కామమ్మ ఉబ్బిపోయింది. "ఆమెను నాచే
ంలతోనే పెంచిన మాట వాస్తవమే! కానీ లోకానికి తెలియని
షయం ఇంకోటి ఉంది. లక్ష్మణరావుకూ, నాకూ చాలకాలంగా
క్రమ సంబంధం ఉంది. ఆ రకంగా అతడ్ని నా చెప్పు చేతల్లో
ంచుకున్నాను.

"అకస్మాత్తుగా, సిటీకి వెళ్ళిన లక్ష్మణరావు మరో వగలాడిని
ళ్ళాడి, వెంట తెచ్చుకున్నాడు. అందువలన లక్ష్మణరావుపై
దీర్చుకోవటానికి జయను చంపాను. ఆ హత్యానేరం
ంలక్ష్మిపైకి పోతుందని ఆశించాను.

"కానీ ఈ లోపలే నీవు రంగం మీాదకు వచ్చావ్! నా రహ
స్యన్ని వెదికి పట్టుకుంటావనే అనుమానం కలిగింది నాలో.
ందుకే నీవు క్రితంసారి మా ఇంటికి వచ్చి తిరిగి వెళ్ళేటప్పుడు
న్ను అగాధంలోకి త్రోసేశాను. వెనుకనుంచివచ్చి. అగాధంలో

పడిపోతూ నీవు పెద్దగా అరిచావు. ఆ కేకకు ఎవరైనా అటుగా వచ్చి నన్ను గుర్తిస్తారేమో అని వెంటనే పారిపోయాను. నీ అదృష్టం బాగుండి ఆ తడవకు నీవు బ్రతికి బయటపడ్డావ్!

"నేలమాళిగలో నిన్ను బలంగా తన్నినప్పుడు నీవు చలనం లేకుండా పడిపోయావ్ క్రింద. అక్కడ నేలమీద విషం పూయబడిన మేకులు తలక్రిందులుగా పాతబడి ఉన్నయ్. నీవు వాటిమీద పడి చనిపోయావనుకునే, నేను వెళ్ళిపోయాను." కామమ్మ ఆగింది.

"అయితే పద్మిని నీకేమపకారం చేసిందని ఆమెనుచంపావ్!"

"నేల మాళిగలో నీ పని బట్టిన తర్వాత, నేను అగాధం ప్రక్కగా నడిచి వస్తున్నాను. అంతరాత్రివేళ పద్మిని అక్కడ తారాడుతున్నది, ఎందుకో! ఆమెను చూసి ముందు నీవే, నేల మాళిగలోంచి తప్పించుకువచ్చావని భ్రమసి భయంతో, ఆమెను అగాధంలోకి నెట్టటానికి ప్రయత్నించాను. ఆమె పెనుగులాడింది. ఆ పెనుగులాటలో మేం ఒకర్నొకరం గుర్తు పట్టుకున్నాం. ఆమె నీవు కాదని తెలిశాక కూడా, నా రహస్యాన్ని కాపాడుకోవడం కోసమని ఆమెను చంపక తప్పలేదు.,"

"అంత రాత్రివేళ పద్మిని అక్కడ ఎందుకు తారట్లాడు తున్నదో తెలుసా? నేనూ, సుందరం రహస్యంగా ప్రణయం జరుపుకుంటున్నామేమో కనిపెట్టాలని వచ్చింది. పాపం! చివ రకు తన ప్రాణాల్ని బలి పెట్టుకుంది."

"నీవు మాత్రం చేసిన దేమిటి? రెండు సార్లు చావు తప్పించుకుని గూడా మళ్లీ మూడోసారి వచ్చావ్!" కామమ్మ వెటకారంగా అంది, చూపుడు వ్రేలితో కత్తిపదును చూస్తూ.

"కామమ్మా! ఈ సారికి ప్రాణాలతో వదిలెయ్! ఇటునుంచి ఇటే మా ఊరు వెళ్ళిపోతాను. ఇక ఎన్నడూ ఈ చాయాలకు

ాను! నీ ఊసే ఎత్తను సరా?'' ప్రతిమాలు తున్నట్టుగా
ంది మమత.

''ఎంత ఆశ! నీ సంగనాచి కబుర్లు నా దగ్గర కాదు. నా
ట్టుమట్టులన్నీ తెలుసుకున్న నిన్ను ఇంకొక్క క్షణంగూడా
దలను!'' అంటూ కత్తి గురి చూపుతూ ఆమె మీాదకు
ాసాగింది కామమ్మ.

మమత తను ఒంటరిగా వచ్చినందుకు మరో దఫా విచా
ించింది.

లక్షాధికారి లక్ష్మణరావు తన చేతుల్లోంచి జారిపోయాడని
రుసగా మూడు హత్యలు చేయడానికైనా వెనుదీయడంలేదు,
ఈ కామమ్మ. అదీ వయసులో ఉన్న కన్యలను!

వయసు మళ్లిన కామమ్మకే ఆస్తిపైన, మగవాడి మీాద
ంత మక్కువ ఉంటే, ప్రాయంలో ఉండి, అనుభవించవలసిన
ీవితం బోలెడంత ఉన్న జయ, పద్మినీల సంగతేమిటి అను
ంది మమత.

# 20

కామమ్మ కళ్లు క్రూరంగా తననే చూస్తున్నయ్. ఆమె
ళ్లు కొరుకుతూ తనకి ఇంకా ఇంకా చేరువయింది.

కామమ్మ చేతిలోని మూడడుగుల కత్తిమొన ఆమె గుండెల
గ్గర ఆనింది.

భయంతో మమత కెవ్వున అరిచింది. ఆ సంగతి గ్రహిం
న కామమ్మ తన రెండో చేతితో ఆమె నోటిని నొక్కేసింది
లంగా.

మమత గట్టిగా కళ్లు మూసుకుంది, గుండెల్లో కత్తి దిగ
ాన్ని ఊహించుకుంటూ.

కత్తి వెనక్కుపోయింది. మమత ఆశ్చర్యంతో కళ్లు తెరిచింది.

ఆరడుగుల సుందరం బలిష్టమైన హస్తాల్లో రాక్షసిలాంటి కామమ్మ తన్నుకుంటుంటోంది. ఆమె చేతిలోని కత్తి క్రింద పడిపోయింది.

"సుందరం!" ఆనందంతో అరిచింది మమత.

కామమ్మను కట్టి పడేసి, మమతను విడిపించాడు సుందరం.

"మమతా! జయకు నిశ్చయమైన ముహూర్తానికే మన పెళ్లి జరుగుతుంది!" అన్నాడు ఆమె చెవిలో.

"లాభం లేదు సుందరం! నిన్ను ప్రేమించిన వారందరికీ ప్రాణ గండం ఉంది. నేను పదేళ్లపాటు బ్రతకాలంటే నిన్ను చేసుకోగూడదు. నిన్ను వివాహమాడాలని ఆశించిన జయ ఏమయింది? నీపై మోజు పడిన పద్మిని ఎలా అంత మొందింది? చివరకు నేనూ నీ వ్యామోహంలో పడే సరికి, నాకే గతి పట్టిందో చూశావా?"

సుందరం పెద్దగా నవ్వాడు." నాపై అనవసరంగా ఆరోపణ చేస్తున్నావ్! జయ, పద్మిని మరణాలకు నేను బాధ్యుడ్ని కాదు! ఇదుగో! ఆ ఇంటికి దాపురించిన ఈ శనిగ్రహం మూలాన్నే ఇన్ని హత్యలూ జరిగినయ్!"

దూరంగా పోలీస్ జీప్ ఆ గ్రామంలో ప్రవేశించడం చూస్తూనే కామమ్మ ముఖంలో కత్తివాటు వేసినా నెత్తురు చుక్క లేకుండా పోయింది.

—: అయిపోయింది :—

# ఇంటి దొంగలు

## ఏ. వీ. మోహన్రావ్

గది తలుపు త్రోసుకొని లోని కొచ్చాడు వాసు.

మంచానికి అడ్డంగా లుంగ చుట్టుకుని పడుకున్న రోజాను చూసి నవ్వుకున్నాడు. ఆమె చీర నడుంపైకి పోయింది. గాలి కోసం జాకెట్ తీసివెయ్యడంతో అందమైన రొమ్ములు ఆసాంతం కనుపించసాగాయి.

దగ్గరగా వెళ్లి తట్టాడు వాసు.

ఉలిక్కిపడి లేచికూర్చుంది రోజా. కళ్లుతెరచి చూసింది.

"నువ్వా?" అంది ఆశ్చర్యంగా.

"నేనే"

"ప్రొద్దుటేవచ్చావేం! ఇంట్లో అమ్మలేదూ..." అడిగింది.

"ఏమో? కనుపించలేదు. ఏమిటీ అవతారం. గబగబలేచి

బట్టలు సర్దుకో! నీకో ముఖ్యమైన విషయం చెప్పాలి." అన్నాడు వాసు.

రోజా మంచందిగి, లోపావడా బొందు సరిచేసుకుని, చీర సర్దుకొని కట్టుకొంది. తలగడ క్రింద పెట్టిన జాకెట్ తీసి తొడుక్కుంది. వాసు చూస్తూ నిలుచున్నాడు.

"నువ్విలా కూర్చొనుండు. బాత్‌రూం వెళ్ళొస్తాను!" అంటూ గదిలోంచి వెలుపలకు దారి తీసింది.

వాసుకు అపరిమితమైన ఆనందంగానూ, ఉత్సాహంగానూ వుంది. ఆ ఉదయం తెలుసుకొన్న రహస్యం రోజాకు చెప్పి, ఆమెను ఆశ్చర్యంలో ముంచెత్తి పోవాలని ఎకాయెకినవచ్చాడు.

రోజా అందాన్ని అమ్ముకుని జీవించే మామూలు బజారు మనిషి. ఆమెతో అతనికి పరిచయమయి నెలరోజులైంది. ఆమెపైన పిచ్చిప్రేమలాంటిది కలిగింది. దాంతో రోజా రావడం మొదలెట్టాడు. డబ్బిచ్చినన్నాళ్ళు వాళ్లమ్మగా చెలామణి అయ్యే అప్పలమ్మ అభ్యంతరపెట్టలేదు. లేకుండా వచ్చిన రోజున తిట్ల వర్షం కురిపించి వీధిలోంచే తరిమి వేసింది.

"అమ్మాయి! రోజా! ఇంకా నిద్రలేవలేదూ!" అరచు కుంటూ అడుగెట్టింది అప్పలమ్మ. ఆమెకు ఎదురుగా ప్రత్యక్ష మైన వాసును చూడగానే కోపం కట్టలు తెంచుకొంది.

"నువ్వా? ఎప్పుడు దిగడ్డావు?" ఈసడింపుగా అడిగింది.

"ఇప్పుడే!" చెప్పాడు వాసు.

"రోజా ఏది?"

"బాత్‌రూంకు వెళ్లింది."

"నిన్న చెప్పాను. బుద్ధిలేదూ. ప్రేమా, దోమా, అంటూ తీరిగ్గా కూర్చుని కబుర్లు చెప్పడానికి నేనేం మహారాణినా?

నాకూతురు రాజకుమారా?'' మళ్లీ అడిగింది నిన్నటిమాటలే. ఆపైన పెంచబోయే తిట్లకు ఉపోద్ఘాతంలా.

''అనవసరంగా మాట్లాడకండి. నిన్నటిసంగతివేరు. ఇవాల్టి పరిస్థితి వేరు!''

''ఏం? రాత్రికిరాత్రి లాటరీలో లక్షలొచ్చాయా. లేక వేలు విడిచిన మామగారైన ధరణికోట రాజుగారు ఆస్తంతా నీ మొహాన కొట్టి, స్వర్గానికి చెక్కేశాడా? అడిగింది అప్పలమ్మ.

''స్వర్గాన్నికైతే పోలేదుగానీ, ఆయన నాకు వేలువిడిచిన మామగారు. ఖచ్చితంగా వరసలోని మేనమామే. అంటే మా అమ్మకు స్వయంగాతమ్ముడే!'' అన్నాడు వాసు.

''ఇదో కొత్త ఎత్తు పెట్టుకొని వచ్చావన్నమాట. వెళ్ళు వెలుపలికి.'' అంది కోపంగా అప్పలమ్మ.

అంతలో లోనికొచ్చిన రోజా ''అమ్మా! ఆయన చెప్పేదేదో కాస్తవినరాదూ! ఆ తర్వాత వెలుపలికి తరమవచ్చు.'' అంది.

''అది మర్యాదస్తుల లక్షణం. రోజా! ఈ దినం నా పాత పుస్తకాలు తిరగేస్తుంటే, వాటిల్లో ఈ కవరు దొరికింది. అందులో ఈ ఫోటో, దానితో పాటు మాఅమ్మరాసి పెట్టిన ఈ ఉత్తరం దొరికాయి. నువ్వే చదువు. అసలు సంగతి అర మవుతుంది.'' అంటూ కవరు అందించాడు వాసు.

రోజా ఫోటో చూసి ప్రక్కన పెట్టి ఉత్తరం పూర్తిగా చదివింది. ఆమె కళ్లు మెరిశాయి.

''అమ్మా!'' అరచింది ఆనందాతిశయంతో.

''ఏమిటే?'' అడిగింది అప్పలమ్మ.

''ఈయన నిజంగానే ధరణికోట రాజాగారైన గజపతిరావుకు మేనల్లుడు. వీళ్ల అమ్మ ప్రేమించి ఒకతనితో లేచిపోయింది. వీరు పుట్టగానే ఆయన పోయాడు. ఆ తర్వాత కొన్నేళ్లకు

ఆమెకూడా పోయింది. ఆ తర్వాత........!''

''ఈయన మిగిలాడు. మన ప్రాణాలతోడుకు త్రాగేందుకు. దీనివల్ల మనకేంజరుగుతుంది?'' అడిగింది అప్పలమ్మ కూతురి మాటలకు మధ్యలోనే అడ్డొచ్చి.

''ఆయనకెవ్వరూలేరు. ఆ విషయం బహుశా మీకు తెలిసి వుండవచ్చు. ఐదేళ్లక్రితం కారెక్సిడెంటులో ఆయన భార్య ఇద్దరుపిల్లలు అకాలమరణం పాలయినారు. ఆ ఆస్తికంతా నేనే ఏకైక వారసుణ్ని. అంటే కోటీశ్వరుణ్ని. ఏచిన్న కోర్టులో కేసువేసినా నా వారసత్వం చెల్లుతుంది. దానికి నా దగ్గరున్న సాక్ష్యాలు ఈ ఫోటో, ఉత్తరం, చాలు.''ఆ తల్లీ కూతుళ్లను గమనించాడు.

''క్షమించు బాబు! తెలీక ఏదో అన్నాను. అయినా అల్లుడితో ఆ మాత్రం సరదాపడకపోతే అత్తగారి గొప్పతనం ఏముం టుంది?'' అంది అప్పలమ్మ.

''వరస ముదిరిందే అత్తయ్యా! పాతిక రూపాయల్లేవని పాడు తిట్లు తిట్టావ్. అయినా నీ గుమ్మం ముందు కొచ్చాను. ఎందుకో తెలుసా! రోజాను ప్రేమించాను. ఆమె నాకు కావాలి. శాశ్వతంగా నాకు స్వంతంకావాలి. ఆమె గతంగానీ, ప్రస్తుతం గానీ, నాకు అవసరంలేదు. ఈ డబ్బురాగానే ఆమెను పెళ్లాడి, ఆమెకోసం స్వర్గం నిర్మిస్తాను. దానికి నిన్ను కాపలా పెడతాను. ఏమంటావు?'' అడిగాడు, వాసు ఉత్సాహంగా.

''ఆనందంగావుంటాను. మీరు మాట్లాడుతూ వుండండి. నేవెళ్లి కాఫీ తెస్తాను.'' అంటూ లోనికురికింది అప్పలమ్మ.

''వాసూ!'' పిలిచింది ప్రేముగా రోజా.

''రోజా!'' పలికాడు వాసు మత్తుగా.

''అంతడబ్బొస్తే, నాకు కారు కొనిపెట్టవూ.''

"ఒక్కటికాదు. ఐదు!"

"బంగళా?"

"ఇంద్ర భవనం కట్టిస్తాను."

"ఇంకా......"

"నన్నడగొద్దు. నీకు ఏం కావాలో, అవన్నీ కొనుక్కో. నాక్కావలసింది మాత్రం ఇవ్వు. చాలు!" అన్నాడు వాసు.

"ఏం కావాలి?"

"తెలీదా! మత్తులో ముంచి, చిత్తుచేసే నువ్వు, నువ్వు కావాలి!" అన్నాడు వాసు ఆమెను రెండుచేతులతో తన కౌగిట్లోకి లాక్కుంటూ.

"పరగడుపున ఈ పనులు పనికిరావు అల్లుడూ! అలసి పోతారు. ముందీ టిఫిను, కాఫీ తీసుకోండి!" అంటూవచ్చింది అప్పలమ్మ.

వాసు, రోజాను వదిలేసి దూరంగా జరిగాడు.

అప్పలమ్మ అందించిన టిఫిను తినటం మొదలెట్టారు ఇద్దరూ.

"వాసూ! ఈ డబ్బు మనకెప్పుడు చేతికందుతుంది?" అడిగింది రోజా.

"నేను మామయ్యను కలుసుకోవాలి. మాట్లాడాలి. నేనెవరో ఆయనకు ఋజువు చెయ్యాలి. ఆ తర్వాత అక్కడే మకాం పెట్టాలివునం. బాగా ముసలి వాడయినాడు. ఇంక ఎంతో కాలం బ్రతకడని విన్నాను. ఆయన పోయాక అంతామనదే!" అన్నాడు వాసు.

"అయితే ఇవాళే వెళ్దాం!"

వద్దు! ఆయన దగ్గరకు వెళ్ళేముందు కాస్త మంచి బట్టలు వేసుకోవాలి. ఇప్పటిదాకా నేను గౌరవంగానే బ్రతుకు

తున్నానని ఆయనకు నమ్మకం కలిగించాలి. చిల్లర దొంగతనాలు చేస్తూ, అప్పుడప్పుడూ అత్తవారింటికెళ్ళి వస్తున్నానని తెలిస్తే నన్ను ఆయన దరిదాపులక్కూడా రానివ్వడు."

"నువ్వొక్కడివే వెళ్ళొస్తావా?"

"ఆఁ! అంతా సెటల్ చేసుకున్నాక నిన్ను తీసుకెళ్తాను. అక్కడికి మకాం మార్చేలోగా నీ మెళ్లో ఒక పసుపు తాడుని కడతాను. లేకుంటే నమ్మడు."

"నీ యిష్టం! కావాలంటే ఇప్పుడే కట్టు." అంది రోజా.

ఇద్దరూ టిఫిను తినటం ముగించి కాఫీ సేవించడం కూడా పూర్తి చేశారు.

"మా అమ్మనడిగి నాకు ఐదొందలు అప్పుగా ఇప్పించు. నాలుగైదు రోజుల్లో ఇచ్చేస్తాను." అన్నాడు లేస్తూ.

రోజా లోనికి వెళ్ళి ఐదునిముషాల్లో తిరిగొచ్చిందిడబ్బుతో.

"అమ్మ అప్పు ఇవ్వడానికి భయపడింది. నేనెలాగో నచ్చచెప్పి తెచ్చాను. త్వరగా తిరిగి ఆమె మొహాన కొట్టు." అంది రోజా.

"అలాగే! ఇంతకు ఇంత చేర్చి పారేస్తాను." అంటూ అందుకుని జేబులో పెట్టుకున్నాడు.

రోజా దగ్గర సెలవు పుచ్చుకుని వెలుపలికొచ్చాడు.

## 2

రాజా గజపతిరావుగారు కళ్ళు మూసుకొని కాళ్ళు చాపుకుని వాలుకుర్చీలో జేరబడి, ఏదో ఆలోచించుకోసాగారు.

ఎవరో మనిషి దగ్గరగా నడచివచ్చిన అలికిడైంది. కళ్ళు తెరవకుండనే.

"ప్రసాద్! రా! అలా కూర్చో!" అన్నాడు రాజాగారు.

"నమస్తే! ఎలావున్నారు? రాత్రి బాగా నిద్రపట్టిందా?" అడిగాడు ప్రసాద్ కూర్చుంటూ. అతను రాజా వారికి

ఎస్టేట్ మేనేజర్. వారి వ్యవహారాలన్నీ ఈపదేళ్ళుగా చూస్తూ వున్నాడు.

"ఆఁ! అయినా నాకు కావలసింది నిద్రగాదు. దీర్ఘ నిద్ర. ఎంతో జీవితం ముందుంచుకొన్న నా పిల్లలిద్దరూ నా కళ్ల ముందే పోయారు. నేను మాత్రం మొండిగా, మోడయి బ్రతుకుతున్నాను. నాకు ఎప్పుడు నిష్కృతి లభిస్తుందో అర్థం కావడంలేదు." అన్నాడు రాజాగారు.

"అలా అనకండి సార్! యిలాంటివాళ్లు చిరాయువుతో వుండాలి. అప్పుడే సమాజానికి కొంతయినా మంచి జరుగుతుంది."

"ప్రసాద్! నేను చెప్పిందేం చేశావ్?"

"ఏ విషయం మీరడిగేది?"

"అదే మన బంగళాలోవున్న జవాహరీ అంతా అమ్మేవిషయం ఎవరినన్నా మాట్లాడావా?"

"లేదుసార్ రెండ్రోజుల్లో ఏర్పాటు చేస్తాను." అన్నాడు ప్రసాద్.

"ఆలస్యం చెయ్యకు నాకు త్వరగా డబ్బు కావాలి."

"అలాగే! ఇంకో విషయం చెప్పాలని వచ్చాను." అంటూ ఆగాడు.

"అనుమానిస్తావేం? చెప్పు." అన్నాడు రాజాగారు.

"మీకు దగ్గర బంధువునంటూ ఒకతను వచ్చికూర్చున్నాడు. మిమ్మల్ని చూడాలట. మాట్లాడాలట. అతనివెంట అందమైన స్త్రీ కూడావుంది." చెప్పాడు ప్రసాద్.

"ఎలాంటి బంధుత్వమో చెప్పారా?"

"లేదు!"

"ఎందుకని?"

"ఆ వివరాలు మీకే చెప్తామన్నారు. మిమ్మల్ని అడిగి పంపు తానని చెప్పి, ఆఫీస్ గదిలో కూర్చోబెట్టి వచ్చాను. పంప మంటారా?"

"వెంట తీసుకునిరా! వాళ్లతోపాటు నువ్వూవుండు." అన్నారు రాజాగారూ.

ఐదు నిముషాల తర్వాత ప్రసాద్, వాసునూ, రోజాను వెంట బెట్టుకొచ్చి రాజాగారి ముందు నిలబెట్టారు.

వాలు కుర్చీలో లేచి కూర్చున్నాడు రాజా, ఎదురుగా వున్న మనుషుల్ని పరిశీలనగా నఖశిఖపర్యంతం, పరిశోధన చేసినట్లు చూసి, చిన్నగా దగ్గి "మీ ఇద్దరిలో ఎవరు నాకు బందువులు." అడిగాడు.

"నేను." అన్నాడు వాసు అడుగు ముందుకేసి.

"ఏమిటి నాతో నీ బంధుత్వం?"

"మీకు మాధవి అనే చెల్లెలుండేది. బహుశా మరచిపోలేదను కుంటను. ఆమె మీ ఇష్టానికి వ్యతిరేకంగా, ప్రేమించిన వ్యక్తి తోలేచిపోయింది. నే నామెకుమారుణ్ణి. కావాలంటే ఈ ఫోటో, మా అమ్మ నాకోసం రాసి పెట్టిపోయిన ఈ ఉత్తరం చూడండి!" అన్నాడు వాసు కవరు అందిస్తూ.

రాజాగారు వాట్ని అటు ఇటూ త్రిప్పిచూసి తిరిగి ఇచ్చేశాడు. "ఇక్కడికెందుకొచ్చావ్?"

"మీకు జరిగిన ఘోరమైన నష్టం విని బాధపడ్డాను. ఈ వయసులో వుండలేక, గుండెజబ్బుతో బాధ పడుతున్న మీకు! రక్తబంధువుగా, సేవచేద్దామని నా భార్యతోవచ్చాను." అన్నాడు వాసు.

"నా చెల్లెలు ఎప్పుడో చచ్చిపోయింది. ఆమెను గుమ్మం త్రొక్కనివ్వలేదు. అలాంటిది నిన్ను నేను ఆదరిస్తానని ఎందు

కనుకొన్నావ్?''

''రక్తం, నీళ్ళు కాదు గనుక'' టక్కున చెప్పాడు వాసు.

''మాటకారివే! తిండిలేదనీ, గుడ్డలేదనీ, రోజూ నా దగ్గరకు ఎంతోమంది సాయంకోసంవస్తారు. మిమ్మల్ని వాళ్లలో లెక్కించుకొని, చెరోవంద కావాలంటే ఇచ్చి పంపుతాను. అంతకు మించి నా వద్ద ఆశ్రయంగానీ, నా ఆస్తిలో భాగంకానీ ఆశించకుండా వెళ్ళిపోండి!'' అన్నాడు రాజాగారు కోపంగా.

''మామయ్యా!'' అరచాడు వాసు ఆవేశంగా.

''ఏమయ్యా! మారు మాట చెప్పకుండా నోరు మూసుకొని వెళ్ళిపో!'' అర్చాడు అంతకన్నా పెద్ద గొంతుకతో రాజాగారు.

''వెళ్తాను. వెళ్లి కోర్టులో కేసువేస్తాను. నా వాటా నా కెలారాదో చూస్తాను. రోజా! రా! పోదాం!'' అంటూ వెలుపలికి కోపంగా నడచాడు. రోజా అతన్ని అనుసరించి వెళ్లిపోయింది.

''బాబుగారూ!'' పిలిచాడు ప్రసాద్.

''ఏమిటి?''

''అతను మీమేనల్లుడు. ఆస్తిలో వాటా ఇవ్వకున్నా, ఆశ్రయం ఇచ్చి వుంటే బాగుండేదనుకుంటాను. అనవసరమైన కోర్టు కేసులుతప్పేవికూడాను.'' తనకు తోచింది చెప్పాడు ప్రసాద్.

''అపాత్రదానం చెయ్యడం పద్ధతికాదు. నేనేం చేస్తున్నానో. నాకు తెలుసు కంగారు పడకు. నే చెప్పినట్లు చెయ్యి.'' అన్నాడు రాజాగారు.

''అలాగే'' అనిచెప్పి శెలవు తీసుకొని ఆఫీసుగదికి తిరిగి వచ్చాడు. ప్రసాద్ టేబుల్ ముందున్న కుర్చీల్లో ఆసీనులయి వున్న వాసు, రోజా, కనుపించారు.

"మీరింకా ఇక్కడే వున్నారా?" అడిగాడు కూర్చుంటూ ప్రసాద్.

"ఆఁ! మీతో ఒక్క విషయం మాట్లాడుదామని..." నసుగుతూ అంది రోజా.

"నాతోనా? ఏమిటి? చెప్పండి!"

"రాజాగారు ఏదైనా వీలునామామా రాశారా?" అడిగింది రోజా.

"ఆ విషయం మీ కెందుకు?"

"అవసరం కాబట్టి అడుగుతున్నాం." అన్నాడు వాసు.

"మీకు రాజాగారిగురించి సమాచారం అందించినందువల్ల నాకు కలిగే లాభమేమిటి?" సూటిగా అడిగాడు ప్రసాద్.

"మాకు వచ్చేవాటలో సగం నీకు ఇస్తాం!"

"నోటిమాటేగా? సులభంగా చెప్తారు! ఎవరైనా—?" అన్నాడు ప్రసాద్.

"నీకు అనుమానంగా వుంటే అగ్రిమెంటురాయి. సంతకం చేస్తాను." అన్నాడు వాసు.

"గుడ్! ఇది బాగుంది. రేపు సాయంత్రం మీ రిద్దరూ క్వాలిటీకిరండి. కలుసుకుందాం. వివరాలు అక్కడ మాట్లాడు కుందాం." అన్నాడు ప్రసాద్.

"థాంక్స్! వస్తాము." అంటూ లేచారు ఇద్దరూ.

పోర్టికోదాకా సాగనంపి తిరిగివచ్చి కూర్చున్నాడు ప్రసాద్ తన పరిస్థితి నెమరువేసుకొనసాగాడు.

అతను రాజాగారి దగ్గర ఉద్యోగంలో చేరి పదేళ్లయింది. జీతం రాళ్లు తప్ప పైన పదిపైసలుకూడా చిక్కవు. రాజాగారు చాలా తెలివిగలవాడు. ప్రతి వ్యవహారం తనే స్వంతంగా చూచు కునేవాడు. వారి భార్యా పిల్లలు పోయాక, ప్రసాద్‌కు కొంత

స్వాతంత్ర్యం చిక్కింది. కానీ డబ్బు మాత్రం చిక్కలేదు. అంత దాకా ఆయనకు వారసులెవ్వరూ లేరనుకుంటూ వుండిపోయాడు. అంతకు నెలరోజులముందు లాయర్ని పిలిచి వీలునామా వ్రాయించాడు. వివరాలు పూర్తిగా తెలియకపోయినా అందులో తనకు ఏ విధమైన వాటాగానీ లేదని మాత్రం తెలుసుకున్నాడు. ఆస్తినంతా నాలుగు భాగాలుచేసి, పిల్లల ఆసుపత్రికీ, ఆడ పిల్లల కాలేజీకి, అనాధశరణాలయానికీ, వెంకటేశ్వరస్వామి దేవాలయానికి, సమానంగా చెందాలని కోరాడు.

ఈ విషయం తెలిసింది మొదలు ప్రసాద్‌కు రాజాగారిపైన కక్ష, కోపం అసూయ, పుట్టుకొచ్చాయి. అర్ధరాత్రిపూట గొంతు పిసికి చంపుదామనుకున్నాడు. దీనివల్ల ఆస్తి చిక్కక పోగా, తను పోలీసులకు చిక్కి పోవలసివస్తుందని భయపడి మానుకున్నాడు.

ఈ దినం, వాసు, రోజాల రాక అతనిలో క్రొత్త ఆశలు చిగురింపజేసింది. వాళ్లకు ఆశ్రయమిస్తాడేమోనని ముందు భయ పడిపోయాడు. ప్రసాద్. తన్ని తరిమేశాక చూచి ఆనందించాడు.

ప్రసాద్‌కు లేని అవలక్షణం లేదు. జూదం, త్రాగుడు, వ్యభిచారం, లాంటి అన్ని గుణాలు వున్నాయి. వాటికి డబ్బు అవసరం. దానికోసం ఏదో ఒకటి చెయ్యాలన్న తపనలో గత నాలుగేళ్లలో, రాజాగారి ఖజానాలో కొంత భాగం నగదుగా మార్చి వాడుకున్నాడు. దాని విషయం గురించి రాజాగారు ప్రస్తావించినప్పుడల్లా, కూడసాకులుచెప్పి, తప్పించుకొచ్చాడు ఇప్పటిదాకా.

జోడి కావాలనిపించింది. కానీ ఆమె వాసు భార్యని చెప్పాక కొంత నిరుత్సాహపడ్డాడు.

టెలిఫోన్ తీసి నెంబరు త్రిప్పి, కనెక్షను దొరకగానే, వాసు, రోజాల వివరాలు చెప్పి, వాళ్ల గురించి సాధించగలిగిన సమాచారమంతా సేకరించి మరుసటి దినం సాయంత్రంలోగా అందివ్వమని పురమాయించారు.

## 3

ఆలోచిస్తూ కుర్చీలో వెనక్కి జేరపడ్డాడు.

ఆటోదిగి డబ్బిచ్చి బార్‌లోకి దూరాడు ప్రసాద్. మధ్యగా నిలుచుని తనకు కావలసిన వ్యక్తులకోసం సర్వే చేశాడు కళ్లతో. మూలగా ఖాళీగావున్న టేబుల్ వెనక కూర్చున్న రోజా కనుపించింది. తిన్నగా అటుకేసి వెళ్లాడు.

"సారీ! లేటయింది!" అంటూ కూర్చున్నాడు ప్రసాద్.

"ఫరవాలేదు!" గ్లాసు పెదాల కందించుకుంటూ అంది రోజా.

"మీవారేరి?"

"మందుకాస్త ఎక్కువయింది. మత్తు క్రమ్ముకొచ్చింది. అక్కడే వుండిపోయారు. మిమ్మల్ని నిరాశపరచడం ఇష్టంలేక నేనొచ్చాను." అంది రోజా.

"ఆడించేది నువ్వని, నిన్ననే పసిగట్టాను. అతనితో నాకేం పనిలేదు. అసలు వ్యవహారం మాట్లాడుకుందాము?"

"ఓ. కే. మీకూ మందు తెప్పిస్తాను." అంది రోజా వాలు చూపులు చూస్తూ, వలపు బాణాలు వదులుతూ.

"మీరు చచ్చి గీపెట్టినా, ఆస్తిలోవాటా ఇవ్వడు రాజాగారు. కోర్టులో కేసువేసినా చెల్లదు. వాళ్ల వంశాచారం ప్రకారం, రాజరికం సంక్రమించిన వ్యక్తికే ఆస్తిపైన అన్ని హక్కులూ

వుంటాయి. తోడబుట్టిన వాళ్ళకు ఇష్టమైతే ఇస్తారు. లేకుంటే లేదు. మీరు కోర్టుకు వెళ్ళడం వృధా ప్రయాస!"

"అని చెప్పమని రాజాగారు పంపారా మిమ్మల్ని?" గ్లాసు టేబుల్‌పైన పెడుతూ అడిగింది రోజా.

"లేదు! నాకు తెలిసిన నిజమది! చెప్పాను."

"మనకా ఆస్తిలో వాటాకావాలి! ఎలావస్తుందో ఆలోచించండి. మమ్మల్ని మీరేం చెయ్యమంటే అదిచేస్తాం!" అంది రోజా.

"గుడ్! నేను ఒక పథకం ఆలోచించాను. జాగ్రత్తగా అమలుజరిపితే సగం దక్కించుకోవచ్చు. ఆ సగం మనం సమానంగా పంచుకుందాం!"

"ఓ. కే!"

"రాజాగారు విల్లు రాశారు. అందులో ఎవ్వరికీ ఏమీలేదు. ఆ విల్లు ప్రస్తుతం బాంక్‌లోవుంది. దాన్ని మనం దొంగిలించాలి. వేరే విల్లు రాయించి, దీని స్థానంలో దాన్ని పెట్టాలి. అంతే!"

"ప్లాను బాగుంది. రాజాగారి సంతకం కావాలిగా?"

"ఫోర్జరీలు చెయ్యడంలో పద్మశ్రీలు సంపాదించినమనిషి నాకు తెలుసు. అతన్ని వాడుకుందాం. మీ పనల్లా విల్లు దొంగలించితేవడం. క్రొత్త విల్లు మళ్ళీ పెట్టడం. ఆ తర్వాత రాజాగారు కన్ను మూసిందాకా ముక్కు మూసుకోని కూర్చోవడం. వారు పోయాక వచ్చి ఆస్తిలోవాటా తీసుకొని అనుకున్న ప్రకారం అందులో సగం నాకివ్వడం." అన్నాడు ప్రసాద్.

"ఆ వీలునామా దొంగిలించడం. ఎలా ?"

"దొంగతనాల్లో ఆరితేరిన మీ రిద్దరూ ఆలోచించుకోవల్సిన విషయం అది." అన్నాడ ప్రసాద్ నవ్వుతూ.

"మాగురించి నీకు చాలాతెలుసుననుకుంటాను" అందిరోజా.

"తెలుసకోవడం నావిధి, వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టి తెలుసుకున్నాను నీ గత చరిత్ర, నువ్వెంత మందికి, ఏయే ధరలకు అమ్ముడుపోయింది కూడా నా దగ్గర లిస్టుంది. చూస్తావా?"

"అవసరంలేదు!"

"నన్ను మోసం చేసేందుకు ప్రయత్నించారంటే మిమ్మల్ని అర నిముషంలో పోలీసులచేత అరదండాలు వేయించి, జైలుకు పంపించగలను. మరచిపోకండి!" హెచ్చరించాడు ప్రసాద్.

"ఆ విషయము వదిలేసి అసలు సంగతి చెప్పు. ఆ విల్లు ఏ బ్యాంకులో వుంది?" అడిగింది రోజా.

వివరంగా చెప్పాడు ప్రసాద్. వింటూ తలూపింది.

"దాన్ని దొంగిలించడం అంత తేలికగాదు. మరేదైనా పథకం ఆలోచించలేవూ?"

"ఆరేళ్లనుంచి ఆలోచిస్తూనే వున్నాను. ఇంతకుమించి మరో మార్గం కనుపించలేదు. మీారు సాధించలేనిదిగాదు. పట్టుదల విడవకుండా, ఎవ్వరికీ పట్టుబడకుండా సాధించగల రన్న నమ్మకం నాకుంది.. అది మీ చేతుల్లోకిరాగానే నాకు ఫోన్ చెయ్యండి. తర్వాత కార్యక్రమం నిర్ణయిస్తాను." అంటూ లేచాడు.

రోజా కదలకుండా కూర్చుంది.

ప్రసాద్ వెళ్లిపోయాడు వెలుపలకు.

వాసు లోనికొచ్చాడు.రోజాను వెతుక్కుంటూ వెళ్లి ప్రక్కనే కూర్చున్నాడు. "ఏమంటాడువాడు?" అడిగాడు కోపంగా.

"మర్యాదగా మాట్లాడటం నేర్చుకో!" అంటూ ప్రసాద్ చెప్పిందంతా చెప్పింది.

"కత్తుల బోనులోకి మనల్నిదింపి, తమాషా చూద్దామను కున్నాడులావుంది. అది అసాధ్యం" అన్నాడు.

"ఊరకే వస్తుందా డబ్బు. కష్టపడాలి. సాహసంచెయ్యాలి."

"నాకా డబ్బు అవసరంలేదు."

"అయితే మళ్లీ మా అమ్మ నిన్ను గుమ్మంపైన కాలు పెట్టనీవ్వదు. జాగ్రత్త!" అంది రోజా నవ్వుతూ.

"అవునవును." అంటు ఆలోచనలో పడ్డాడు.

బ్యాంక్‌లో లాకర్లకు రెండు తాళాలుంటాయి. ఒకటి లాకర్ అద్దెకు పుచ్చుకున్న మనిషి దగ్గర మరొకటి, బ్యాంక్ వాళ్ల దగ్గర వుంటాయి. తెరవదలచుకొన్నప్పుడల్లా ఆ రెండు తాళాల్ని ఉపయోగించాలి. ఏ ఒక్కదానితో ప్రయత్నించినా ప్రయోజనముండదు.

రాజాగారు తాళంచెవి మొలలో కట్టుకున్నారో, లేక మెడకు వ్రేలాడ వేసుకున్నారో తేలీదు. బ్యాంక్ వాళ్ల తాళాలు ఎక్కడ దాస్తారో తెలుసుకోవాలి. ఆ తర్వాతే ఒక పథకం ఆలోచించ గలిగేదని రోజాకు తెలుసు. అంతా ఆలోచించి, ఇలా చేసుకు రమ్మని పంపితే, వెనుకా ముందు చూడకుండా, లంకలో దూకిన హనుమంతుడిలా, రంగంలో దిగుతాడు వాసు.

"ఇవాల్టినుంచి రోజూ బ్యాంకుకువెళ్లి. ఏదోకనున్నవాడిలా అటు ఇటు తిరుగుతూ లాకర్లు, తెరచేందుకు తాళాలు ఎవరి దగ్గరనుండి తీసకుంటున్నారో గమనించు." ఆ గుమస్తా అడ్రసు ఏమిటో, అతని బలహీనతలేమో తెల్సుకో. ఆ తర్వాత ఏం చెయ్యవలసింది ఆలోచిస్తాను. ఈ లోగా రాజాగారి వద్దనున్న తాళం తస్కరించే మార్గం ఆలోచిస్తాను. అంది రోజా.

"రోజా! నీతల్లో మొత్తం మెదడు తప్ప మరేంలేదు!"

అన్నాడు వాసు మెచ్చుకోలుగా.

బిల్లిచ్చి ఇద్దరూ వెలుపలకు వచ్చారు.

"నేను బ్యాంక్‌కు పోతాను." అన్నాడు వాసు.

"అలాగే! నేను ఇంటికి పోతాను. ఎక్కడతిరిగినా, రాత్రి ఇంటికొచ్చేయ్!" అంది గోముగా చూస్తూ.

"ఆ ఆశ పెట్టే ఈ అడ్డమైన చాకిరీ చేయిం కొంటున్నావ్!" అంటూ అక్కడ్నుంచి కదలి వెళ్ళాడు.

రోజా కూడా ఆటో ఎక్కి ఇంటి అడ్రసు చెప్పింది. ఇల్లు చేరేసరికి అప్పలమ్మ వాకిట్లోనే నిలిచివుంది, ఆతృతగా.

"ఎక్కడికెళ్ళావే! మంచి బేరాలు రెండొచ్చాయి సమయాని లేకుండాపోయావ్?" అందినొచ్చుకుంటూ.

విసుగ్గా తల్లికేసి చూసింది. అప్పలమ్మ నోరు నొక్కు కుంది. తిన్నగా తన గదిలోకి వెళ్ళి తలుపులు బిడాయించుకొ మంచానికి అడ్డంగా పడుకుంది. శరీరం హాయిగా మత్తులోకి అందులోనుండి మగత నిద్రలోకి తూలి పోయింది.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఎదురుగా ఎవరో తలుపులు దబద బాదుతున్న శబ్దమైంది. లేచి వొళ్ళు విరుచుకుని వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా అప్పలమ్మ నిలుచునివుంది.

"ఎందుకలా బాదుతావ్ తలుపుల్ని?"

"అబ్బాయొచ్చాడు!" అంది వందకాగితం మడచి పట్టు కుంటూ.

"వద్దన్నాగా? పాడుబుద్ధి పోనిచ్చుకున్నావుగాదు!" అంటూ హాల్లోకి చూసింది. ప్రసాద్ కనుపించాడు. కన్నుకొట్టాడు తన్ను తెలిసినట్లు చూడొద్దన్నట్లుగా.

"లోపలకురమ్మను." అంటూ తన గదిలోకి వెళ్ళిం రోజా.

ఆమెవెంటనే ప్రసాద్‌లోనికొచ్చి తలుపులు బిగించాడు.
"ఇలా వచ్చావేం?"
"అర్జంటుగా మాట్లాడాల్సి వచ్చింది."
"ఏమైంది.?"
రాజాగారు మెట్లమీదనుండి క్రిందకు దిగుతూ కాలుజారి
ారు. ఎముక విరిగిందనీ, బెణికిందనీ అన్నారు డాక్టరు .
ల్ వున్నారు. నమ్మకమైన పనిమనిషిని చూడమన్నారు
సేవలు చేసేందుకు. నీకోసం వచ్చాను." అన్నాడు ప్రసాద్
కోసమా? ఎందుకు?"
"నువ్వాయన మేనల్లుడి భార్యవు. ఇది అదనుగావచ్చిదూరు.
నకు వాసు అంటే కోపం. నీ మీదేంలేదు. ముందు
ప్రామ్మంటాడు. కాస్త ప్రాధేయపడ్డావంటే, పనిమనిషిగా
చుకోవటానికి అభ్యంతరం చెప్పడు. ఆ తర్వాత మనపని
భం అవుతుంది." అన్నాడు ప్రసాద్.
"అయితే ఆయన కాలుజారిపడలేదన్నమాట." అందిరోజా.
"అలాగని ఎందుకనుకుంటున్నావ్?"
"ఆ మాత్రం తెలుసుకోలేని దద్దమ్మనుకాను. నువ్వే
శావ్. గుడ్. నువ్వెళ్ళు. నేనోగంటలో వస్తాను." అంది.
"నీకోసం నేను కాచుకుని వుంటాను. వచ్చెయ్యి." అంటూ
ండు ప్రసాద్.

పది రూపాయల నోటు కౌంటర్‌లో ఇచ్చి చిల్లర తీసు
న్నాడు వాసు. వెనక్కి తిరిగివచ్చి విజిటర్స్ కోసం వేసివుం
సోఫాల్లో కూర్చుని, సిగరెట్ వెలిగించాడు.
మూడోనెంబరు కౌంటర్‌పైన పెట్టివున్న ఇంగ్లీషుబోర్డు
వాడు. డ్రాఫ్టులు, సేఫ్టీ లాకర్లు, చూచే కౌంటర్ అదేనని

అర్థం చేసుకున్నాడు. దాని వెనుక అందమైన ఒక అమ్మా
కూర్చునివుంది. ఆమెనే గమనించ సాగాడు.

మాటిమాటికీ గాలికి ఎగురుతున్న వెంట్రుకల్ని సరి
కోవడమో, లేక పైటకొంగు సర్దుకోవడమో, రెండూగాకు
తెరచి పెట్టివున్న హాండ్‌బ్యాగ్‌లోంచి చిన్న అద్దం తీసు
మొహంచూసుకోవడమో చెయ్యసాగిందాఅమ్మాయి.

ఆమెను ఎలా వల్లో వేసుకోవడమాని ఆలోచించసా
వాసు. ఆమె కూడా వాసును గమనించింది. బ్యాంక్
అరగంటకల్లా వచ్చిన మనిషి, ఓపిగ్గా అంతసేపు తన్ను
నిస్తూ ఎందుకలాకూర్చున్నాడో అర్థంగాలేదు. ముందా
దొంగేమోనన్న అనుమానం కలిగింది. అతని బట్టలు, కూర
తీరు, సిగరెట్ తాగే దర్జా, ఆ అనుమానం ఆధార రహి
చేశాయి.

బ్యాంక్‌కు లంచ్ బ్రేక్ అయింది. కొన్ని తలు
మూశారు జనం కొద్దిమంది మాత్రం వున్నారు. వాసు
వెలుపలికి వచ్చాడు. గుమ్మంకేసి చూస్తూ నిలుచున్నాడు.

ఐదు నిముషాల తర్వాత ఆ అమ్మాయి వచ్చింది. క్రీ
వాసును చూసి రోడ్ దాటి ఎదురుగావున్న రెస్టారెంట్
వెళ్లింది.

వాసుకూడా రోడ్ దాటి వెంట వెళ్లాడు. రెస్టారెంట
దూరాడు. స్పెషల్ రూం తలుపు త్రోసుకొని పోతున్న
కనుపించింది. హడావుడిగా అటుకేసివెళ్లి, తను లోనికిదూర

వాసును చూడగానే టక్కునలేచి నిల్చుని "ఎవరునువ్వు
అడిగింది.

"భయపడకు! కూర్చో! నీ అందం చూచి పిచ్చెక్కిపో
చచ్చు సన్యాసిని. ధరణికోట రాజా గజపతిరావుగారి మే

ని. వారి ఆస్తికి ఏకైక వారసుణ్ణి.'' అన్నాడు వాసు.

''నిజంగానా?''

''అబద్ధాలు నిన్నుచూస్తూ చెప్పాలన్నా కష్టమే! కూర్చో!'' మెను పురమాయించి తను కూడా కూలబడ్డాడు వాసు.

ఆమె కూర్చుంది.

''నా వెంట పడ్డారెందుకు?'' అడిగింది

''నేను నిన్నటిదాకా ఫారెన్‌లో వున్నాను. ఇంటికి రాగానే ాటల ప్రస్తావనలో మా మేనేజర్ ప్రసాద్ నీ అందచందాల ంరించి అదే పనిగా వర్ణించడం మొదలు పెట్టాడు. చూడా నిపించింది. వచ్చాను. తప్పా?'' అడిగాడు వాసు.

''కాదు, కానీ ఆ ప్రసాద్ ఎప్పుడూ తలెత్తి కూడా నన్ను రిగ్గా చూసేవాడుకాదు.'' అందామె.

''నీ పేరేమిటి?''

''అరుణ''.

''గుడ్. మంచిపేరు. మనం స్నేహితులుగా వుందాం. నీకు ్యంతరమా?''

''నో నో!''

''అయితే మన స్నేహితానికి ప్రారంభోత్సవ సూచకంగా క తప్పుపని చేద్దాం. దానివల్ల నా రహస్యం నీకూ, నీ రహస్యం ంకూ చిక్కుతుంది. ఒకొర్నొకరం ఆ భయంతోనన్నా అంటి ట్టుకొనివుంటాం. ఏ మంటావ్?''

''మీ మాటలు నా కర్థంగాలేదు.'' అంది అరుణ.

''నేను రాజాగారికి మేనల్లుడిని. అయినా ఏం ప్రయోజనం? యనకు నాపైన అనుమానం. ఒక్కపైసాకూడా ఇవ్వడు. ఖర్చులకు తంటాలు పడుతున్నాను. ఆయనకూడా పెద్ద ్డై పోయాడు. మరో సంవత్సరం బ్రతికితే ఎక్కువ. ఈ

లోపల ఆయన నాకు ఏ విధమైన అన్యాయం చెయ్యకుండ
చూచుకోవాలి. నేను రాకముందే నాకేదైనా అన్యాయం జ
గిందో లేదో తేలీదు. అది తెలుసుకోవాలి నేను. అందుకు నీసాయం
కావాలి!'' అన్నాడు వాసు ఆశగా ఆమె కళ్లలోకి చూస్తూ

"నాసాయమా?'' అడిగింది ఆశ్చర్యంగా.

అవును. ఆయన వీలునామా ఏదోరాసి బ్యాంక్ లాకర్‌లో
పెట్టాడు. ఒక తాళాం ఆయనదగ్గరవుంది. రెండోది నీదగ్
రుంది. నాకా తాళం అరగంటసేపు ఇవ్వు. అలాంటిది చేయి
చుకొని ఇచ్చేస్తాను. రెండోది మామావు దగ్గరుంది. దాన్
సులభంగా తీసుకోగలను.''

"అమ్మో! నాకు భయం.''

"ఉద్యోగం పోతుందనా?''

"ఆఁ!''

"ఈ సాయం చేసినందుకు నీకు యాభై వేలిస్తాను. భవిష
త్తులో డబ్బు చేతికి రాగానే సినిమాలు తియ్యాలని వుంద
అప్పుడు నువ్వు వద్దన్నా హీరోయిన్ వేషం ఇస్తాను'' అన్నాడ
వాసు.

"ఏమైనా నాకు భయంగానేవుంది.''

"నీకు ఏ విధమైన అపాయంగానీ, మాటగానీ రాకుండ
చూసే పూచీనాది. రేపు మధ్యాహ్నం వస్తాను ఇదేటయిముక
తాళం పట్టా. మళ్లీ నువ్వు వేళ్లేలోగా ఇక్కడికిక్కడే ఇచ
స్తాను.'' అన్నాడు వాసు.

అరుణ మాట్లాడలేదు.

"అలా లేకుంటే, నీకిస్తానన్న మొత్తంలో మూరోవంత
ఇచ్చానంటే, నీ మొహాన ఆసిడ్‌పోసి, కురూపిగా చేసేందు
ఇదరు మనుషులు సిద్ధంగా వున్నారు. రేపు మధ్యాహ్న

నువ్విక్కడ నన్ను కలుసుకోకుంటే రేపు రాత్రికి నీ మొహం మారిపోతుందని మాత్రం హామీ ఇస్తున్నాను. వస్తాను!" అంటూ లేచాడు వాసు.

బిక్క చచ్చి కూర్చుంది అరుణ.

అనవసరంగా తను పెద్ద వల్లో చిక్కుకున్నట్లయిందని వాపోయింది. ఏంచెయ్యానూ తోచక అక్కడే కూర్చుండి పోయింది. బేరర్ గుర్తు చేశాక బయలుదేరింది బ్యాంకుకు.

# 5

"ఎవరది?" అడిగారు కళ్ళు మూసుకుని పడుకున్న రాజా గారు.

"నేనండీ! మీ మేనకోడల్ని." అంది రోజా మంచంవారగా మోకాళ్లపైన కూర్చుంటూ.

"ఎందుకొచ్చావ్? ఎవరు రమ్మన్నారు?" అడిగారు కఠి నంగా.

"మీ ఆస్తికోసం మాత్రంకాదు. ప్రసాద్ బజార్లో కను పించి మీకు జరిగిన ప్రమాదం గురించి చెప్పి, నమ్మకంగా పని చెయ్యగల మనిషికోసం వెతుకుతున్నానని చెప్పాడు. అలాంటి మనిషి దొరికిందాకా సాయంగా వుంటానన్నాను. సరేనన్నాడు. వచ్చాను." అంది రోజా.

"ఆ బడుదాయి ఎక్కడున్నాడు?"

"ఎవరు? వాసుగారా? ఉద్యోగం కోసం తిరుగుతున్నాడు."

"వాడికెవరిస్తారు ఉద్యోగం? ఏంచూసివాడ్ని పెళ్లాడావ్? నా ఆస్తిలో వాటావస్తుందని చెప్పి నిన్ను మోసం చేశాడా?" అడిగాడు రాజాగారు.

"మా పెళ్లి జరిగేటప్పటికి, అతనికి, మీతో బంధుత్వం వున్న విషయమే తెలియదు." అంది రోజా.

ఆ తర్వాత సంభాషణ ఆగి పోయింది.

ప్రసాద్ వచ్చి రాజాగారితో కాసేపు మాట్లాడాడు. తర్వాత ఏఏ మందులు ఎలా ఇవ్వవలసిందీ, ఎప్పుడు ఇవ్వ సిందీ వివరించి చెప్పాడు రోజాకు. అంతా విని కాగితంమీ రాసుకుంది గుర్తుకోసం.

ఫ్లాస్కులోవున్న హార్లిక్సు గ్లాసులో పోసి అందించిం రాజాగార్కి. ఆయన మెల్లగాలేచి నడుంక్రింద రెం దిండ్లు పెట్టుకుని మెల్లగా త్రాగి గ్లాసు తిరిగి అందించాడ

"అమ్మాయ్! నాకు నిద్రవస్తున్నట్లుంది! నువ్వుకూ వెళ్లి పడుకోమ్మా!" అన్నాడు రాజాగారు.

"నేను ఇక్కడే వుంటాను. మీకు ఏం కావలసినా 'రోజ అని పిలవండి చాలు పలుకుతాను." అంది.

"పాపం అనవసరంగా నిన్ను శ్రమ పెడుతున్నట్లున్నాన నీ ఋణం ఏలా తీర్చుకుంటానో ఏమో?" అంటూ సర కుని పడుకున్నాడు రాజాగారు.

రోజా అక్కడ్నుంచి కదలి హాల్లోకి వెళ్లింది. ప్రసా కూర్చుని వున్నాడు సిగరెట్ త్రాగుతూ. వెళ్లి ఎదురు కూర్చుంది.

"నేను చెయ్యగలిగింది చేశాను. ఇక మొత్తం మీ చేతుల వుంది. తెలివిగా, సుళువుగా కార్యం సాధించాలి." అన్నాడు.

రోజా నవ్వింది.

"ఎందుకలా నవ్వుతావ్?" అడిగాడు ప్రసాద్.

"ప్రమాదంతో కూడిన పనులు మా నెత్తిన వేశా తమాషా చూస్తూ కూర్చున్నావ్." అంది.

"వాటాకోసంవచ్చింది మీరు. మీతో చెయ్యికలపకున నాకు రావలసిందీ, కావాలసిందీ, నేను సంపాదించు కోగలను.

"ఎలా?"

"రాజాగారి వ్యవహారాలు మొత్తం నేనే చూస్తున్నాను లెక్కలు తారుమారుచేసినా కనుక్కునే వీరుడులేడు. అయినా. మీకు సాయంచేద్దామన్న ఉద్దేశ్యంతోనే ఇంత సాహసం చేస్తు న్నాను. వాసు ఏమయినాడు? అతని ప్రయత్నాలు ఎంతదూరం వచ్చాయి?"

"ఏమో? ప్రొద్దుట్నుంచి తిరుగుతున్నాడు. నాకు కలవ లేదు!" అని రోజా అంటూండగా వాసు వచ్చాడు గదిలోకి.

"నూరేళ్లాయుస్సు నీకు రా! కూర్చో!" అన్నాడు ప్రసాద్.

వాసు వచ్చి రోజా ప్రక్కనే కూర్చున్నాడు.

"ఏమిటి? ఇద్దరూ తీవ్రంగా ఆలోచిస్తున్నారు?" అడి గాడు వాసు.

"నీపని ఎందాకా వచ్చింది?" అడిగింది రోజా.

బ్యాంక్‌లో పనిచేసే అమ్మాయిని ఎలా కలుసుకుందీ, బెద రించిందీ చెప్పి, రాజాగారి తాళం తాలూకు నమూనా అచ్చు వేసివున్న పారఫిన్ కేక్ చూపించాడు. ప్రసాద్, రోజా దాన్ని చూసి ఆనందించారు.

"రెండో తాళం రాజాగారివద్దవుంది. దాన్నికూడా సంపా దించండి."

"అందుకే రోజాను వారి సేవలకు నియోగించాను. తాళాలు ఆయన తలగడ క్రింద వున్నాయి. మత్తుగా నిద్రపట్టేందుకు మందులో రెండు గార్డెనాల్ మాత్రలు వేసి ఇచ్చాం. ఇంకా కాసేపటికి బాగా నిద్ర పోతాడు. అప్పుడు రోజా వెళ్లి తాళం తీసుకుంటుంది. దానిప్రింటు కూడా తీసుకొని, తిరిగి యధా ప్రకారం వారి తలగడక్రింద పెట్టేద్దాం!" అన్నాడుప్రసాద్.

ఆ ఐడియా అందరికీ నచ్చింది.

తాళాలు రెండూ చేతికి చిక్కినంత మూలాన, బ్యాంక్‌లాకర్ తెరచినట్లు కాదు. రాత్రిపూట తలుపులు పగులగొట్టి బ్యాంక్‌లో దూరడం అసంభవం. దానికి చాలా కట్టుదిట్టమైన కాపలా ఏర్పాట్లున్నాయి. పగలు పనిచేసే టప్పుడే ఎలాగో తంటాలు పడి పని పూర్తి చేసుకోవాలనుకున్నాడు వాసు. దానికి అతనో ప్లాను ఆలోచించాడు. తన పేరుమీద ఒక లాకర్‌నుతీసుకొని రోజూ దాన్ని తీసేందుకుఏదో ఒకమిషతో అక్కడికి వెళ్ల దలచుకున్నాడు. సమయం చూసి తనదానికి బదులు రాజాగారి లాకరు ఓపెన్‌చేసి, అందులో వున్న వీలునామా దొంగిలించి తేవడంకన్నా మరో సులభమైన మార్గం తోచలేదు. తన ప్లాను పూర్తిగా చెప్పాడు రోజాకూ, ప్రసాద్‌కు.

విని బావుందని తలూపారు.

లాకర్ తీసుకోవాలంటే, అందులో దాచేందుకు విలువైన నగలో, కాగితాలో, డబ్బులో, ఏవైనా వుండాలని అందరికీ తెలుసు. అందులో ఏం దాచడమని కొంతసేపు తర్కించు కున్నారు. చివరకు ప్రసాద్ రెండు నెక్లెస్‌లు ఇచ్చేందుకు ఒప్పుకున్నాడు.

అందరికీ ఆనందంగావుంది. తాము వేసుకున్న పథకం సులభంగా నేరవేరుతున్నందుకు సంతోషం పట్టశక్యంగాకుండా పోయింది.

"మీ వాటా తో మీరేం చేద్దామనుకుంటున్నారు?" అడిగాడు ప్రసాద్.

"పెద్ద సినిమా కంపెనీ పెట్టి, ఈస్ట్‌మెన్‌కలర్ చిత్రాలు తీద్దామనుకుంటున్నాం. నువ్వేంచేస్తావ్!" అడిగాడు వాసు.

"నువ్వుతీసే సినిమాలుచూస్తూ కూర్చుంటాను." అన్నాడు గంటపదయినట్లు హాల్లోవున్న గోడగడియారం గంటలు

కొట్టింది. రోజా లేచి రాజాగారిగదివేపు వెళ్లిపోయింది. ప్రసాద్‌కూడా ఆఫీసుగది వేపునడచాడు.

వాళ్లు అటు వెళ్లగానే వాసు, జేబులోంచి క్వార్టరు బాటిల్ తీసి, మూతిని, నోటికి తగిలించి, గడగడ త్రాగి, సీసా మూలలకు విసిరేశాడు. సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు.

ప్రసాద్ తిరిగొచ్చి కూర్చున్నాడు. అతని చేతిలో కొన్ని కాగితాలున్నాయి. రోజాకూడా వచ్చింది.

"తాళాలు తెచ్చారా?" అడిగాడు వాసు.

"ఆఁ! గుత్తి మొత్తం తెచ్చాను. బ్యాంక్ తాళం ఏదో చూచుకోండి!" అంటూ అక్కడ పెట్టింది. ప్రసాద్ చకచక వెతికి, ఒకదాన్ని పట్టుకొని వాసుకి చూపిస్తూ "ఇదే" నన్నాడు.

వాసు దాని ప్రింటుకూడా తీసుకొని, తిరిగి ఇచ్చేశాడు. రోజా తాళాలగుత్తి తీసుకుని పరుగెత్తుతూ వెళ్లి పోయింది లోనికి. గుమ్మంలో కడుగు బెట్టగానే నైట్‌లైట్ వెలుగులో మంచంమధ్య కూర్చున్న రాజాగారు కనుపించారు. చూచి భయభ్రాంతురాలై స్థాణువులా నిలుచుంది.

"రోజా! నీకెవరైనా దొంగ ఎదురొచ్చాడా?" అడిగాడు.

"లేదండీ!" అంది.

"వాడెవడో గదిలోకి వచ్చాడు. నా తలక్రింద తాళాలు తీశాడు. ఎంత తంటాలుపడ్డా ఒకరాగాన కళ్లు తెరవలేక పోయాను. తీరా తెరచి చూసే సరికి అతను కనుపించలేదు."

"దొంగకాదు వచ్చింది. నేనే. ఇవిగో తాళాలు." అంది రోజా.

"నువ్వెందుకు తీశావ్?"

"తోట మాలి మూర్ఛవచ్చి పడిపోయాడు. వాడిచేతుల్లో పెట్టేందుకు తాళాలు తెమ్మన్నాడు ప్రసాద్. మీతలగడ క్రింద వుంటాయని అతనే చెప్పాడు. వచ్చి హడావుడిగా తీసు

కెళ్ళాను.'' అంది.

''అంతేనా! హడలి పోయాను. వాడి కెలావుంది.?''

''బాగానేవుంది.'' అంటూ దగ్గరగా వెళ్ళి తాళాలు యథా ప్రకారం రాజాగారి తలగడ క్రింద పెట్టేసింది.

''నువ్వెళ్ళి పడుకోమ్మా!'' అంటూ ఆయన కూడా నడుం వాల్చాడు.

తిరిగొచ్చి రోజా జరిగింది చెప్పింది. ఆమె సమయస్ఫూర్తికి, తెలివికీ, ప్రసాద్ ఆశ్చర్య పోయాడు. తన దగ్గరున్నకాగితాల్ని అందించి, సంతకం చెయ్యమన్నాడు.

వాసు కదిలి ''మాటమీద నమ్మకంలేదా?'' అడిగాడు.

''మాట ఇచ్చిన వాళ్ళకు, సంతకం చేసేందుకు అభ్యంతర మేమిటి?'' అడిగాడు ప్రసాద్.

మారు మాట్లాడకుండా సంతకం చేసి ఇచ్చారు కాగితాలు వాసు, రోజా. అవితీసుకొని జేబులో పెట్టుకొన్నాడు. ప్యాంట్ జేబులోంచి రెండు నెక్లెసులుతీసి అందించాడు. అందుకొని జేబులో పెట్టుకున్నాడు వాసు.

''రేపు రాత్రికి క్రొత్త వీలునామా తయారు చేయిస్తాను. ఎల్లుండి నీ దగ్గరిస్తాను. దాన్ని తీసుకొని వెళ్ళి లాకర్ తెరచి పాతది తీసుకుని క్రొత్తది అందులో పెట్టెయ్యి.'' అన్నాడు ప్రసాద్.

''అలాగే!'' అంటూ వాసు లేచాడు.

రోజా కూర్చునేవుండిపోయింది. ప్రసాద్ తనగది కేసి వెళ్ళి పోయాడు.

# 6

అనుకున్న ప్రకారం, దొంగ వీలునామా తయారుచేసి, రాజాగారి సంతకంతోపాటు, వకీలు, డాక్టరు, సాకుల సంతకాలుకూడా

ఫోర్జరీ చేయించారు. వాసు దాన్ని తీసికెళ్లి లాకర్ తెరచి పాత వీలునామా స్థానంలో పెట్టాడు. లాకర్ మూసి వచ్చేశాడు

ఇంటికొచ్చి పాత వీలునామా పూర్తిగా చదివాక మతి పోయింది. అందులో ప్రసాద్‌కు రెండు లక్షల రూపాయల దోశం ముట్టాలని రాజాగారు వ్రాశారు. బహుశా ఆ విషయం అతనికి తెలిసి వుండదనుకున్నారు. రోజాకు ఆనందంగావుంది.

పాతిక లక్షలు.

అంత డబ్బుకు తను అధికారిగావున్న విషయం గుర్తొచ్చి శరీరం మేఘాల్లో తేలసాగింది. యథా ప్రకారం రాజాగారికి సేవలు చెయ్యసాగింది. ఆయనకాలు బాగయింది. తిరగడం మొదలెట్టాడు. రోజా పైన ఆయనకు ప్రేమానురాగాలు ఏర్పడ్డాయి. ఆమెనుగురించయినా వాసుకు కొంత డబ్బు ఇవ్వా లన్న ఆలోచన మొదలయింది.

ప్రసాద్‌ను పిలిచాడు. అతనువచ్చి కూర్చున్నాడు. తన ఆలో చన అతనికి చెప్పి, "నువ్వు మన లాయర్ను, డాక్టరును రేపు రాత్రికి రమ్మనిచెప్పు. ఈ లోగా బ్యాంక్‌కు వెళ్లి లాకర్‌లో నేను ఇంతకు ముందు రాయించి వుంచిన వీలునామా తీసు కురా. ఉదయం దాని తాళం, మేనేజర్‌కు ఉత్తరం, రాసిస్తాను. సరేనా?"

ప్రసాద్‌కు చెమ్మటలు క్రమ్మాయి. అనుకోని విపరీతం ఎదురయినందుకు వొణికి పోయాడు.

ఏం మాట్లాడలేక "సరే!" అన్నాడు.

ఆ రాత్రికి ముగ్గురూ క్వాలిటీలో కలిశారు. రాజాగారు చెప్పిందీ, ఆయనేం చేయదలచుకొందీ చెప్పాడు ప్రసాద్.

"విని వాళ్లుకూడా ఆశ్చర్య పోయారు.

"ఇప్పుడేంచేదాం?" అడిగింది రోజా.

"గుట్టుగా ఆ పాత విల్లు ఆయన మొహాన పడేద్దాం! మార్చి ఇచ్చాక, మనకుఅనుకూలంగా, లాభకరంగా వుంటే దాన్ని లాకరులో పెడదాం! లేకుంటే ఫోర్జరీ చేసిందే ఉంచు దాం" అన్నాడు ప్రసాద్.

"పాత విల్లు చించేశాను!" అన్నాడు వాసు.

"నిజంగానా?" అడిగాడు ప్రసాద్.

"ఆఁ! దాంతో పని వుంటుందను కోలేదు!" అన్నాడు వాసు.

"అయితే మన ఆటకట్టే!" నిరాశగా వెనక్కివాలిపోయాడు.

"ప్రసాద్! విల్లు మార్చినంత మాత్రాన మనకువచ్చిందే మీలేదు. ఆయన తదనంతరంగాని మనకు డబ్బురాదు. రాజా గారి ఆరోగ్యం బాగుంది. మరో పదేళ్ళు గట్టిగా బ్రతుకుతాడు. అంతదాకా ఇలా దరిద్రంలో జీవించడం అనవసరం. పైపెచ్చు మన నెత్తిపైకి క్రొత్త ప్రమాదం కూడా వచ్చింది. ఏ గొడవా లేకుండా, వుండాలంటే నాకు ఒకటేమార్గం కనుపిస్తోంది!" అన్నాడు వాసు.

"ఏమిటది?"

"రాజాగార్ని ఈ లోకంనుండి వెంటనే పంపించివెయ్యడం దాంతో ఫోర్జరీ చేసిన వీలునామా ఆయన జూడలేడు. ఆయన చస్తాడు కనుక, ఆస్తి వెంటనే మనచేతికొస్తుంది."

"ప్లాను చాలా బాగుంది!" అంది రోజా.

"అయితే ఆలస్యం ఎందుకు అమలు జరపండి!" అన్నాడు ప్రసాద్.

"నాన్సెన్స్! ఇంతదాకా అంతా నేనే చేశాను. ఈపని నువ్వు చెయ్యాలి. మా కొచ్చే వాటాలో సగం తీసుకునేవాడివి నువ్వు నువ్వూ కొంత రిస్కు తీసుకోవడం న్యాయం, అవసరం!" అన్నాడు వాసు.

# సప్లిమెంట్ పోటీ-8

11,12,13,14,15 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రిందీ గళ్ళలో పూరించండి, మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జతపరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనవచ్చును.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు జులై 75 నెల మాస పత్రికలో చూడండి.

## ముఖచిత్ర వాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖ చిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేది లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చు.

మాకు వచ్చినవ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20/- లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్‌డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులు కానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాస పత్రికలో ప్రచురించ బడతాయి.

—ఎడిటర్.

"రాజాగార్ని నేను హత్య చెయ్యడమా?" ఆశ్చర్య పోత
అడిగాడు ప్రసాద్.

"ఆఁ! నువ్వే హత్యచెయ్యాలి. అలా చెయ్యకుంటే ను
వీలునామా ఎలా ఫోర్జరీచేయించింది, మమ్మల్ని ఎలా మ
పెట్టిందీ, కోర్టులో ఇద్దరం బోనెక్కి సాక్ష్యం చెపుత
అప్పుడు నీకు 'యావజ్జన్మ కైదు తప్పదు. అది తప్పిం
కోనేందుకు నీ కున్న మార్గ మల్లా మేము చెప్పి నట్లు చెయ
డమే! ఆలోచించు." అన్నాడు వాసు.

రోజా కళ్లు ఆనందంతో మెరిశాయి.

"రాజాగార్ని హత్యచెయ్యడం అసాధ్యం. ఒకవేళ చేసి
ముందు నన్నే అనుమానిస్తారు?" అన్నాడు ప్రసాద్.

"ఎందుకు?"

"ఆయనకు దగ్గరగా వుండేది నేను కాబట్టి."

"అంతమాత్రాన ఎవ్వరూ అనుమానించరు. అదే మే
చేస్తే, ఆస్తిలో వాటా మాకు వస్తుందిగాబట్టి, దానికోస
మేము ఆయన్ను హత్య చేశామనుకుంటారు. రేపు మధ్యాహ్న
లోగా ఆయన్ను నువ్వే చంపాలి. అలాచంపలేకుంటే ?
నష్టం."

ప్రసాద్ మవునంగా కూర్చున్నాడు.

తను ఎంతో తెలివిగా పథకం వేశాననుకున్నాడు. చివర
వాసు, తన పథకం అడ్డుపెట్టి తననే బలిపశువుగా మారుసు
న్నాడు. అతని చరిత్ర తెలిసికోక తను అజాగ్రత్తగా వుండట
తప్పయిపోయిందని చింతించాడు. పాత వీలునామా తనుముం
జాగ్రత్తపడి చేజిక్కించుకొనివుంటే, వాళ్ళు తన్ను ఇ
బెదరించడానికి అవకాశం లేకపోయేది. ఏ విధమైన అనుమా

ఎవ్వరికీ రాకుండా, లేకుండా, పని జరిగిపోయేది. అక్కడే తను పొరపాటు పడ్డట్టు అర్థమయింది.

"ఆలోచించి ప్రయోజనంలేదు. నేనూ, రోజా ఈ రాత్రి నుండి రేపు మధ్యాహ్నందాకా ఈ వూర్లో వుండకుండా పోద మనుకున్నాం. బలమైన సాక్ష్యం ఏర్పాటు చేసు కుంటాం. ఈ లోగా నువ్వు పని పూర్తి చేసుకో. రేపు సాయంత్రానికి వస్తాం ఇక్కడకు. ఆ తర్వాత కలుసు కుందాం!" అన్నాడు వాసు.

"ఏం చెయ్యాలో చెప్పారు. బాగుంది. ఎలా చెయ్యాలో కూడా చెప్పండి." అడిగాడు ప్రసాద్.

"ఆ మాత్రం తెలీని అమాయకుడివిగావు నువ్వు. అంది" రోజా.

"ఇంతకుముందు మీకు నేను సలహా చెప్పాను. ఇప్పుడు మీరు నాకు చెప్పండి." అడిగాడు మళ్లీ ఆవేదనతో

"అయితే ఒక పనిచెయ్యి. రాజాగారు మత్తుగా నిద్ర పోయేందుకు వీలుగా స్లీపింగ్ టాబ్‌లెట్స్ రెండు ఎక్కువగా వేసిఇవ్వు మందులో. ఆ తర్వాత రివాల్వరుతో కాల్చి చంపెయ్యి. ఆయన బెడ్‌రూం కిటికీ తలుపులు తెరచిపెట్టు. ఆ గదిలోవున్న సామాన్లు చెల్లా చెదురు చేసివుంచు. ఎవరో దొంగలే హత్య చేసుంటారని అనుకుంటారు." అన్నాడు వాసు.

"ప్లాను బాగుంది. కానీ రివాల్వరు నాదగ్గర లేదు!"

"నాదగ్గరుంది. ఇస్తాను. తీసుకెళ్లు."

"థాంక్స్. రాత్రికి రోజా వస్తుందా, రాదా?"

"రాదు!"

"అయితే రివాల్వరు ఇక్కడేవుంచిపొండి. నేను ఏదో టయిములో వచ్చి తీసుకొంటాను. అప్పలమ్మ ఎటూ వుంటుందిగా?"

"ఆఁ! వుంటుంది." అందిరోజా.

"అయితే నేను వస్తాను." అన్నాడు ప్రసాద్.

"మేము ప్రయాణమై పోవాలి!" అంటూ లేచారు ఇద్దరు.

# 7

"ఏమిటి అర్జంటుగా రమ్మన్నారు?" వచ్చి కూర్చుంటూ అడిగారు సిటీ బ్యాంక్ ఏజెంట్ కులకర్ణి.

"నేనే రావాలనుకున్నాను. కానీ ఒంట్లో ఓపిక లేకపోయింది అందుకే ఫోన్‌చేశాను. మీ బ్యాంక్‌లో నా లాకర్ వుంది గుర్తుందిగా!"

"ఆఁ! ఆఁ!"

"దాన్ని తెరచేందుకు ఉపయోగించే రెండు తాళం చెవుల్లో ఒకటి నా దగ్గరుంది. రెండోది మీ దగ్గరుంది. ఇందాకా తాళాలు చూస్తుంటే చేతికేదో మైనంలా అంటుకుంది. గమనించి చూశాను. ఆ లాకర్ తాళం నిండా మైనంవుంది." అన్నాడు రాజాగారు.

"అలాగా? ఎవరు పూశారు?"

"పూయటంకాదు! ఎవరో నా లాకర్ దొంగతనంగా తెరవాలని ప్రయత్నం చేస్తున్నట్లుంది. అందుకే తాళం నమూనా మైనంలో తీసుకున్నారు. అలాంటి తాళం చేయించడం పెద్ద పనికాదు." అన్నాడు రాజాగారు.

"దాంతో ఏమవుతుంది? రెండో తాళం బ్యాంక్‌లో వుందిగా." అడిగాడు కులకర్ణి.

అందుకే మిమ్మల్ని రమ్మంది. ఆ తాళం ఈ పాటికి దొంగిలించడమో లేక ఇంకాదాని నమూనాను మైనంలో తీసుకోవడమో జరిగి వుండాలి.

"ఇంపాజిబుల్. నా దగ్గర పని చేసే వాళ్లు చాలా నమ్మకస్తులు. అలాంటిది జరగడం అసంభవం." అన్నాడు కులకర్ణి.

"మంచిదే! కానీ మీరు జాగ్రత్తగావుంటారని చెప్తున్నాను. మీరు వెళ్లగానే ఆ తాళం తెప్పించి చూడండి. మీరేం గమనించింది దయచేసి డిటెక్టివ్ సుధాకర్‌కు ఫోన్‌చేసిచెప్పండి. ఈ గొడవంతా ఆయనకు అప్పగించాను. తర్వాత రేపు మా మేనేజర్ ప్రసాద్ బ్యాంక్‌కు వస్తాడు. లాకర్‌లోంచి నేను దాచి వుంచిన వీలునామా తెమ్మన్నాను. లాకర్ తెరచేప్పుడు, దయ చేసి మీరు అక్కడే వుండండి." అన్నాడు రాజా.

"అలాగే! మీరు నిశ్చింతంగా వుండండి. వస్తాను." అంటూ లేచాడు కులకర్ణి.

ఆయన వెళ్లిపోయాక రాజాగారు ఆలోచిస్తూ కూర్చున్నారు. అతనికి ఆ రోజా రాత్రి రోజా చెప్పిన తోటమాలి మూర్ఛ విషయం, వాడి కిచ్చేందుకు తను తాళాలు పట్టుకు వెళ్లడం గుర్తొచ్చింది.

చేతి కర్ర సాయంతో క్రిందకుదిగి, తోటమాలి గుడిసె కేసి నడిచాడు. మొక్కలకు పాదులుచేస్తున్న మాలి రాజాగార్ని చూసి పరుగెత్తుకొచ్చాడు. మూర్ఛ విషయం అడిగాడు. వాడు నవ్వి తనకుగాదు సరికదా, తన వంశంలో ఏడుతరాలు అటూ ఇటూ కూడ అలాంటి రోగం లేదని చెప్పాడు.

విని విస్తుపోయాడు. మెల్లగా లోనికొచ్చి హాల్లో కూర్చు న్నారు. వాసువాటాఅడిగిన ఇరవై నాలుగు గంటల్లో తనుకూడ మెట్లపైనుండి జారిపడటం, రోజా సేవలు చేసేందుకురావడం లాకర్‌తాళం దొంగలించడం, వాటికయి అవే జరిగిన సంఘట నలుగాతోచలేదు.

ప్రసాద్‌లోనికొచ్చాడు. రాజాగార్ని హాల్లో చూడగానే మతి పోయింది.

"రావోయ్! రా!" అన్నాడు.

ప్రసాద్ వచ్చి దగ్గరగా నిలబడ్డాడు.

"లాయరుగార్కి, డాక్టరుకు రేపు రమ్మని చెప్పావా?" అడిగాడు రాజాగారు.

"ఇద్దరూ ఊళ్ళో లేరటండీ. లాయరుగారు రావడానికి వారం పడుతుందట. డాక్టరుగార్కి రేపు రాను వీలుకాదట. ఏదో అర్జంటు ఆపరేషనుందన్నారు. అయినా అంత అర్జంటు విషయం కాదుగా. లాయరుగారు వచ్చాకే చూద్దాం." అన్నాడు ప్రసాద్.

"అనుకొన్నదేదీ అనుకొన్నట్లు జరగనంటుంది. ఆగొడవలు నేను చూసుకుంటాను. నువ్వు రేపు బ్యాంక్ కివెళ్లి వస్తావుగా, మరచిపోకుండా గుర్తుచెయ్యి." అన్నాడు రాజాగారు.

"అలాగే!" అంటూ ప్రసాద్ లోనికి వెళ్ళిపోయాడు.

రాజాగారు మెట్లెక్కి పైకి వెళ్ళారు.

ఫోన్ తీసి డాక్టరుకు రింగ్ చేశాడు. వెంటనే పలికారు. "రేపు మీరు ఖచ్చితంగా రావాలి. ప్రసాద్ తో ఏదో ఆపరేషన్ వుందన్నరటగా?" అడిగాడు.

"లేదు! అతను నన్ను కలవలేదే!" అన్నారు.

"అలాగా! నేనే పొరపడ్డాననుకుంటాను. రేపు సాయంత్రం నాలుగింటికి రావాలి!". అన్నాడు.

"అలాగే వస్తాను!" అన్నాడు డాక్టరు.

రాజాగారు ఫోన్ పెట్టేశాడు. ప్రసాద్ ఎందుకు తనకు అలా అబద్దం చెప్పాడు. అర్థంగాలేదు. గత వారం దినాలుగా జరిగిన సంఘటనల్లో ప్రసాద్ ప్రమేయం కూడా వుందన్న విషయం రాజాగారికి అర్థమయింది.

లాయరుకు ఫోన్ చేశాడు. ఆయన కూడా డాక్టరు చెప్పినట్లే చెప్పాడు.

తను సేకరించిన వివరాలు సుధాకర్‌కు ఫోన్‌చేసి చెప్పాడు. అంతావిని ధైర్యంగా వుండమని చెప్పాడు. అంతకుముందే తనకు బ్యాంక్‌మేనేజర్ కులకర్ణి ఫోన్‌చేసి చెప్పాడనీ, వాళ్ల దగ్గరున్న లాకర్ తాళంకూడా మైనంలో ముంచినట్లు అను మానంగా వుందని చెప్పాడన్న వైనం తెలియ పరచాడు సుధాకర్.

"నాకు భయంగావుంది ఇక్కడుండాలంటే......" అన్నాడు రాజాగారు.

"మిమ్మల్ని కాపాడేబాధ్యతనాది. కొన్ని పనులున్నాయి, ముగించుకొని వస్తాను" అంటూ ఫోన్ పెట్టేశాడు.

# 8

డిటెక్టివ్ సుధాకర్, వసంతను వెంటబెట్టుకుని కార్లో అరండల్‌పేట కెళ్లి, అరుణ అడ్రసు వెతుక్కుంటూ తిరిగాడు. ఆమె ఇంట్లోనేవుంది.

సుధాకర్, వసంతలనుచూసి భయభ్రాంతురాలైంది.

"ఏంకావాలి?"

"ధరణికోట రాజా గజపతిరావుగారి లాకర్‌తాళం ఎవరి కిచ్చావ్. అది ఇచ్చినందుకు అతను నీకేమిచ్చాడు." అడిగాడు సూటిగా.

"నాకేం తెలీదు. నేను అటువంటి పనులుచేసేదాన్నిగాదు!" అంది.

"ఆ తాళానికున్న మైనంపైన నీ వ్రేలిముద్రలు అచ్చు గుద్దినట్లు పడున్నాయి. కులకర్ణిగారికి తెలిసిపోయింది. నిజం చెప్పావంటే, ఒకహత్యతప్పించిన దానివవుతావ్. ఉద్యోగంలోంచి తీసివెయ్యడంతోబాటు జైలుకు పంపుతానన్నాడు నిన్ను మీ మేనేజర్. కనీసం ఆ రెండోది జరగకుండా చూస్తాను."

అన్నాడు సుధాకర్.

జరిగింది వివరంగా చెప్పింది. అరుణ

"అతనెక్కడుంటాడో చెప్పాడా?"

"లేదు!"

"అతన్ని చూస్తే గుర్తు పట్టగలవా?"

"సులభంగా!"

"ఈ ఫోటో చూచి అతనవునోకాదో చెప్పు." అంటు పాస్‌పోర్ట్ సైజు ఫోటో తీసి చూపించాడు.

"అతనే!" అంది.

"ఇతను పేరుపడ్డ గజదొంగ. మద్రాసులోవుంటాడు ఈ మధ్యనే దిగినట్లున్నాడు. ఇతనిపైన చాలా కేసులున్నాయి. పోలీసులుఇతనికోసంవెతుకుతున్నారు." అన్నాడు సుధాకర్.

"ఈ గొడవలు నాకు తెలీదుసార్!" అంది భయంగా అరుణ.

ఆమెను వెంటబెట్టుకొని కారెక్కారు. కొంతదూరం పోయాక వసంతకు రెండు చిన్నపనులుచెప్పి పురమాయించాడు చిన్నగా తను బ్యాంక్‌కు వెళ్లాడు.

లాకర్ తెరపించాడు. అందులో వుండవలసిన వాటిలో ఏవేవి మాయమయిందీ చూడాలన్న ఉద్దేశ్యంతో. అన్నీ వున్నాయి. వీలునామా సీల్‌చేసిన కవరు తెరచారు. దాన్నిచదివారు. తిరిగి కవర్లో పెట్టి లాకర్లో పడేసి తాళాలు వేయించాడు సుధాకర్.

# 9

వసంత రాజాగారి బంగళాకు వెళ్ళింది. ప్రసాద్‌ను రోజా గురించి అడిగింది. తను రోజాకు ప్రాణ స్నేహితురాలనని

ప్పింది. అతనిద్వారా ఆమె ఇంటి అడ్రసు సంపాదించింది. న్నగా ఆ అడ్రసుకు వెళ్ళింది.

అప్పలమ్మ ఎదురొచ్చి "ఎవరమ్మా!" అడిగింది.

"రోజా ఫ్రెండ్‌ను. చిన్నప్పుడు కలిసి తిరిగాం. బతి ందుకు దారిలేక చస్తున్నాను. ఇక్కడికి రమ్మని రాసింది. చ్చాను. ఎటు పోయింది?" అడిగింది వసంత.

"ఏదో ఊరెళ్ళింది. రేపొస్తుంది. కావాలంటే ఇక్కడుండు. పిల్లను స్వంత కూతురిలా చూసి, వ్యాపారం చేయించి, లోటూ లేకుండా చూశాను. కావాలంటే నీకూ సాయం స్తాను." అంది అప్పలమ్మ.

"ఆ మాటే రాసింది రోజా! అందుకనే వచ్చాను. రేప న్నుంచి ప్రారంభిస్తాను. ఇవాళ కాస్త విశ్రాంతి తీసు ంటాను." అంది వసంత.

"అలాగే!" అంది అప్పలమ్మ మురిసిపోతూ.

వసంత రోజా రూముకు వెళ్ళిపోయింది. తలుపులు వేసుకుని వంతా వెతికింది. రాజాగారు వ్రాసిన వీలునామా, దాంతో టు మద్రాస్‌నుండి వాసుపేరుమీదని రోజాకు వచ్చిన రెండు జీల ఉత్తరం దొరికాయి. ఆ రెండు మడచి జాకెట్టులో చుకుంది.

బాగా చీకటి పడ్డాక అప్పలమ్మను ఏమార్చి వెలుపల టింది. చిన్నగా సుధాకర్ దగ్గరకు వెళ్ళి తను సేకరించిన గితాలు అందించింది. వాట్ని చదివి విస్తుపోయాడు.

"రాజాగారి అసలు మేనల్లుడు, వాసు ముటాకు చిక్కి ందీగా వున్నాడు. చదివావా?" అడిగాడు సుధాకర్.

"ఆఁ! చదివాను."

"వాసు, రోజా మాయమైనారు. అంటే ఈ రాత్రికి

రాజాగార్ని హత్యచేసేందుకు ఏర్పాట్లు చేసివుండాలి. ఆ నేరం తమపైన రాకుండా ఇద్దరూ ఎటో వెళ్లిపోయారు. ఇకపోతే మిగిలింది ప్రసాద్. బహుశా అతన్నే ఇందుకు నియోగించి వుంటారు. మనం అతన్ని వెంటాడితేచాలు. రాజాగార్ని కాపాడిన వాళ్లమవుతాం'' అన్నాడు సుధాకర్.

''కరెక్ట్! లాయరుగారు, డాక్టరుగారు ఊర్లో వున్నా లేరని అతనే అబద్ధాలు చెప్పాడు. వీలునామాలు మార్చిన విషయం అతనికి తెలుసు. ఆ రహస్యం బైటపడకుండా వుండేందుకే అలా చెప్పాడు. పాత వీలునామా దాచి, ప్రసాద్‌ను భయపెట్టి హత్యకు పురికొల్పి వుండాలి వాసు.'' అంది సుధాకర్.

''నీ తెలివి తేటలు అమోఘం!'' అన్నాడు సుధాకర్,

ఇద్దరూ మారు వేషాల్లో వెలుపలికి వెళ్ళారు.

అప్పలమ్మ దగ్గర రివాల్వరు తీసుకొని, బయలు దేరిన ప్రసాద్‌ను సుధాకర్ అనుసరించి బంగళా చేరాడు. రాజాగార్ని వేరేగదిలో పడుకోమని, తను మంచంపైన రెండుదిండ్లు పెట్టి పైన దుప్పటి పరచి వుంచమని, ముందే చెప్పి వుంచాడు సుధాకర్.

రాత్రి పన్నెండు గంటలయింది. ప్రసాద్ గదిలోనుండి వెలుపలకు వచ్చాడు. మెల్లగా మేడ మెట్లెక్కాడు. అతని వెనునే చీకట్లో మరో ఆకారం నీడలా కదలివెళ్ళడం అతడు గమనించలేదు.

రాజాగారి గది తలుపులు తెరచాడు. మంచందగ్గరకువచ్చి రివాల్వరుతో రెండుసార్లు కాల్చాడు.

ఆ గదిలో మెరుపులు మెరిశాయి. ఉరుములు ఉరిమి నట్లు ధన్‌ధన్‌మని శబ్దమైంది.

టక్కున లైటు వెలిగింది.

గాభరాగా వెనక్కి తిరిగాడు. అంతలోనే రివాల్వరు పట్టు కున్న కుడిచెయ్యిపైన బలంగా ఎవరిదో చెయ్యిపడింది. ఎదురుగా ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం కనుపించింది. రాజా గారు వెలుపల్నించి వచ్చాడు.

"సుధాకర్‌గారూ! నా ప్రాణాలు కాపాడారు!" అన్నాడు లోనికొచ్చి రాజాగారు.

"ఇంటి దొంగల్ని ఈశ్వరుడు కూడా పట్టలేడు." ప్రసాద్‌కు డబ్బుపిచ్చి పట్టింది. దాన్ని గజదొంగ వాసు, అతని ప్రియురాలు రోజా తమ స్వార్థంకోసం వాడుకుందామనుకున్నారు. మీ అసలు మేనల్లుడు మద్రాసులో వాసు ముటాచేతిలో వున్నాడు. అతనికాగితాలు దొంగలించి తెచ్చి, మిమ్మల్ని మోసం చేద్దామనుకున్నారు. మీరు కాస్త తెలివిగా వుండడంతోవాళ్ల ప్లాను బ్రద్దలైంది." అన్నాడు సుధాకర్.

"వాసు, రోజా లేమైనారు?"

"వాళ్ల గురించి ప్రతి పోలీస్‌తిరుగు తున్నాడు. ఈ పాటికి రెండు పిట్టలూచిక్కి వుండాలి! లేకున్నా మరో గంటమించదు, వాళ్లను అరెస్టు చేసేందుకు" చెప్పాడు సుధాకర్, ప్రసాద్‌కాళ్లు, చేతులు బందిస్తూ.

– అయిపోయింది –

# ఆమె ఎవరు?

## వసుంధర

నేను దిగులుగా కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాను. నిన్న
సంఘటన ఇంకా నా మనసును దొలుస్తూనే ఉంది. అంతర్జా
తీయ స్మగ్లర్ రామూని ప్రాణాలతో పట్టుకునే అవకాశ
చూస్తూండగానే జారిపోయింది.

అపరాధ పరిశోధన నాకు హాబీ. ఎన్నో పర్యాయాలు ఎన్నో
కేసులలో పోలీసులకు నేను సహాయపడి ఉన్నాను. నాకు లభించి
అనేక విజయాల కారణంగా—వృత్తి రీత్యా నేను డిటెక్టివ్
కానప్పటికీ ప్రజలలో నేను డిటెక్టివ్ రాజుగా పేరు పడ్డాను

స్మగ్లర్ రామూ విషయంలో నేను చాలాకాలంగా ఆసక్తి
చూపిస్తూ వస్తున్నాను. అతగాడివద్ద ఎన్నో రహస్యాలు లా
వలసి ఉన్న కారణంగా పోలీసులతన్ని ప్రాణాలతో పట్టుకోవాల

ద్దేశ్యంతో ఉన్నారు. అందువల్ల ఎన్నో పర్యాయాలు రామూ
మాకీ లభించినా నేనతన్ని విచిత్ర పరిస్థితులలో వదిలిపెట్ట
ుసి వస్తూ ఉండేది.

కానీ నిన్నటి దినం అనుకోకుండా చాలామంచి అవకాశం
్చింది. అజంతా హోటల్‌లో టిఫిన్ చేస్తూండగా నేను
పరిచితమైన కంఠ స్వరాన్ని వినడం జరిగింది. అది రామూ
ని నాకు తెలుసు. అటువైపుగా చూసి మారువేషంలో ఉన్న
మూని గుర్తింప గలిగాను.

ఒకసారి విన్న కంఠస్వరాన్ని నేనో పట్టాన మరచిపోలేను.
 నాకు దేవుడిచ్చిన శక్తి యేమోననిపిస్తుంది. ఆ శక్తితో
్పుడు నేను రామూని గుర్తించడం జరిగాక వెంటనే అక్కడి
ుచి లేచి హోటల్ కౌంటర్ వద్ద నున్న టెలిఫోన్ దగ్గ
ు నడిచాను.

నాకు వెంకట్రావని ఒక స్నేహితుడున్నాడు. ఇటువంటి
స్థితులలో పోలీసులకు ఫోన్ చేయవలసి వచ్చినపుడు నేను
ధారణంగా కోడ్ భాషలో వెంకట్రావ్‌కు ఫోన్ చేస్తాను
ుదవలసిన సమాచారం అతని ద్వారా పోలీసులకు జేరుతుంది.
్పుడు నేను రామూ ఇక్కడ ఉన్న విషయమూ అర్జంటుగా
ీసులు ఇక్కడకు రావలసి ఉంటుందన్న విషయమూ వెంకట్రా
ు ఫోన్‌చేసి చెప్పాను. ఆ తర్వాతనుంచి రామూని ఓ కంట
పెడుతున్నాను. రామూ అప్పటికి ఓవల్టిన్ తాగుతున్నాడు.

పాపం, రామూ ఓవల్టిన్ చాలాసేపే తాగాడు. అతనికి మరి
ోటల్‌తో పని ముగిసినట్లుంది. తన స్నేహితుడితో పాటు
ుటర్ దాకా నడిచి వచ్చాడు. బిల్లు తనే ఇచ్చాడు. బయటకు
వటోతున్నాడు. నాకు కంగారు పట్టుకుంది. పోలీసులు
్న్న జాడలేదు. రామూని పట్టుకోడానికి ఇంతకుమించిన

అపూర్వావకాశం మళ్ళీ రాకపోవచ్చు. తన నెవరూ గుర్తుపట
ఉండరన్న ధీమాలో ఉన్నట్లున్నాడు రాము.

నేను హడావుడిగా వెళ్ళి హోటల్ గుమ్మం దగ్గర రాము
అటకాయించి — "హలో కామేశ్వరరావ్ - ఎన్నాళ్లయిం
వూరొచ్చి?"— అంటూ పలకరించాను. రాము స్నేహితు
రామూని కామేశ్వరరావ్ అని పిలవడం నేను విని ఉన్నాను.

రాము ముఖంలో ఆశ్చర్యం కనబడింది. అతను నావంక
అదోలా చూసి—"సారీ—మీరెవరో నేను గుర్తుపట్ట లేకుండ
ఉన్నాను—"అన్నాడు.

నేను నవ్వి—"అదేమిటోయ్—గుర్తు పట్టలేకపోవడానికి
మన్నా మారు వేషంలో ఉన్నానా? నేను—రాజాని. అంతా న
డిటెక్టివ్‌రాజా అని కూడా అంటారు—" అన్నాను. అదే స
యంలో దూరంగా వస్తున్న పోలీస్‌వాన్ నాకళ్లబడింది.

రాము నన్ను గుర్తు పట్టినట్లున్నాడు. పోలీస్ వాన్‌కూ
అతన్ని కళ్ల బడ్డట్టుంది. మాట్లాడకుండా అతను వెన
తిరిగి త్వరత్వరగా హోటల్‌లోకి అడుగులు వేశాడు.

సరిగ్గా అప్పుడే పోలీస్‌వాన్ హోటల్‌ముందు ఆగిం
ఇన్‌స్పెక్టర్ స్వామి నా దగ్గరకు వచ్చి విష్ చేశాడు. అప్పు
రాము స్నేహితుడి చేయి నా చేతిలో ఉంది. నేను హ
వుడిగా ఇన్‌స్పెక్టర్‌తో—"ఇతను స్మగ్లర్ రాము స్నేహితు
హడావుడిగా అలాపోతున్న అతనే స్మగ్లర్ రాము—"అన్నా
అని నేను ముందుకు కదిలాను. అనుకోకుండా కలిసివచ్చిన
అవకాశంతో రాము స్మగ్లింగ్ నేరానికి స్వస్తి వాచకం పలికి
లని నాకు చాలా కోరికగా ఉంది.

రాము హోటల్ మొదటి అంతస్తుకు మెట్లు

ెడుతున్నాడు. నేనూ వెళ్ళాను. రామూ పరుగెత్తాడు. నేనూ రుగెత్తాను. సరిగ్గా పదిహేను మెట్లయినా ఎక్కానోలేదో నాకు విపరీతంగా కళ్ళు తిరగడం మొదలైంది. నేనింక అడుగు ముందుకు వెయ్యలేక పోయాను. అందిన ఊతాన్ని పట్టుకొని ొద్ది క్షణాల పాటు అలాగే ఉండిపోయాను.

నిజానికి రామూ నాకు చేతివాటు దూరంనుండి తప్పించు న్నాడు. అతనివంటి సమర్థుడికి ఇప్పుడు నేనిచ్చినంత సమ యం చాలా ఎక్కువ. అయినా ఆశ చావక నేను నెమ్మదిగా ెట్లు ఎక్కి పై అంతస్తుకు వెళ్ళాను. రామూ ఇంకా పైకే ెళ్ళంటాడని నాకు తెలుసు. అందుకే నేను కాస్త నెమ్మదిగా యినప్పటికీ మూడంతస్థులు దాటి భవనం పై భాగానికి చేరు న్నాను. అక్కడ రామూ ఉన్నాడు. అతను తప్పించుకునే ార్గం కోసం అన్వేషిస్తున్నట్టున్నాడు. బహుశా ఈ పాటికి వనం చుట్టూ పోలీసులు కాపలాకాసి ఉంటారు.

రామూ నన్ను చూశాడు. "మిస్టర్ రామూ—మర్యాదగా ొంగిపో—" అన్నాన్నేను.

రామూ అదోలానవ్వి—"ఇంతసులభంగా గుర్తించ బడతానని నెన్నడూ అనుకోలేదు. కానీ నన్ను పట్టుకోవడం నీ వల్ల ాదు—" అంటూ నాలుగడుగులు వెనక్కి వేశాడు. రామూ ం చేయబోతున్నాడో నాకు తెలిసింది. కానీ అతన్ని నేను పలేను. అతనికీ, భవంతిఅంచుకూ ఉన్న దూరంకంటె ాకూ, అతనికీ మధ్యనున్న దూరం చాలా ఎక్కువ.

అనుకున్న విధంగా అతని స్మగ్లింగ్ జీవితంతోపాటు అను ని విధంగా అతని జీవితానికి కూడా స్వస్తి వాచకం పలికించ ం కేవలం నాకారణంగా నిన్నటి దినం జరిగింది .

రామూ వెనుక నా బదులు మరెవరైనా పడి ఉంటే—

బహుశా రామూ ప్రాణాలతో పట్టుబడి ఉండేవాడేమో? నే నెంతో విచారంగా ఉన్న విషయం గమనించిన ఇన్‌స్పెక్టర్ స్వామి నా భుజంతట్టి—"విచారించకు మిస్టర్ రాజా! దేశానికి చీడపురుగులా పట్టిన ఒక స్మగ్లర్ నాశనం కావడానికి సహక రించావు. వాడిని ప్రాణాలతో పట్టుకోలేక పోయినందుకు విచారించవలసిన అవసరంలేదు—" అన్నాడు.

కానీ నా బాధ వేరు. రామూని అంతం చేసే అవకాశాలు ఇదివరలో కూడా ఒకటి రెండు పర్యాయాలు నాకు లభించాయి. అతన్ని ప్రాణాలతో పట్టుకు తీరాలన్నదే నా ఆశయం. అది ఈ రోజు చేతివాటు దూరంలో తప్పిపోయింది.

అవును—నిజంగా చేతివాటు దూరమే! అంతే దూరంలో అతనుండగా నాకు కళ్ళు తిరిగాయి. రామూ తప్పించుకున్నా డన్న వ్యధకంటె కూడా ఈ కళ్ళు తిరగడం నాకు చాలా విచారాన్ని కలిగిస్తోంది.

ఇటువంటి జబ్బొకటి నాకున్నదని అంతవరకూ నేను గుర్తించనేలేదు. నిన్నరాత్రి నన్ను నేను పరీక్షించుకున్నాను. వేగంగా మెట్లు ఎక్కితే నాకు కళ్ళు తిరుగుతాయి. అంతేకాదు. సుమారు ఏడెనిమిదడుగుల ఎత్తుమీద నిలబడి కిందకుచూస్తే నాకు కళ్ళు తిరుగుతాయి. ఆ తిరగడం సామాన్యంగాఉండదు. కొద్ది క్షణాలపాటు నాకు స్పృహ తప్పిన పరిస్థితిలాంటిది ఏర్ప డుతుంది. ఈ వివరాలన్నీ నిన్న రాత్రి తొమ్మిది గంటల ప్రాంతాల ఒక పత్రికా విలేఖరికి వివరించి చెప్పాను. రామూ కేసు విషయంలో ఆ విలేఖరి కొన్ని ప్రత్యేక వివరాలు ప్రచు రించాలని నన్ను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాడు. ఆ పేపర్లో ఈ రోజు అప్పుడే ఆ వివరాలన్నీ అచ్చయ్యాయి. అవి చదువు కుంటూంటే నాకు మరింత దిగులు కలుగుతోంది.

# 2

"లోపలకు రావచ్చు"—అన్నాను నేను.

తలుపు తోసుకుని ఒకతను లోనికి వచ్చాడు. ముఖం పరిచితమైనదిగా నాకు తోచలేదు. "నా పేరు శోభనాద్రి—" అన్నాడతను తన్ను తాను పరిచయం చేసుకుంటూ.

"నమస్కారం. కూర్చోండి!" అంటూ అతనికి కుర్చీ చూపించాను.

"స్మగ్లర్ రామూని గుర్తించడంలో మీరు చూపిన ప్రతిభ అసామాన్యం. మిమ్మల్ని అభినందించాలని వచ్చాను—" అన్నాడు శోభనాద్రి.

"చాలా థాంక్స్. కానీ అతగాడిని ప్రాణాలతో గనక పట్టు కోగలిగితే మీ పొగడ్త నాకు నిజమైన ఆనందాన్ని కలిగించి ఉండేది—" అన్నాను మళ్ళీ కాస్త దిగాలుపడి.

అతను అదోలా నవ్వి ఊరుకున్నాడు. నేనే మళ్ళీ అన్నాను—"నా సమర్థత మీద నమ్మకంతో ఇన్‌స్పెక్టర్ స్వామి నన్ను రామూ వెంట పడనిచ్చాడు. తను రామూ స్నేహితుడిని కస్టడీలోకి తీసుకుని భవనం చుట్టూ పకడ్బందీగా కాపలా ఏర్పాట్లు చేస్తూ ఉండిపోయాడు. రామూ దగ్గర ప్రాణం తీసుకునే విష పదార్థాలుకూడా ఏమీ ఉన్నట్లులేవు. అందుకే అతను భవనం మీంచి దూకి ప్రాణాలుతీసుకున్నాడు. అతని వెంట పడ్డప్పుడు కళ్ళుతిరగడం జరగనట్లయితే అతన్ని నేను తప్పక ప్రాణాలతో పట్టుకోగలిగి ఉండేవాడిని".

"అన్ని వివరాలూ నేను పేపర్లో చదివాను. రామూలాంటి వాడిని ప్రాణాలతో పట్టుకోడానికి అది నిజంగా గొప్ప అవకాశం. ఏమైతేనేం రామూ ఇక లేడు. కానీ మీకు ఆ సమయంలో అలాకళ్ళు తిరగడం చాలా ఆశ్చర్యంగాఉంది. అది మీలోని

లోపమా? లేక రాముా వేసిన మంత్రమా?—అన్నది నాకు తెలడంలేదు."

"అది నాలోని లోపమే—" అన్నాను నేను.

శోభనాద్రి లేచి నిలబడ్డాడు— "ఉదాహరణకు ఈ టేబిల్ మీద ఒక కుర్చీపెట్టి దానిమీద మీరు నిలబడి క్రిందకు చూశ రనుకోండి అప్పుడుకూడా మీకు కళ్లుతిరుగుతాయా? పేపర్లో చదివాననుకోండి. అయినా నమ్మలేకుండా ఉన్నాను "

నేనుమౌనంగా అతనివంక చూశాను—"మీరు పేపర్లో చదివినది అక్షరాల నిజం. వేగంగా మెట్లు ఎక్కినా ఏడెనిమిద డుగుల ఎత్తు పైనుంచి క్రిందకు చూసినా నాకు కళ్లు తిరిగి ఇంచుమించు స్పృహతప్పిన స్థితి వస్తుంది. అయితే మీరీ ప్రశ్న ఎందుకడుగుతున్నారో నాకర్థం కాలేదు."

శోభనాద్రి మళ్ళీ కూర్చున్నాడు—"కేవలం కుతూహలం తప్పించి మరే కారణమూలేదు—" అని ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా—"మీవల్ల నాకో సహాయం కావాలి—" అన్నాడు.

"ఎటువంటి సహాయం?"

శోభనాద్రి నవ్వాడు—"కేవలం మీరు తప్ప మరెవ్వరూ పరి ష్కరించలేని సమస్యను పరిష్కరించడంలో సహాయం."

"మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారు"—అన్నాను ఆనందాన్ని దాచడానికి ప్రయత్నిసూ—" ముందు మీ సమస్య విని మీ ప్రశంసకు నేనర్హుడినోకానో తెల్సుకుంటాను."

"నా భార్య ప్రవర్తన ఇటీవల చాలా విచిత్రంగా ఉంటోంది. ఆమె చేష్టలను అర్థం చేసుకోలేక నేను సతమత మవుతు న్నాను—" అని ఆగాడు శోభనాద్రి.

నేను మాట్లాడకుండా అతనివంక చూస్తున్నాను.

శోభనాద్రి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు—"ఆమె పిచ్చిదా

ని అనిపించేలా ఒకసారి ప్రవర్తిస్తూంటుంది. కానీ ఆమెకు చ్చిలేదు. ఆమె ప్రవర్తన వెనుక ఏదో గొప్ప రహస్యం దాగి ండాలి."

"ఎవరి ప్రవర్తననైనా అంచనా వేయడం మనిషి మన త్వాన్ని బట్టి మారుతూ ఉంటుంది. మీకు విచిత్రంగాతోచే మె ప్రవర్తన నాకు సామాన్యంగా తోచవచ్చు. కాబటి ఆమె పవర్తనను కాస్త వివరించ గోర్తాను—" అన్నాను.

శోభనాద్రి చేతి వాచీవంక చూసుకున్నాడు—"ఇప్పుడు మ్రు పదకొండు ఇరవై అయింది. బహుశా ఆమె ఇప్పుడు ంజనేయస్వామి కోవెల ఆవరణలో ఉండవచ్చు—" అని అతను చి నిలబడి—"దయఉంచి మీరిప్పుడు నాతో వచ్చేమాటయితే మె ప్రవర్తన ఎలాఉన్నదీ మీరే స్వయంగా చూడవచ్చు—" న్నాడు.

విసుగును ముఖంలో కనబడనివ్వకుండా ఉంచడానికిప్రయ్నిస్తూ—"ఆమె విచిత్ర ప్రవర్తనను గమనించాక నేనేం యాల్సి ఉంటుంది?" అనడిగాను.

ఇప్పుడు శోభనాద్రి ముఖం దీనంగా మారిపోయింది—"చూండి రాజుగారూ! నా భార్య అందమైనది. ఆమె మనస్సు ాపంకంటెకూడా అందమైనదని ఆమెతో నాలుగేళ్ళుగా ాపురం చేస్తున్న నాకు తెలుసు. కానీ ఇటీవల ఆమె ప్రవర్తన న్ను చాలా కలవర పెడుతోంది. ఏదో పోగొట్టుకున్నదానిలా గులుగా ఆలోచిస్తూ ఉంటుంది. ఎక్కడెక్కడికో వెళ్ళి స్తూంటుంది. ఏమి అడిగినా జవాబు చెప్పదు. నవ్వి ఊరు ంటుంది. ఆమెను నేను ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిం ాను. ఆమెలోని మార్పుకూ ఆమె విచిత్ర ప్రవర్తనకూ కార ం తెలుసుకుని ఆమెను మళ్ళీ పూర్వపు మనిషిని చెయ్యాలి.

నాకు డబ్బుకు లోటులేదు. మీ శ్రమకు విలువ కట్టలేను. కానీ మీరు కోరినంత ప్రతిఫలంగా ఇవ్వగలను.''

నేను లేచి నిలబడ్డాను.—''సరేపదండి—''అన్నాను. ఇద్దరం ఇంట్లోంచి బయటకు వచ్చాం. నేను—పనికుర్రవాడు ప్రసాద్‌తో ''—బహుశా నేను వచ్చేసరికి కాస్త ఆలస్యం కావచ్చు—'' అనిచెప్పి శోభనాద్రిని అనుసరించాను. వీధిచివర ఆగిఉన్నకారులో ఇద్దరం ఎక్కాం. శోభనాద్రి కారు డ్రైవ్ చేస్తున్నాడు. నేను దారిగమనిస్తూ ఏదో ఆలోచిస్తూ అన్యమనస్కంగా ఉన్నాను.

''వచ్చేశాం!'' అన్నాడు శోభనాద్రి. ఇద్దరమూ కారుదిగాం

అది ఆంజనేయస్వామి కోవెల. ఆ రోజు మంగళవారం కావడం కారణంగా కోవెలదగ్గర చాలా రద్దీగా ఉంది. శోభ నాద్రి నా చేయి పట్టుకుని నడుస్తున్నాడు. నేను జనాన్ని గమనిస్తున్నాను. ''అటు చూడండి—'' అన్నాడు శోభనాద్రి— చూపుడు వేలితో దూరంగా మంటపంలో కూర్చునిఉన్న ఒక స్త్రీమూర్తిని చూపించి.

నాకళ్లు జిగేల్‌మన్నాయి. ఆమె శోభనాద్రి భార్య అయి ఉంటే అతను చాలా అదృష్టవంతుడనిపించింది. అంతేకాదు శోభనాద్రి మనిషి అంతబాగుండడు. ఆమె దిగులుగా ఉండ డానికి కారణం హటాత్తుగా ఈ విషయాన్ని గుర్తించడమే మోనని కూడా నామగ బుద్ధికి తోచింది. ఆమె నీలపురంగు చీర అదేరంగు జాకెట్టు వేసుకుని ఉంది. ఆమె ముందు పువ్వులు కుప్పగా ఉన్నాయి. ఆమె మాల అల్లుతోంది. చాలా పెద్దమాల అది.

శోభనాద్రి నాచేయినొక్కాడు—''మాల కట్టడానికి తను ఇంతదూరం రావాలా చెప్పండి? పోనీ ఆ మాల దేవుడికోసమా అంటే అందుకూకాదు. ఈ క్షణంనుంచీ ఆమె ఏమి చేసేదీ

మీరు గమనించి మీ అభిప్రాయాన్ని ఈ రోజు రాత్రి 7 గంట లకు నాకు ఫోన్‌చేసిచెప్పగోర్తాను—''అంటూ శోభనాద్రి తన జేబులోంచి తన చిరునామా, టెలిఫోన్ నంబరూ ఉన్న ఒక కార్డు తీసి ఇచ్చాడు—''మీరు అన్యథా భావించనంటే మరినేనూ వెళ్ళొస్తాను—''అని నా సమాధానం కోసం ఆగకుండానే వెళ్ళి పోయాడు.

నేను అన్యథా భావించలేదు. నాకు శోభనాద్రి చాలా చక్కని పని అప్పజెప్పాడని తోస్తోంది. ఎందుకంటే ఆమెను ఒకరోజలా ఏంకర్మ—కొన్ని సంవత్సరాల తరబడి అయినా అలా చూస్తూ ఉండి పోగలను...........

# 3

ఆమె మాల కట్టడం పూర్తయింది. నెమ్మదిగా సర్దుకుని లేచి నిలబడింది. ఆమె సౌందర్యం ముఖంలో మాత్రమేకాదు. చక్కని విగ్రహం ఆమెది.

ఆమె కదిలింది—రాజహంసలా! నేనూ కదిలాను—మంత్ర ముగ్ధుడిలా!

ఆమె కోవెలలోంచి బయటకు వచ్చింది. శోభనాద్రి చెప్పి నది నిజమే! ఆమె కోవెలకు దైవదర్శనార్థంరాలేదు. కేవలం మాలకట్టడానికే వచ్చినట్లుంది. బయటకు వచ్చాక ఆమె మాలను చిన్నచిన్న తుంపులుగా చేసి కనపడ్డ చిన్నపిల్లలకు ఇచ్చి వాళ బుగ్గలు పుణకడం చేస్తూ వచ్చింది. ఆమె అలా ముందుకు కదులుతూనే ఉంది. నేనామెను అనుసరిస్తూనే ఉన్నాను.

ఆమె చేతిలో ఇప్పుడు పెద్ద మాలలేదు. కానీ ఒక మూరెడు పొడవు మాల ఉన్నట్లుంది—దానిని తన అందమైన చేతిసంచీలో సొగసు ఉటి పడేలా జారవిడిచింది.

ఆమె ఇంకా నడుస్తూనే ఉంది. నేనామెను అనుసరిస్తూనే ఉన్నాను.

ఆమె తనదారి ఒక పార్కులోకి మళ్లించింది. ఆ సమయంలో పార్కు ఇంచుమించు నిర్మానుష్యంగా ఉన్నదనే చెప్పవచ్చు. ఆమె పార్కులో ఒక మూలగా ఉన్న బెంచీమీద కూర్చుంది. చేతి సంచీలోని మాలను ఒకసారి బయటకు తీసి వాసన చూసింది. తర్వాత ఒక్క నిముషం ఏవో ఆలోచిస్తున్న దానిలా ఉండి పోయింది. ఆ తర్వాత హటాత్తుగా ముఖం రెండుచేతుల్లోనూ దాచూకుంది. ఆమె ఏడుస్తోందని నాకు అనుమానం కలిగింది. నా అనుమాన నివృతి కన్నట్లుగా ఆమె ముఖాన్ని మళ్లీ బయటకు తీసింది. దూరానికి కూడా ఆమె ముఖంమీది కన్నీటి చారికలు స్పష్టంగా కనపడుతున్నాయి. ఈ సారి ఆమె చేతి సంచీ లోంచి మాలకు బదులు రుమాలు తీసి ముఖం శుభ్రంగా తుడుచుకుని కళ్లు ఒత్తుకుంది.

ఆమె లేచి మళ్లీ కదిలింది. నేనూ కదిలాను.

ఈ సారి ఆమె సిటీ బస్సు ఎక్కింది. కొంచెం పరుగెత్తుకుంటూ వెళ్లి నేనూ అదే బస్సుఅందుకున్నాను. నేను టిక్కెట్టుబస్సు టెర్మినస్ దాకా తీసుకున్నాను— ఆమె ఎక్కడ దిగితే అక్కడే దిగే అవకాశం కోసం.

అయితే నా డబ్బులు వృధా పోలేదు. ఆమె కూడా టెర్మినస్ దగ్గర దిగింది. అక్కడ ఒక చరిత్ర ప్రసిద్ధి కెక్కిన కొండ ఉంది. ఆమె ఇప్పుడా కొండవైపే నడుస్తోంది.

ఆ కొండ ఎక్కడానికి మెట్లు ఉన్నాయి. సుమారు నాలుగు వందల మెట్లు ఎక్కితే అతి పురాతనమైన ఒక శివాలయం వస్తుంది. శివాలయం ఇంచుమించు కొండ శిఖరంపైనే ఉన్నదని చెప్పవచ్చు. అక్కడ ఆలయంలో ఏవో కొన్ని శిల్పా

శాసనాలున్నాయి. సరైన ప్రకారం లేక పోవడంవల ఆ ఆలయం కేవలం చరిత్రకారులకు మాత్రమే ఆసక్తిదాయకంగా ఉండి—యాత్రీకులను అట్టే ఆకర్షించలేక పోతోంది.

ఆమె నెమ్మదిగా వెనక్కి చూడకుండా మెట్లు ఎక్కుతోంది. మెట్లదారి మెలికలు తిరిగి ఉండడంవల్ల అప్పుడప్పుడు ఆమె నాకు కనుమరగవడం జరుగుతోంది. బహుశా అయిదవ మెలిక తిరిగాక అనుకుంటాను—ఆమె అదృశ్యమైంది.

నేను మరో పాతిక మెట్లు పైకి వెళ్ళి చూశాను. ఇప్పుడు దారి చాలా దూరంవరకూ అగపడుతోంది. ఆమె ఎక్కడా కను చూపుమేరలో లేదు. నేను మళ్ళీ మెట్లు దిగాను. ఆమె మాయమైన మెలికదారి ఎంతో పొడవులేదు. నేను ఒక పర్యాయం చుట్టూ చూశాను. మెట్లకు కుడిపక్కగా ఉన్న చెట్ల మధ్య నుంచి మనుష్యులు నడిచే దారిలాంటిది కనబడింది. ఆమె ఇంక ఎటువెళ్ళడానికీ అవకాశం లేదని నాకుతోచింది. నేనునామార్గం ఆ సన్ననిదారిలోనికి మళ్ళించాను. ఒక పదడుగులు వేశానోలేదో కొంచెందూరంగా ఆమె కనపడింది. దారికి పక్కగా ఒక చెట్టు నానుకుని కూర్చుని ఉన్నదామె. నేను ఆమెను గమనించిన క్షణంలోనే ఆమెలేచి నిలబడింది. హటాత్తుగా ఆ చెట్టును ముద్దు పెట్టుకుంది. ఆమె ప్రవర్తన నిజంగానే విచిత్రమైన దనిపించింది. ఆమె మళ్ళీ కూర్చుని ముఖం చేతులో దాచుకుని వెక్కివెక్కి ఏడవసాగింది. పార్కులో విధంగా ఆమె ఇప్పుడు నెమ్మదిగా ఏడవడం లేదు.

మళ్ళీ ఆమె ముఖం తుడుచుకుని లేచింది. నేను చెట్ల చాటుకు తప్పుకున్నాను. ఆమె మళ్ళీ కొండవైపుకు నడుస్తోంది. ఆమె నన్నుదాటి వెళ్ళాక నేను చప్పుడు కాకుండా ఆమె ఇందాక కూర్చున్న చెట్టుదగ్గరకు వెళ్ళాను. ఆ చెటుకు ఒక చిన్న

కొయ్యపలకకొ ట్టబడిఉంది. దానిమీద ఒక హంస బొమ్మ ఉంద
ఇందాక ఆమె ముద్దు పెట్టుకున్న దీ బొమ్మనేనని నాకనిపి
చింది. అదే నిజమైతే ఆమె పిచ్చిదికాదు. ఈ హంస బొమ
వెనక ఏదో విషాద గాథ ఉండి ఉండాలి. నేను ఎక్కువసే
ఆలోచించలేదు. ఆమెను జాప్యం చేయకుండా అనుసరిం
వలసి ఉందికదా!

నా అంచనా ప్రకారమే ఆమె మెట్లు దిగుతోంది.
తర్వాత బస్సు ఎక్కింది. ఎక్కడ దిగుతుందో మాత్రం నా
తెలియదు. ఎదురుచూస్తూ కూర్చున్నాను. ఆమె బీచ్‌దగ్గ
దిగింది. అక్కడనుంచి బీచ్‌వారనే నడుచుకుంటూ వెడుతోంద
అలా సుమారు ఒక మైలు దూరం ఆమె నడిచింది. అప్పుడ
ఆగింది. నేనూ ఆమె తప్ప అక్కడ మరో ప్రాణిలేదు. అక్క
కొన్ని దుంగలు పడవేసి ఉంటే నేను వాటి వెనుక కూర్చున్నాన
ఆమెకు నేను కనిపించను కానీ ఆమెను నేను గమనిస్తూ
ఉన్నాను. ఇప్పటికి ఆమె మొదటిసారిగా వెనక్కి తిరగడమనే
చేసింది. ఒక పర్యాయం చుట్టూ పరికించి ఆమె కూర్చుంద
నేను వాచీకేసి చూసుకుంటూ ఆమెను గమనిస్తున్నాను. అం
దునిముషాల అనంతరం ఆమెలేచి నిలబడి మళ్లీ ఒకసారి చుట్టూ
పరికించింది. హఠాత్తుగా సముద్రంవైపు పరుగెత్తింద
నేను కొద్ది సెకన్లపాటు మాత్రమే జాప్యం చేసి అటువై
పరుగెత్తాను. అప్పటికి ఆమె నీటిలో మునకలు వేస్తోంది.

నేనామెను ఒడ్డుకు మోసుకువచ్చి కొద్దిగా ప్రథమ చికి
చేశాను. తడిసిన బట్టలలోంచి కనపడే ఆమె ఒంపు సొంపు
నన్ను అదోలా చేశాయి. ఒక్క పిసరు ఆవేశంగా ఉన్నాను.
ప్రథమ చికిత్స ఫలించి ఆమె కన్నులు విప్పి మొట్టమొద
సారిగా నా వైపు చూసింది. ఆ చూపులో ఏ భావమూ లేద

"మీరు చనిపోవాలని ప్రయత్నించారు"—అన్నానేను.

ఆమె పెదవులు కదిలాయి. "మీరు ఆపారుకదూ" అన్నదామె.

ఆమె రూపంకంటెకూడా చక్కని దామె కంఠస్వరం అని
ంచింది. కాసేపు ఇద్దరి మధ్యా మౌనం రాజ్య మేలింది.

"నన్నెందుకు మీరు బ్రతికించడానికి ప్రయత్నం చేశారు?"
న్నదామె.

"మీ ప్రాణాల్ని తీసుకునే హక్కు మీకులేదు. ఆత్మహత్యా
యత్నం చట్టరీత్యానేరం. ఒక సామాన్య పౌరుడిగా నాకళ్ళ
ందు జరగబోతున్న నేరాన్ని ఆపాను." అన్నాన్నేను.

"ప్రాణాలంటే ఎవరికైనా తీపి ఉంటుంది. నన్ను బ్రతి
చితే అంతటితో మీ బాధ్యత తీరిపోయింది. కానీ ప్రతి
ం బ్రతకడానికి నాకు శక్తి కావాలి. అది ఎలా లభ్యమవు
ంది?" అందామె.

"మీరేదో కష్టాల్లో ఉన్నారనుకుంటాను. నన్ను మీరు
మ్మ పక్షంలో—ఎటువంటి కష్టాన్నుంచైనా మీకు విముక్తి
ించగలనని హామీ ఇస్తున్నాను."

ఆమె కనులు మెరిశాయి—"నా సమస్య మీరనుకున్నంత
భంగా పరిష్కరింపబడేదికాదు. భారత స్త్రీగా నోరు
చి బయటకు చెప్పుకోలేని సమస్య అది."

"ఫరవాలేదు. చెప్పండి—" అన్నాను కుతూహలంగా.

ఆమెకు కాస్త ఓపిక వచ్చినట్లుంది. లేచి కూర్చుంది—
ాకు వివాహమైంది. అన్ని విధాలుగా నాకోర్కెలు తీర్చగల
, అంతస్తుగల భర్త ఉన్నాడు. నామీద ఆయనకు అమిత
న ప్రేమ. కానీ అదేం దురదృష్టమో—ఎంత ప్రయత్నిం
ఆయనంటే నేను ఇష్టపడలేక పోతున్నాను. నిజం చెప్పా

లంటే నాకు ఆయనంటే అసహ్యంకూడా. ఎందుకో చెప్పలేను. ఇది నా మనసును దొలిచేస్తూ ఉంటుంది. నాకు ఈడూ జోడూగా కనబడే యువకునితో సినిమాల్లోలా షికార్లు కొడుతూ తిరగాలని ఉంటుంది. నా భర్తను మీరు చూడలేదు. ఆయన నాకు ఈడేకాని జోడుకారన్న అభిప్రాయం నాలో బాగా స్థిర పడి ఉంది—''.

''మీ సమస్య చిత్రమైనదే అయినా దీనికి పరిష్కారం చావులో మాత్రంలేదు. కొంతకాలం గడువిస్తే మీ సమస్యకు పరిష్కారం నేనే చూపగలను—'' అన్నాను నమ్మకంగా.

''అదంత సులభంకాదు. కానీ మీ మాటలు నాకు ధైర్యాన్ని స్తున్నాయి—'' అన్నదామె.

''ప్రస్తుతం ఏంచేద్దామని అనుకుంటున్నారు?'' అనడిగాను

''ఆ విషయంలో ఒక నిర్ణయానికి రానే వచ్చాను. నా ప్రాణాల్ని అంతం చేసుకోబోతోన్నట్లుగా నా భర్తకు ఉత్తరం ఇంట్లో వదిలివచ్చాను. నా ఆత్మకు శాంతి కలగడం కోసం ఏ విధమైన పోలీసు ఎంక్వయిరీలు జరిపించవద్దని అదే ఉత్తరం లో ఆయనను కోరాను. ఆయన లెక్క ప్రకారం నా జీవితం ముగిసింది. సముద్రంలోంచి బయటకు వచ్చిన క్షణంనుండీ మరొక జన్మ ఎత్తాననిపిస్తోంది. మరి ఆయనవద్దకు మాత్రం వెళ్ళను, వెళ్ళలేను. ఇప్పుడు చెప్పండి—నా సమస్యకు పరిష్కారం మీరు చూపగలరా?''

''ఇంతకీ మీ భర్తగారి చిరునామా?''

''మాదీ ఊరుకాదు. నా కోరికమీద ఆయన నన్నీ ఊరు తీసుకుని వచ్చారు. గతవారం రోజులుగా మాత్రమే నేనీ ఊళ్ళో ఉంటున్నాను. ఇంతకు మించి మరేమీ వివరాలు నన్నడగవద్దు. ఇంతకూ నా సమస్య మీవల్ల పరిష్కరింపబడుతుందా'' అన్నది

తేలనే లేదు.

"పదండి. ముందు మా ఇంటికి వెడదాం–" అన్నాను.

నేనులేచి సంకోచించకుండా నాచేయిజాపాను. ఆమె సంకోచిస్తూ నా చేయి పట్టుకుని లేచింది. ఆ స్పర్శకు నా ఒళ్ళు జలుమంది.

# 4

శోభనాద్రికి ఫోన్ చేసి వివరాలు చెప్పాను. అతను చాలా గాబరాలో ఉన్నాడు–భార్య రాసిన ఉత్తరం చదువుకుని. నేను చెప్పింది విన్నాక ఆమె బ్రతికే ఉన్నదని తెలిసి చాలా సంతోషించాడు. నేనతనికి చెప్పిన వివరాల్లో అన్నీ నిజంకాదు. ఆమె అతన్ని అసహ్యించుకుంటోదన్న విషయం అతనికి చెప్ప లేదు. ఆమెకు కొంతకాలం పాటు పాత జీవితాన్ని మరచిపోయి కొత్త జీవితం గడపాలని ఉన్నదనీ–ప్రస్తుతం ఆమె నా ఇంట్లో ఉన్నదనీ– అతనికి చెప్పాను. ఆత్మహత్యా ప్రయత్నాల నుంచి ఆమె దృషి మళ్ళించడంకోసం ఆమెకు కొంత సైకోట్రీట్ మెంట్ లాంటిది ఇప్పించవలసి ఉంటుందనీ ఆపని నావల్ల కాగలదన్న దృఢ నమ్మకంతో నేనున్నాననీ అతనికి చెప్పాను.

శోభనాద్రి జవాబు నేను జన్మలో మరచి పోలేను.

"రాజాగారూ! మీమీదనాకు పూర్తి విశ్వాసముంది. నా భార్య మామూలు మనిషై మళ్ళీ మునుపటిలా నాతో గడపదల గడంకంటె నాకింకేమీ అక్కరలేదు. ఒక వేళ ఆమె మళ్ళీ నా దగ్గరకు రాకున్నా నేను బాధపడను. ఆమె కలకాలంజీవించాలి. ఆమె జీవితంలో దిగులన్నది ఉండకూడదు."

శోభనాద్రి నా భ్యాంకు అకౌంటు నంబరు కూడా తీసు కున్నాడు.

ఒక వారం రోజుల్లో నేను శాంతను చాలా వరకూ అరం

చేసుకున్నాను. ఆమె కలిగిన కుటుంబంలోనే పుట్టింది. వివాహం గురించీ తన భర్త గురించీ ఆమె ఎన్నో రకాల రంగుల కలలు కంది. ఆమె తలిదండ్రులు ఆమె ఇష్టాయిష్టాలను విచారించకుండా శోభనాద్రి సంబంధం కుదిర్చారు. ఆ వయసుకు తగ్గ ముగ్ధత్వంతో ఆమె అవుననీ కాదనీ అనలేక పోయింది. మరి వివాహానికిముందు ఆమె ఎవరినైనా ప్రేమించిందేమో నాకు తెలియదు. కానీ శోభనాద్రి అంటే మాత్రం విపరీతమైన ఏవగింపు ఉందని గ్రహించాను.

మానసికంగా ఈ వారం రోజుల్లోనూ ఆమె నాకు చాలా దగ్గరయింది. ప్రసాద్ ఆమెను "అమ్మగారూ" అని పిలవడం కూడా మొదలు పెట్టాడు. వాడికి శాంతబాగా నచ్చింది.

శోభనాద్రి నా అకౌంటులో రెండువేల రూపాయలు జమ కట్టాడు. ఆ డబ్బు నాకు బాగానే ఉపయోగపడింది. శాంత నాచేయి పట్టుకుని షాపింగుకు వెళ్ళడానికి కుతూహలపడేది. తెలిసిన వాళ్లకు నేను ఆమె నాకు దూరపు బంధువు అనీ వరసకు మరదలు అవుతుందనే చెబుతూ ఉండేవాడిని. షాపులో శాంతకు నచ్చే చీరలు కాస్త ఖరీదైనవిగానే ఉండేవి. ఎంత ఖరీదైన చీర కొన్నప్పటికీ—ఆమె కట్టుకున్నాక మనసును డబ్బు ఖర్చయిందన్న బాధ బాధించేదికాదు.

మూడు వారాల్లో ఆమెకు నేను అరడజను చీరలు కొన్నాను. ఆరవచీర కొన్న రోజు అనుభవం ఇప్పటికీ మరచిపోలేదు.

షాపులో ఆమెకు నాలుగు చీరలు నచ్చాయి. నీలం, గులాబీ, పసుపు, ఆకుపచ్చ—వాటి రంగులు. ఇందులో ఏది తీసుకోనని ఆమె నన్ను మురిపెంగా అడిగింది "అన్నీ నచ్చినపుడు పోనీ ఆ నాలుగూ తీసుకోరాదూ?" అన్నాను నేను మనసులో కాస

బాధ పడుతూ. ఆమె అంగీకరించలేదు. "ఇందులో ఒక్కటే తీసుకుంటాను. మీకు నచ్చినది." అందామె. నేను తడబడి ఒక్క నిముషం ఆలోచించి—"గులాబీ!" అన్నాను.

షాపువాడు ముసిముసిగానవ్వి—"అమ్మగారికి నచ్చేరంగు కరక్టుగా చెప్పారు. భార్యకు ఇలా చీర ఎన్నిక చేయగల భర్తలను ఇన్నేళ్ల సర్వీసులోనూ నేను చాలా అరుదుగా చూశాను—" అన్నాడు.

శాంతకొద్దిగా సిగ్గుపడింది. ఆమె బుగ్గలు ఎరు పెక్కగా నేను ఇప్పుడే కొనా చీర ఆమె అప్పుడే కట్టేసుకుని, ముఖం ఎదికి మేలి ముసుగు వేసుకుందా అనిపించింది.

శాంత చాలా అందంగా ఉంటుంది. పరిపూర్ణ యౌవనంలో ఉంది. నేను బ్రహ్మచారిని వయసులో ఉన్నవాడిని. ఆమె ప్రస్తుతం మరదలు అన్న పేరుతో నా ఇంట్లో ఉంటోంది. వన్నీ మా ఇద్దరి అనుబంధాన్ని బాగా పెంచడమేకాక నా నిగ్రహానికీ, సచ్ఛీలతకూ ఒక విషమ పరీక్షగా కూడ ఉనాయి.

శాంత కోసం నేను ఒక లాకెట్ గొలుసుకొన్నాను. అది స్వసంపాదనగా నా డబ్బుతో నేను శాంతకోసం కొన్నది. శాంత చాలా సంబరపడింది. స్వయంగా నేనే ఆ గొలుసు ఆమె మెడలో అలంకరించాలని కోరింది. అలా చేస్తు ఏదో థ్రిల్లింగ్ అనుభవం ఫీలయ్యాను.

మరో సారి జోళ్ల షాపులో ఒక రకం జోళ్లు బాగా ఆకర్షించాయి. శాంత కాళ్లకు అవి అందాన్నిస్తాయని నాకు తోచింది. శాంత వాటిని ప్రయత్నించి చూసింది. సైజు బాగానే సరిపోయింది కానీ బొటన వ్రేలు సరిగా ఎక్కడంలేదు. "మోడల్ నాకూ నచ్చింది కానీకాలికి సూట్ కావటం లేదు" "సరి—" అందామె విచారంగా. నాకు మనసొప్పలేదు. కింద

కూర్చుని జోడును ఆమె కాలికి ఎక్కించడానికి
చాను. మెత్తని ఆమె పాదాలను అలా స్పృశించడం
ర్వానుభవం నాకు. ఆమెకు జోళ్ళు ఎక్కాయి.

"అసాధ్యులు మీరు. అనుకున్నది సాధించారు—
చిరునవ్వు నవ్వుతూ.

"ఈ జోళ్ళు మీ కాళ్ళకు అందాన్నిసా యనే అభి
ఎన్నిక చేశాను. కానీ నా అంచనా తప్పు. అందం !
జోళ్ళకు వచ్చింది—" అన్నాను. నేను మాటలన్న
గులాబీ చీర మేలి ముసుగులో ఉండడంవల్ల బ
పెక్కినదీ లేనిదీ తెలుసుకోలేక పోయాను.

రోజులు గడుస్తున్న కొద్దీ శాంత నాకు కావ
అనీ ఆమె లేకుండా నేను బ్రతకలేనేమోననీ అనిపి
ఒక నెలరోజులపాటు మేము చాలా ఉత్సాహంగా
షాపులకు వెళ్ళాం పార్కుల్లో తిరిగాం. కలిసి
చూశాం. ప్రతి అనుభవము కూడా అపూర్వమే.

మాపరిచయానికి నెలరోజుల వయసు వచ్చాక
నేను స్నానాలగదిలోంచి బయటకు వచ్చేసరికి ప్రసాద్
నిలబడిఉన్నాడు. నన్నుచూస్తూనే వాడు "సార్! అమ్మ
డికో వెళ్ళిపోయారు. నేను పిలిచినా, పలకరించినా
కూడామాట్లాడలేదు. ఆమెముఖంచూస్తూంటే నా
భయంకూడా వేసింది" అన్నాడు.

నేను కంగారు పడి ఆమె ఎటువైపువెళ్ళిందో
అన్నాను. వాడు వీధిలోనికి వచ్చినాకు దారి చూపించా
సేపు అయివుంటుంది ఆమెవెళ్ళి?" అనడిగాను మ
మీరలా స్నానాల గదిలోకి వెళ్ళడ మేమిటి—ఆమె
టకు వెళ్ళారు"—అన్నాడువాడు.

ఎన్నడు లేనిది ఈరోజు పదిహేనునిముషాలసేపు స్నానాల దిలో ఉండి పోయినందుకు నన్ను నేనే నిందించుకుని ఒకసారి ఆమె గదిలోకి వెళ్ళచూశాను. కంగారుగా తలగడాల క్రిందా క్కడా వెతికాను ఏమీ ఉత్తరాల్లేవు. గదిలోనుంచి తనచేతి సంచీ ప్పమరేమీ ఆమె బయటకు తీసుకువెళ్లినట్లు లేదు. నేను పసాద్ తో—"తలుపులు జాగ్రత్త" అనిచెప్పి వీధిలోపడ్డాను.

ఆమె కోసంఎక్కడని వెతకను? ఒకపావుగంట సేపు వీధిలో డిచాక నాకు ఏదో స్ఫురించింది. అదృష్టంబాగుంటే నాఅంచనా ప్పకూడదు. అందుకే అక్కడికే వెళ్లాను. ఆమె ఆంజనేయ స్వామి కోవెల మంటపంలో ఒకప్పుడు నేను చూసినస్థానంలోనే వే పనిచేస్తు కనపడింది. రోజూచూసే ఆమె ముఖానికీ ఈనాటి మెముఖానికీ చాలాతేడాఉంది. ఏదో పోగొట్టుకున్నదానిలా దిగు ుగా ఉన్నదామె ముఖం. ఆమెకళ్లను చూస్తూంటే గతస్మృతి గొట్టుకుందా అనిపించింది. నన్ను చూసినాగుర్తుపడుతుందన్న మ్మకంకలగలేదు నాకు అందుకుకాకపోయినా నేనామెను వెళ్లి ుకరించదలుచుకోలేదు. ఆమె ఏంచేయబోయేదీ గమనించ లుచుకున్నాను.

శాంత పెద్దమా అల్లింది. లేని నిలబడి ముందుకు కది ంది. ఇదివరకటిలాగే కొన్నితుంపులు పిల్లలకు పంచిపెట్టింది. గిలినమాలను తనచేతిసంచీలో వేసుకుంది. పార్కుకు వెళ్ళింది. ాలబెంచీలో కూర్చుంది. మాల వాసన చూసింది. ఏడ్చింది. మాలుతో కళ్ళు తుడుచుకుంది. ఆతర్వాత సిటీబస్సు ఎక్కి త్రప్రసిద్ధికెక్కిన కొండప్రాంతంలో దిగి శివాలయంవైపు ట్లుపక్కగా ఉన్నచెట్ల మధ్యదారిలో నడిచి పూర్వపు చెట్టు ముకునేకూర్చుంది. ఈపర్యాయంనేను దూరంగా ఉండలేదు మెను సమీపించాను. ఆమెనన్ను గమనించలేదు. కొది సేపు

అలా నిలబడి హటత్తుగా చెట్టుకు కొట్టబడిఉన్న కొయ్యపలక మీద హంసబొమ్మను ముద్దుపెట్టుకుంది.

"నేను ఆబొమ్మనైనా అయ్యానుకాదు—"అన్నాను గట్టిగా ఆమెఉలిక్కిపడి వెనక్కుతిరిగింది. అప్పుడే నేను ఆమె కళ్ళలోంచి బయటకు వస్తూన్న కన్నీటి ధారలను కూడా గమనించాను. ఆమె ముఖంచేతులో కప్పకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

నాకడుపులో దేలినట్లయింది. ఒకరకమైన ఆవేశంనన్నావహించింది. నేను ఆమె చుబుకాన్ని పైకిఎత్తి శాంతా! అన్నాను.

"మీరు......మీరు......నావెంటపడి ఎందు కొచ్చారు? అందామె.

నేను అనునయంగా ఆమెవంకచూసి—"మీసమస్య పరిష్కరించవలసిన బాధ్యత నాకుంది. కానీ మీసమస్యఏమిటో నాకుతెలియకుండా ఉంది. మీరు కోవెలకు వెళ్ళేదెందుకు? మాలను కట్టేదెందుకు? ఆతర్వాత కావించే విచిత్రచర్యల వెనుకఉన్న కథ ఏమిటి—వగైరా ప్రశ్నలకు సమాధానంతెలుసుకోకుండా మీసమస్యనెలా పరిష్కరించేదీ—" అన్నాను.

ఆమె అప్పటికి కాస్త తమాయించుకుంది. నావంక దీనంగా చూసి "నాచర్యల వెనుక రహస్యమేమీలేదు. అవి నాజీవితంలోని దౌర్భాగ్యత్వానికి సూచనలు. ఆంజనేయస్వామి నాఆరాధ్యదైవం ఆయనకుఅందంలేదు. పైగా బ్రహ్మచారి. పూవులు నాకు మనోల్లాసాన్నికలిగిస్తాయి. కానీనేను కట్టేమాలచిన్నపిల్లలపాలవుతుంది వయసులోని అందమైన ఆడపిల్ల ఇచ్చేమాలను ఎలా ఉపయోగించాలో చిన్నపిల్లలకు తెలియదుకదా!అటువంటి వారికేనామాల లభ్యమౌతోంది. పార్కులో నాకు లభించేదికేవలం ఒంటరితనమే ఆగుర్తింపే నాకు దుఃఖాన్ని కలిగిస్తుంది కానీ నాకన్నీటినితుడిచేదెవరు నారుమాలుతప్ప నన్నానందపరచగల ఊహాసుందరునికోసం

నేను పంపే సందేశాన్ని ఈ హంసద్వారా అందుకోగలిగినదెవరు? నాకుతెలుసు నాముద్దులు ఈహంసకేపరిమితమని—"అనిఆగింది.

నేనాలోచనలో పడ్డాను. ఈమెజీవితంపై అంతులేని అసంతృప్తితో బాధపడుతోంది. శోభనాద్రితో సంసారజీవితమే అందుకుకారణమని స్పష్టమవుతోంది. సమాజంవిధించిన కట్టుబాట్లపట్ల ఆమెకు భయమూ, గౌరవము కూడా ఉన్నాయి. శోభనాద్రికి బదులుగా భర్తస్థానంలో మరొక అందాల యువకుడు ఉండాలని ఆమెకుబాగా కోరికగా ఉంది. తనకోరిక నెరవేరుతుందన్ననమ్మకమూ, నెరవేర్చుకోగలగడానికికావలసిన ధైర్యం కూడా ఆమెకులేవు. ఫలితంగా కొన్నిసంవత్సరాల అసంతృపి ఆమెలోపేరుకుని ఇప్పటి ఈ విచిత్రప్రవర్తనకు దారితీసి ఉండవచ్చునని నాకుతోచింది. విపరీతమైన అసంతృపి తో బాధపడే వ్యక్తుల ప్రవర్తనలో కొంచెంపిచ్చిలాంటిది కనపడడం నాఅనుభవానికి సంబంధించినంతవరకు అసహజంకాదు.

నేనిప్పుడు శాంత పక్కనకూర్చున్నాను. "మీరు నాజీవితంలో ప్రవేశించి ఇంకానెలరోజులు గడిచాయో లేదో కానీ మనపరిచయం ఎన్నోజన్మలదనిపించేటంతగా దగ్గరయ్యారు మీరునాకు......"

నేనింకా ఏదోఅనబోతూండగా ఆమె అందుకుంది—"అది నిజంకాదు. మనపరిచయం ఇంకా ఒకరినొకరు మన్నించుకునేటంత దూరంలోనే ఉంది—"అని పైటచెంగుతో కనులు ఒత్తుకుంది.

ఆమాటలునాకు ఏదోధైర్యాన్ని ప్రసాదించగా ఆమెను మొట్టమొదటి సారిగా దగ్గరగాతీసుకుని కనులలోకి చూస్తూ "శాంతా అన్నాను. ఆమె అప్రయత్నంగా తనలేత పెదవులతో నాబుగ్గను స్పృశించింది .

"ఈ రోజువనం మన దూత దగ్గరకు షికారువెడదాం—"

అందిశాంత'' దూత ఎవరు? ''అన్నాను ఆశ్చర్య పడుతూ.

''ఏదీమీకు ఒపట్టాన అర్థంకాదు బాబూ''—అంది .శాంత చిరుకోపంతో

''నిజంగానేనాకు నీమాటలు అర్థంకావు అన్నాను.''

శాంత స్వరంతగ్గించి నెమ్మదిగా—''మనంప్రేమికులంకాదు, కాబోయే భార్యాభర్తలం అందుకే మీకు నేనునువ్వు నాకు మీరు అదిమన సంప్రదాయం''

కట్టుకున్న భర్తను వదిలి పెట్టి మరొక యువకుడిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్న ఆమె సంప్రదాయాలగురించి మాట్లాడుతూంటే నాకు తమాషాగా అనిపించినా పైకి ఏమీ అనలేదు. ఎందుకంటే నానుటుక్కనాకు ఆమెను వివాహంచేసుకోవాలనే ఉంది. అదినాలోని ఉదారస్వభావమో లేక ఆమె అందంనాకు కలిగించిన మైకమో చెప్పలేను.

ఇంతకీ దూతఅంటే శివాలయమున్న కొండదగ్గర మెట్ల మధ్యనుంచి పక్కదారిలోఉన్న చెట్టుమీద కొయ్యపలకపై హంస బొమ్మఅనినాకు మరో అయిదు నిముషాల తర్వాత ఆమెవివరించి చెప్పేవరకూ తెలియలేదు.

కొండదగ్గరకు బస్సులోకాక టాక్సీలో వెళ్ళాం.

ఇద్దరం జంటగాచేతులు పట్టుకుని కొండ ఎక్కుతున్నాం ఒక పాతిక మెట్లు ఎక్కాక ఆమె విసుగ్గాముఖంపెట్టి—''ఆడవాళ్ళను గజగమనలనీ, హంసగమనలనీ కవిత్వాలలో రాస్తారుకానీ మీరు నడకలలో ఆడవాళ్ళకంటె అన్యాయంబాబు''—అంది.

నాకు పౌరుషంవచ్చింది—''సరే! ఎవరు వేగంగా నడుస్తారో చూడండి అన్నాను.

ఆమె—''పందెమెందుకు? నేను ముందుగా నడిచి పదిమెట్లు వెడతాను. అప్పుడు మీరునన్ను అందుకోగలరేమో చూస్తాను

అంది.

నాకిది థ్రిలింగ్‌గా అనిపించింది. శాంతవంటి ఆడదాన్ని పరుగెత్తుకువెళ్లి పట్టుకోవడమనే ఊహేనాకు గిలిగింతలు పెట్టింది సరేవెళ్లు! "అన్నాను"

నేను ఆగాను. ఆమె ముందుకు వెళ్ళింది. నేను ఆమెపది అని అన్నప్పటికీ పట్టుదలకు మరోఅయిదారు మెట్లు ఎక్కేవరకూ ఆగాను.

శాంత పరుగెత్తడంమొదలెట్టింది.

నేనుకదిలాను ముందురెండడుగులు నెమ్మదిగా వేసి క్రమంగా వేగాన్ని పెంచుతూ పోవాలన్నది నాభిలాష. అలాగేకదిలాను.పదిహేనుమెట్లుకూడా పైకి ఎక్కిఉండను. అప్పటికే నాకదోలా అనిపించింది. మరో అయిదారుమెట్లుదాటే సరికి నేనెక్కడికో తేలిపోతు న్నట్లూ, ఏదోఅయిపోతున్నట్లు అనుభూతి చెందాను అటుపైన ఇంకేంజరుగుతున్నదీ నాకు తెలియదు. మెట్లపక్క గోడను ఊతగా తీసుకొని చతికిలపడిపోయాను.

ఎవరో నాతలపై నిమురుతున్నట్లనిపించి కళ్ళుతెరిచాను. నాతల శాంత ఒడిలో ఉంది. నేను కళ్లు విప్పడంచూసి—ఆమె "ఏమయింది?" అనడిగింది కళ్ళల్లో ఆత్రుతను వ్యక్తంచేస్తూ

"ఏమీలేదు. కొద్దిగాకళ్ళు తిరిగాయంతే!" అన్నాను.

"ఇంతవరకు బాగానే ఉన్నారు. హటాత్తుగా ఇలాఎందుకు జరిగింది?"

ఒక్కక్షణం తటపటాయించాను నేను—"బహుశా వేగంగా మెట్లుఎక్కడంవల్ల ననుకుంటాను—" అన్నాను.

"చాలా ఆశ్చర్యంగా ఉంది. మెట్లెక్కితేనే స్పృహతప్పిపోతుందా మీకు?" అన్నదామె ఆశ్చర్యంగా.

"స్పృహ తప్పడంకాదు. కళ్ళువిపరీతంగాతిరిగుతాయి. కానీ తేరుకునేందుకు ఎంతోసేపు పట్టదు" అన్నాను.

# 7

మొదటి ఆట సినిమా చూసి ఇద్దరం ఇంటికి వచ్చాం.
గాసింది తెలుగు సినిమా కావడంవల్ల కాస్త శృంగారం పాలు
క్కువగానే ఉంది.ఇంటికివచ్చి భోజనాలు చేయడం అయ్యాక
ంత నాతో నెమ్మదిగా అంది "ఈ రోజెందుకో నాకు భయంగా
ంది. మీరు నాకు సాయంగా నాగదిలోనే పడుకోరాదూ?"

నేను తల అడ్డంగా ఊపాను—"వివాహంకాని యువతీ
యువకులు ఒకే గదిలో పడుకోవడం మన సంప్రదాయం
దు."

ఆమె ముఖం అదోలా అయి పోయింది. నా వైపు అదోలా
ాస్తూ—"నాకూ సంప్రదాయాల పట్టింపు ఉంది. నన్ను
రు అపార్థం చేసుకున్నారనుకుంటాను. ఈ రోజెందుకో
ంగా నాకు భయంగా ఉంది—" అంది.

"ఎటువంటి భయం?" అన్నాన్నేను.

"ఎవరైనా నన్ను హత్య చేస్తారేమోనని!"

ఆశ్చర్యంగా ఆమె కళ్లలోకి చూస్తూ—"నిన్ను ఎవరు
దుకు హత్య చేస్తారనుకుంటున్నావో చెప్పగలవా?"

"చెప్పలేను. నిజం చెప్పాలంటే నా మనసు ఎప్పుడు ఏ
ంలో ఎలా పరుగెడుతుందో తెలుసుకోలేకుండా ఉన్నాను.
ర గాలి పటంలా ఉన్ననా జీవితానికి ఒక సరియైన ఆధారం
ంచేలోగా నా జీవితం నేనే అంతం చేసుకుంటానేమోనన్న
ంకూడా ఉంది నాకు."

నేను ప్రేమగా శాంత కనులలోకి చూశాను—"నువ్వు చెప్పి
నిజమే. నీ విషయంలో ఇంక జాప్యం చేయ కూడదు.
వ్వ వివాహితవు. నిన్ను నేను వివాహం చేసుకోడానికి చట్టరీత్యా
అడ్డంకి ఉంది. మన మిద్దరం కలిసి నీ భర్త దగ్గరకో

వెళ్ళి అతన్ని విడాకులకు ఒప్పించవచేసి అటుపైన మనం అను కున్న ప్రకారం చెయ్యవచ్చు''.

ఆమె తడ బడింది—''అవును కదూ! నేను ఇప్పటికే వివా హితను మన ఇద రికీ వివాహం జరగాలంటే నేను విడాకులు తీసుకోవాలి.'' ఒక్క క్షణం ఆగి ఆమె ''నేను నా మొదటి భర్త నుంచి విడాకులు తీసుకోవాలి. విడాకులు తీసుకోవాలి...... భారతనారి—మొదటి భర్త—విడాకులు—సంప్రదాయం—చాలా బాగుందికదూ!''

ఆమె నవ్వుతోంది కానీ ఆ నవ్వు వెనుక ఆనందం లేదు. దేని గురించో మథన పడుతున్న సమయంలో ఏడవలేక నవ్విన విధంగా ఉందానవ్వు.

నేను—''భయంగా ఉంటే నీగదిలో సాయంగా ప్రసాద్ పడుకుంటాడు—'' అన్నాను.

''వద్దు—ఎవ్వరూ వద్దు. నా కిప్పుడే భయమూ లేదు—' అందామె.

ఆమె వెళ్ళి నిద్రపోయాక నేను ప్రసాద్‌ని పిలిచి ఆమె గది తలుపుల దగ్గర మంచంవేసుకుని పడుకోమనీ గదిలో ఏమాత్రం అలికిడి వినిపించినా వచ్చి నన్ను లేపమనీ చెప్పాను.

రాత్రి రెండున్నర గంటల ప్రాంతంలో ప్రసాద్ వచ్చి నన్ను లేపాడు. ''శాంతమ్మగారి గదిలో ఏదో చప్పుడవుతోంది—'' అన్నాడు వాడు కంగారుగా.

వాడి మాటలకు నాలోని మత్తు వదిలి పోయింది. నేను లేచి వరండాలో లైటువేశాను. ఇప్పుడు గదికిటికీలోంచి శాంత కనబడుతోంది. ఆమె మంచంపీద కూర్చుని ఉంది. నన్ను చూసి లేచి నిలబడి—''మీకు నిద్రపట్టడంలేదా?'' అనడిగింది.

''ఒకసారి తలుపు తియ్యి—'' అన్నాను.

శాంత తలుపు తీసింది—"ప్రసాద్ నీగదిలో ఏదో చప్పుడవు తోందని విని కంగారుపడ్డాడు. నిద్రపట్టక చీకట్లో పచార్లు చేస్తున్నావా?" అనడిగాను.

"అంతేననుకోండి!" అందామె.

కానీ నాకు గదిలో ఒకటి రెండు మార్పులు కనబడ్డాయి. ది మధ్యలో టేబుల్ లాగబడిఉంది. దాని మీద కుర్చీ లో ఒక పెట్టి ఉంది. నేను వాటిని చూపిస్తూ—"బహుశా నిద్రపట్టక ఈ పని చేశావనుకుంటాను—" అన్నాను.

"ఊఁ" అందామె సంకోచించకుండా.

"శాంతా!" అన్నాను కాస్త తీవ్రంగా—"నీ మనసును నువ్వు ాస్త అదుపులో పెట్టుకునేందుకు ప్రయత్నించు. ఇలాంటి చ్చి పిచ్చి ప్రయత్నాలు చేయకు" అన్నాను. ఆమె ముఖం ేతుల్లో దాచుకుని అంది—"రాజా! నన్ను క్షమించండి. నాకు బతకాలనిలేదు."

"బ్రతుకంటే నీకు ఆశ కలిగిస్తాను. బ్రతుకులోని తీపి కు రుచి చూపిస్తాను. ఇప్పుడు టైము మూడు గంటలు ావస్తోంది. కొద్ది గంటలలో తెల్లవారనుంది. మనం అప్పుడు యల్దేరి నీ భర్త ఊరు వెడదాం. శోభనాద్రిని ఒప్పించగలనన్న ్ర్యం నాకుంది—" అన్నాను కాస్త ఆవేశంగానే.

ఆమె ఆశ్చర్యంగా నా ముఖంలోకి చూసి—"నా భర్త మీకు లా తెలుసు?" అంది.

నేనాలికకరుచుకున్నాను. ఆ వేశంలో నోరు జారాను. క్క క్షణం ఆలోచించాక అనుకోకుండా ఈ సమస్యకు ఒక క్కని పరిష్కారం లభించవచ్చునన్న భావం కలిగింది. ఇంక ుసుగులో గుద్దులాట ఎందుకని ఆమెకు వివరంగా మొదు ్నుంచీ జరిగినదంతా చెప్పాను. అన్నీ విన్నమీదట ఆమె షాక్

తిన్నట్లు కనిపించింది—" అయితే నా గురించిన ఈ ఏర్పాటు నా భర్త వల్లనే జరిగిందన్నమాట. అయితే మన వివాహానికి ఆయన తప్పక అంగీకరిస్తారు. తన భార్యను కేవలం ప్రేమ కారణంగా ఒక వయసులో ఉన్న బ్రహ్మచారి యువకునితో ఏకాంతవాసం చేసే పరిస్థితులు కల్పించిన ఆయన నా కోరిక ఎటువంటిదైనా సరే తప్పక తీరుస్తారు. మీరన్న విధంగానే ఈ రోజు వెళ్ళి ఆయనను కలుద్దాం!"

నన్ను ఇదే సందేహం చాలా తరచుగా పీడిస్తూ వస్తోంది. శోభనాద్రి తన భార్యను నా దగ్గర ఇంత నిస్సంకోచంగా ఎలా వదలగలిగాడు అని. అయినా మేమిద్దరం ఇన్నాళ్ల ఏకాంత వాసంలో తప్పుచేయకుండా మసిలామంటే—అతను మనుష్యుల్ని అంచనా వేయడంలో చాలా గట్టివాడనే అనుకోవాలి. అతను అంత గట్టివాడైతే తన భార్య ప్రవర్తన వెనుకనున్న రహస్యాన్నెందుకు అంచనా వేయలేక పోయాడు?

జవాబు నాకు వెంటనేతోచలేదు. కానీ ఎంతటి సమర్థుడూ కూడా తను ప్రేమించిన వారి విషయంలో తప్పటంచనాలు వేయటం సాధారణంగా జరుగుతూంటుంది.

నేను శాంతవైపు ప్రేమగా చూసి—"నీ సమస్యకు పరిష్కారం లభించడానికి ఇంక ఇరవైనాలుగు గంటల వ్యవధికూడా లేదనుకుంటాను—"అన్నాను.

టైము మూడున్నర అయినట్లుంది. గోడ గడియారం టంగున అరగంట కొట్టింది.

# 8

ఆ ఊళ్లో మేము ట్రయిన్ దిగేసరికి రాత్రి పదిన్నర గంటలయ్యింది. శాంత నాతో నెమ్మదిగా—"బండి కాస్త లేటవుతుందేమోననుకున్నాను. కానీ రైట్ టైముకేవచ్చేసింది. మనం

నా భర్త యింటికి పన్నెండు గంటల ప్రాంతంలో వెడదాము. అంతా తెలిసినవాళ్ళు—ఆ వీధిలో ఉన్నారు. నేను ఎవరికంటా పడదల్చుకోలేదు. మళ్ళీ తెల్లవారేసరికి మనం రైల్వే స్టేషనులో ఉండాలి—'' అంది.

మేము ఒక సినిమా థియేటర్‌లో దూరి సమారు ౬ గంటకుపైగా కాలక్షేపంచేసి బైటపడి శోభనాద్రి ఇంటివైపుగా శాంతకోరికపై కేవలం కాలినడకనే బైలుదేరాం. శోభనాద్రిది మూడంతస్తులమేడ. అంత మేడా కూడా ఆ క్షణంలో నిర్మానుష్యంగా ఉన్నదనడానికి సూచనగా తాళంవేసిఉంది. శాంత తన చేతిసంచీలోంచి తాళం చెవి బయటకు తీసింది. నేను విశాలమైన ఆ ఇంటి ముందు ఆవరణనూ నిశ్శబ్దమైన ఆ వాతావరణాన్నీ ఆశ్చర్యంగా గమనిస్తున్నాను. తలుపుతీస్తూ "ఈ రోజు బుధవారంకదూ! ఆయన క్లబ్బుకువెళ్ళి రాత్రి ఒంటి గంటకు వస్తారు—'' అంది.

శాంత లైటు వేసింది. చక్కని విశాలమైన నడవ అది. ధనవంతుల ఇల్లని చెప్పకనే స్పష్టమవుతోంది. ఇద్దరం వెళ్ళి చెరో కుర్చీలోనూ చతికిల బడ్డాం. నేను టైము చూసుకుని—"శోభనాద్రి రావడానికి ఇంకా నలభై నిముషాలున్నట్లుంది—'' అన్నాను.

"ఊఁ'' అందామె సాలోచనగా.

నేను కాస్త అనుమానంగా "ఇంత పెద్ద ఇంటిలో నువ్వూ, నీ భర్తా ఇద్దరే ఉంటున్నారా?'' అని అడిగాను.

శాంత నవ్వింది—"ఇక్కడి రాత్రి వాతావరణానికీ పగటి వాతావరణానికీ చాలా తేడా ఉంటుంది. ఈ ఇంటికి ఆధునికమైన అన్ని రక్షణలూ ఉన్నాయి. అయినా ఒక కాపలావాడు కూడా ఉన్నాడు వాడు సాధారణంగా కనపడడు. కానీ ఎవరైనా

కొత్తవారూ ఇంటిముందు ఒక క్షణానికి మించి నిలబడితే వాడు హటాత్తుగా ప్రత్యక్షమవుతాడు. ఉదయం ఏడుగంటలు అయ్యే సరికి ఈ ఇల్లు పనివాళ్లతో కోలాహలంగా ఉంటుంది. రాత్రి ఎనిమిది గంటలుదాటేసరికి ఈ ఇంటి యజమానీ, యజమానురాలూ మాత్రమే మిగులుతారు.''

ఆమె చెప్పిన మాటలు ఆ ఇంటిని చూస్తూంటే నాకు శాంత—తెలివి తక్కువతనంలో గొప్ప అదృష్టాన్ని చేజేతులా వదులు కోనున్నదని అనిపించింది. శాంత హోదాను తలుచుకుంటే నాకు కాస్త భయంకూడా వేసింది. కడుపులో చల్ల కదలకుండా హాయిగా రోజులు గడపడానికి సరిపడ్డ ఆస్తికి వారసుడినేఅయినప్పటికీ శాంతకు ఇంతటి హోదాను ప్రసాదించడం నావల్ల సాధ్యపడదు.

నిముషాలు గడుస్తున్నాయి. నాకు ఆదుర్దాగా ఉంది. కంగారుగా ఉంది. నా మనసు ఏదో కీడును శంకిస్తోంది.

తన భార్య ప్రవర్తనలోని పిచ్చితనానికి అర్థం విచారించి ఆమెను మళ్ళీ మమూలు మనిషిగా చేయవలసిందిగా కోరినభర్త దగ్గరకు వెళ్ళి—''నీ భార్యకు విడాకులిచ్చేయ్ ఆమెను నేను పెళ్ళి చేసుకుంటాను—'' అని చెప్పాలి. చెప్పడం నావల్ల అవుతుందా? చెప్పేక శోభనాద్రి రియాక్షన్స్ ఎలాగుంటాయి? ఒకవేళ అతనందుకు అంగీకరిస్తే భార్య భర్తలుగా సాటి బంధువులతోనూ, సమాజంలోనూ మా స్థానం ఎలా ఉంటుంది? ఎన్నోరకాల ఆలోచనలు మనసును కమ్మేస్తున్నా. వాటి బారినుంచి తాత్కాలికంగా తప్పించుకోడానికి నేను శాంత ముఖంలోకి చూశాను. ఆమె ముఖం కూడా ఆందోళనను వ్యక్తం చేస్తోంది. కొద్ది క్షణాల క్రితం ఆమెలో కనపడ్డ ఉత్సాహం ఇప్పుడు కనపడడం లేదు.

సెకండ్ల ముల్లు పరుగెడుతోంది. నిముషాల ముల్లు నడుస్తోంది. టైము పన్నెండూ నలభై అయింది శాంత చెప్పిన ప్రకారం శోభనాద్రి రావడానికి ఇంకా ఇరవై నిముషాల వ్యవధి ఉంది.

ఇరవై నిముషాలు! ముగ్గురు వ్యక్తుల జీవితాలతో ముడిపడిఉన్న ఒకే ఒక విషమసమస్యకు పరిష్కారం ఆసన్నం కావడానికి ఉన్న వ్యవధి— ఇరవై నిముషాలు!!

నేను శాంతను ఒకసారి పరీక్షగా చూశాను. ఆమె లేతనీలి రంగు చీరలో ఉంది. హటాత్తుగా నాకు గుర్తు వచ్చింది. శాంత నాకు పరిచయమైన మొదటి రోజున ఏ బట్టలు వేసుకుందో—ఏ అలంకరణలో ఉందో—ఈ రోజూ అదే విధంగా ఉంది.

"రాజూ!" అంది శాంత—"నాకేమిటో భయంగా, కలవరంగా—ఉంది. ఏం చేయాలో తోచడంలేదు. ఏ నిర్ణయం తీసుకోవాలో తేల్చుకోలేకపోతున్నాను. అన్నీ తప్పుగానే కనబడుతున్నాయి. నా వంటిదానికి ఆత్మహత్య తప్పితే గత్యంతరం లేదనిపిస్తోంది." అంటూ శాంతలేచి అటూఇటూ అసహనంగా పచార్లు చేయసాగింది.

అప్పుడు టైము సరిగ్గా చెప్పాలంటే పన్నెండూ ఏభై రెండు అయింది.

ఇప్పుడు నేను ప్రతీక్షణాన్నీ అనుభవిస్తున్నాను. అసహనంగా అన్నివైపులా చూస్తున్నాను.

"బాతురూంకి వెళ్ళివస్తాను"—అంటూ శాంత నడవలోని మెట్లవైపు కదిలింది. నేనూ ఒక్క క్షణం తటపటాయించి మెట్లవైపుకు కదిలాను—శాంత మెట్లు ఎక్కుతోంది. నేను కదిలిన చప్పుడు విన్నాక ఆమె నడకలో వేగం హెచ్చింది.

"శాంతా! ఒక్క నిముషం ఆగు!" అన్నాను.

"ఇక నన్ను మీరు ఆపలేరు రాజూ!" అంటూ శాంత పరుగెడుతూ మెట్లెక్కసాగింది. నాలో ఆ దుర్గా ఎక్కువైంది. నేను కంగారుగా ఆమెను అందుకోవడానికికని వేగంగా పరుగెట్టాను. సరిగ్గా పది మెట్లయినా ఎక్కానో లేదో కళ్ళు తిరగడం మొదలైంది. నాకు హటాత్తుగా నాలోని లోపం గుర్తుకొచ్చింది. వెంటనే వేగాన్ని తగ్గించాను. కానీ కొద్ది క్షణాల పాటు ఒక ఊతాన్నానుకుని నిలబడి విశ్రాంతి తీసుకుంటేగానీ మళ్లీ మామూలు మనిషిని కాలేక పోయాను. ఆ తర్వాత నెమ్మదిగా మెట్లు ఎక్కడానికి ప్రయత్నిస్తున్నాను. ఇంకా రెండవ అంతస్తునైనా చేరుకోకుండా నాకు "కెవ్వు"మని అరచిన పెద్ద కేక వినబడింది.

నా హృదయ చలనం స్థంభించింది. ఇన్నాళ్లుగా నేను దేనికి భయపడుతూ వస్తున్నానో—ఏది ఆపాలని ప్రయత్నిస్తున్నానో—అదే జరిగి ఉంటుందని నా బుద్ధికితోచింది. ఆ కేక వీధివైపు నుంచి వచ్చింది. మెట్లుదిగి వీధివైపు పరుగెత్తాను.

బహుశా కాపలావాడనుకుంటాను పరుగెడుతున్నాడు. నేను పరుగు ఆపి, వాడు వెడుతున్న వైపే నడిచాను. ఏ దృశ్యం నా కళ్లబడనున్నదో అని నాకు భయంగాఉంది. మరోక్షణంలో కాపలావాడికేక వినబడింది—" అయ్యో! శాంతమ్మగారిక్కడ పడి ఉన్నారు!"

నేనింకా అడుగులు వేస్తూండగానే వాడు నాకు తిరిగివస్తూ ఎదురయ్యాడు. నన్నుచూసివాడు—"ఇందాక మీరూ శాంతమ్మగారితోనే వచ్చినట్లున్నారు కదూ? ఆమెగారు ఇక్కడ రాళ్లలో పడిఉన్నారు. కొంచెం డాక్టర్ని ఫోన్‌చేసి పిలవగలరా?" అన్నాడు నా మీద ఏ విధమైన అనుమానమూ వ్యక్తపరచకుండా. నేను

నెమ్మదిగా నిర్జీవంగా అన్నాను—"ఒక్కసారి ఆమెను చూసిరాన
శాంత—ఆవరణ అందంకోసం అమర్చబడ్డ కృత్రిమమై
కొండరాళ్ళ మీద బోర్లాపడిఉంది. తల ప్రాంతంలో రక్తం బా
చిమ్మింది. నేను కళ్ళు తుడుచుకుని ఆమె కట్టుకున్న అం
మైన ఆ చీరవంక బాధగా చూశాను. అదే చీరకట్టుకుని-
ఆమె ఒక పర్యాయం ఆత్మహత్యా ప్రయత్నం చేసినప్పుడు నే
వారించగలిగాను. కానీ ఆమె జీవితం ఆ చీర కట్టుకు
ఉన్నప్పుడే నా సమక్షంలోనే ఆమె కోరిన విధంగాముగిసింది
నేను నాకున్న ఒకే ఒకలోపం కారణంగా నిస్సహాయుడ
ఆమెను ఆత్మహత్య చేసుకోనిచ్చాను.

జీవకళతో చూసిన ఆమె అందమైన ముఖంలో ప్రేతక
చూడలేననిపించి వెనక్కు తిరిగాను. నాకు శోభనాద్రి ఎద
రవుతున్నాడు. అతను నా వైపు ఆశ్చర్యంగా చూశాడు. కాప
వాడు "అయ్యగారూ! అటుచూడండి—" అని అరిచాడు
శోభనాద్రి వెళ్ళాడు. అటువైపు చూడలేక నేను ఇటుతిరిగాను
ఇంకా నేను తిరుగు తూండగానే "శాంతా!" అన్న హృదయ
విదారకమైన కేక నాకు వినిపించింది.

## ౯

అతి విచిత్రంగా నా జీవితంలో అడుగు పెట్టిన శాం
మొత్తానికి విచిత్ర పరిస్థితులలో ఈ లోకం వదిలి వెళ్ళి
యింది. నావటుక్కు నాకు ఆమె మరణానికి కారణం తన
భారతదేశంలో పుట్టడమేననిపించింది. భర్త బతికి ఉండగ
తనకుతానుగా విడాకులు తీసుకుని మరో వివాహం చేసుకునే
దుకు భారత స్త్రీగా ఆమె సిద్ధపడలేక పోయింది. మొత్తాని
ఏమైతేనేం ఆమె శోభనాద్రిభార్యగానే మరణించింది. ఆమెన
ఆత్మహత్యనుండి తప్పించాలనే నేను ఆమె జీవితంలోకి ప్ర

శించాను. ఆ రోజు ఆ క్షణంలో ఆ విధంగా ఆమె ఆత్మహత్య కు ప్రయత్నిస్తుందన్న విషయం నా ఊహకు ఏ మాత్రంఅంది ఉన్నప్పటికీ నేనామెను రక్షించుకోగలిగి ఉండేవాడిని. చిట్ట చివ రకు ఆమెది హత్యకాదనీ ఆత్మహత్య అనీ పోలీసులు నిర్ణయిం చడానికి నా వాఙ్మూలమే ఆధారం కావలసిన పరిస్థితిలో ఆమె మరణం సంభవించింది.

ఎంతటి కష్టమైనా కాల ప్రవాహంలో కొట్టుకుపోతుంది. శాంత మరణం సంభవించి అప్పుడే రెండునెలలు కావస్తోంది. నేనామెను క్రమంగా మరచి పోగలుగుతున్నాను. శాంత మరణిం చినందుకు నిరుత్సాహపడ్డ ప్రసాద్‌కూడా ఇప్పుడామె ప్రసక్తి ఎత్తేనావద్ద తీసుకుర్రావడంలేదు.

అర్జంటుపనిమీద రైలు ప్రయాణం చేస్తున్నాను. ప్రయాణ ములో కొంచెం బోరుగానే ఉంది. రకరకాల వ్యక్తులూ రకరకాల సొదలు. నేను ప్రయత్నించినా నిద్రనాదరికి రావడంలేదు. ఏ దైనా పత్రిక చదవాలన్నా దృష్టి కేంద్రీకరించలేక పోతున్నాను. ఆ సమయంలో హటాత్తుగా నా కెంతో పరిచయమైనదని ంచే ఒక కంఠం వినిపించింది. ఉలిక్కిపడ్డాను. సాధారణంగా ఒక పర్యాయం విన్న కంఠస్వరాన్ని నేను మరచిపోలేను. కానీ ఈ కంఠం ఫలానావారిదని వెంటనే పోల్చుకోలేక పోతున్నాను. ందుకే ఆ వ్యక్తిని చూడాలనిపించింది. నెమ్మదిగా బెర్తుదిగి కిందకు వెళ్ళాను. అప్పుడు నాకు నేను ఆ కంఠస్వరాన్ని ంటనే పోల్చుకోలేక పోవడానికి కారణం గ్రహించాను. నేనే ందు. ఎవరైనా ఊహించలేరనుకుంటాను. నాకళ్ళముందు ురణించిన వ్యక్తి మాట మళ్ళీ వినగలనని అనుకోగలనా?

సందేహంలేదు. ఆమె తప్పక శాంతే అయిఉండాలి. నాకళ్ళు న్ను మోసం చేయగలవేమోకానీ నా చెవులు నన్నెప్పుడూ

మోసం చేయవన్నది నా నమ్మకం. అయితే ఇదేలా సాధ్యం?

నేనామెను కాస్త పరీక్షించి చూడడం ఆరంభించేసరికి అంత వరకూ పక్కనున్న స్త్రీతో చకచకా కబుర్లు చెబుతున్న ఆమె కాస్త తడబడ్డట్లు కనబడింది.

"నమస్తే" అన్నాను.

ఆమెకూడా ఇబ్బందిగా "నమస్తే!"అని—"మీరెవరో గుర్తించలేకుండా ఉన్నాను—" అంది.

ఆమెవద్ద చనువును వ్యక్తపరచడానికి నాకు కాస్త సంకోచంగానేఉంది. ముఖంలో అన్నీ శాంతపోలికలే కనబడుతున్నా—కట్టూ, బొట్టూ, తీరుతెన్నులలో—శాంతకు, ఆమెకూ—చాలా భేదముంది—" మీకుశాంత తెలుసా?" అనడిగాను.

"శాంతా? ఆమె ఎవరు?" అందామె ఆశ్చర్యంగా.

ఆ మాటలు వింటూంటే ఆమే తప్పక శాంత అయి ఉండాలని నాకు బాగా అనిపిస్తోంది. కానీ ఎక్కడా అందుకు అవకాశం కనబడ్డంలేదు. నేను సూటిగా ఆమె వైపుచూస్తూ—"శాంత అంటే అచ్చం మీకులాగే ఉంటుంది. బహుశా మీరే ననుకుంటాను—" అన్నాను.

ఆమె బాగా తడబడింది—"ఏమో నాకు ఆ శాంతాతేలీదు, .మీరూతేలీదు—" అంది విసుగును అభినయిస్తూ.

ఈ సారి నేను కాస్త సీరియస్‌గా ముఖంపెట్టి—"మీరు తప్పక నాతో వచ్చి కొన్ని ప్రశ్నలకు సమాధానం ఇచ్చుకోవలసి ఉంటుంది. మీరందుకు అంగీరించని పక్షంలో నెక్స్టు స్టేషన్లో పోలీసుల సహాయంతో నేననుకున్నది సాధించగలను—"అన్నాను.

ఈ పర్యాయం మా సంభాషణ చుట్టూ ఉన్నవారిని కూడా ఆకర్షించింది. ఆమె కాస్త కంగారును ప్రదర్శిస్తూ—""ఎవరు మీరు? నన్నెందుకిలా వేధించదల్చుకున్నారు?"

"నా పేరు రాజు. చాలామంది నన్ను డిటెక్టివ్ రాజనికూడా
ంటారు. ఒక విచిత్రమైన పోలీసు కేసు విషయంలో మిమ్మ
్నకొన్ని ప్రశ్నలడగవలసి ఉంది. అందుకే నాతో రమ్మంటు
్షిను—"అన్నాను.

# 10

"అరే! శాంతమ్మగారు" అన్నాడు ప్రసాద్.

"వీడెవరో మీకు తెలుసా?" అనడిగాను.

"బహుశా మీ ఇంట్లో పని కుర్రవాడనుకుంటాను—"
ందామె.

నేను అసహనంగా పళ్ళు పిండుకున్నాను. ఆమె శాంతయేనవి
ణ క్షణానికీ నాకు బాధ అవుతోంది. అదే నిజమైతే ఏదో
ద మిస్టరీ ఉంది. అది నేను సాధించాలంటే ఈమెను కూడా
ధించాలి—ఎలాగో అలా తనే శాంత అని ఆమెచేతచెప్పించాలి.

ఆమెను పూర్వం శాంత ఉండేగదిలోనికి తీసుకువెళ్ళాను.
క్కడ పెట్టెలోనుంచి శాంత ఒదిలివెళ్ళిన లాకెట్ గొలుసు
ి—"ఇది శాంతకోసమని నేను కొన్నది. మొదటిసారి ఈ
లుసు నేను తెచ్చినపుడు ఆమె స్వయంగా నన్నే అలంకరించ
ంది—" అని నేనామెను సమీపించి ఆమె మెడలో ఆ గొలుసు
ంకరించాను. ఆమె వణుకుతోంది.

"మీ పేరు శాంతకాదు. అయినా కొంతకాలంపాటు మిమ్మ
'శాంతా' అనే పిలుస్తాను—శాంత నాతో ఏమందోతెలుసా—
వం కాబోయే భార్యా భర్తలం. అందుకే మీకు నేను నువ్వు
కు మీరు మీరు—' అంది. అందుకే నేను మిమ్మల్ని నువ్వు
ేపిలుస్తాను." అన్నాను. గద్గద మవుతున్న నా గొంతును
ువు చేసుకునేందుకు ప్రయత్నిస్తూ—"శాంతా! నువ్వు నాతో
పినది కేవలం నెలరోజులు మాత్రమే అయినా నన్ను

పూర్తిగా నీవాకిని చేసుకున్నావు. నేను నిన్ను గుర్తు పట్టాను. అందుకే పోలీసుల పేరుతో భయపెట్టి నా దగ్గరకు తీసుకొచ్చాను. నా కళ్లముందు జరిగిన నీ ఆత్మహత్య వెనుక ఏ రహస్యమైనాఉండనీ అదేమిటని నేను నిన్నడగను. కానీ శాంతను కాదని మాత్రం అని నా గుండెలు బ్రద్దలు చేయకు—" అంటూ నేనామెను ఆవేశంగా దగ్గరగా తీసుకున్నాను.

"వదలండి" అంటూ ఆమె నన్ను విదిలించుకుంది.

"నేను నిన్ను వదలను. నువ్వు నన్ను వదిలించుకుందుకు ప్రయత్నిస్తే పోలీసుల సహాయం నా కుండనేఉంది—"అన్నాను.

పెనుగులాడ బోయిన ఆమె ఆగిపోయింది. పోలీసులంటే ఈమె భయపడుతోందన్న విషయం నాకు ట్రయినులోనే స్పష్టమయింది. ఏ నేరమూ చెయ్యకపోతే తనే ధైర్యంగా పోలీస్ స్టేషనుకు రాగలిగి ఉండేదికదా!

# 11

శాంత పెట్టిలోంచి నేనామెకనికొన్న గులాబీ చీర తీశాను. ఒక చిన్న కాగితం సంచీలో దానిని పెట్టి "నాతోపద" అన్నానామెతో.

ఇద్దరం చేయీ చేయీ పట్టుకుని ఒక బట్టల షాపులోనికి వెళ్ళాం. నేను కావాలనే కొంచెం ఆమెకు వెనుక బడ్డాను. ఆమె అప్రయత్నంగా షాపులో ఇదివరకు మేమువెళ్లే చోటుకు దారితీసింది. షాపువాడామెను గుర్తుపట్టి "నమస్కారం అమ్మగారూ!" అన్నాడు. నేను కాస్తముందుకు వెళ్ళి కాగితం సంచీలోంచి చీర బయటకు తీశాను—"ఇలాంటిదే మరో చీర కావాలి—" అన్నాను.

షాపువాడు చీరనందుకుని పరీక్షగా చూసి—"ఇది మీరు అమ్మగారికని ముచ్చటపడి మా షాపులోనే కొన్నారు. మీ ఎన్ని

కను నేను మెచ్చుకున్నాను. కూడా. ఇప్పుడు ఇంకా మంచి మోడల్సు వచ్చాయి: ఒకలాంటివే రెండెందుకు? మరొక కొత్త డిజైను చూపిస్తానుండండి.—''అన్నాడు.

షాపువాడిదగ్గర ఈ చీరలేదని నాకర్థమైంది—''ఇది అమ్మ గారికికాదు. నా చెల్లెలికోసం కొందామని వచ్చాను. మీ దగ్గర ఉంటే ఇలాంటిదే మరో చీర కావాలినాకు—'' అన్నాను.

షాపువాడి దగ్గర ఆ చీరెలు మరిలేవని తెలిశాక నేనామెను తీసుకొని జోళ్ల షాపుకు వెళ్లాను. అక్కడ ఇదివరకటిలాంటి జోళ్లజతను ఆమెకు ఎన్నిక చేశాను. జోళ్లామెకాలికి ఎక్క లేదు. నేను పూర్వపు విధంగానే ప్రయత్నించి ఆమెకాలికి జోళ్ళు సరిపడేలా చేయగలిగాను. అంతసేపూ ఆమె ఇబ్బందిగానే ప్రయత్నించి ఆమెకాలికి జోళ్లు సరిపడేలా చేయగలిగాను. అంతసేపూ ఆమె ఇబ్బందిగానే ఉంది.

నేనామెను అంజనేయస్వామి కోవెలకూ, పార్కుకూ, చరిత్ర ప్రసిద్ధి కెక్కినకొండ దగ్గరకూ తీసుకు వెళ్ళాను. ఆమెకా ప్రదేశాలన్నీ తెలిసినవేనని నేనూహించగలిగాను. కానీ విచిత్ర మేమిటంటే పూర్వం ఉండేచోట హంసబొమ్మ ఉన్న ఆ కొయ్యా పలకలేదు!

నేనామెతో అన్నాను—''నిన్ను అందరూ శాంతగా గుర్తి స్తున్నారు. నువ్వు నిజంగా శాంతవే!''

ఆమె నవ్వి—''పోనీ నేను శాంతనే అనుకోండి. అందువల్ల నాకు వచ్చిన ఇబ్బంది ఏమీలేదు. కానీ నేను శాంతను కాదనీ జ్యోతిననీ నేను ఏకంటెబాగా ఋజువుచేసి నిరూపించగలను. మీరు నాతో మా ఊరికి వస్తారా?'' అంది.

''నువ్వు చెప్పేదీ నీ ఊరుకావచ్చు. నువ్వంటూన్నదే నీ పేరు కావచ్చు. కానీ నీదంటున్న ఊరిలోనే నంటున్న పేరుతో ఉండే

ఒక అమ్మాయి నెల రోజులపాటు అక్కడ లేదనీ ఇక్కడనాతో వుందన్న నిజం బహుశా నేనూ రుజువు చేయగలనను కుంటాను'' అన్నాను.

ఆమెకు భయం వేస్తున్నట్లు ముఖం పెట్టింది—'' మీ రెందుకు నన్ను వేధిస్తున్నారో నా కర్థం కావడంలేదు. నా అందాన్ని చూసి భ్రమపడినన్నిలా బెదిరించి లొంగదీసుకుందా మని అనుకునే పక్షంలో నేను ఏ బెదరింపూ అవసరంలేకుండానే లొంగిపోయేటంత అందం మీకుంది. మిమ్మల్ని వివాహం చేసు కునేటందుకు నాకభ్యంతరం ఉంటుందని అనుకోవడం కేవలం మీ తెలివితక్కువే.''

''కావచ్చు. కానీ నాకు కావలసింది జ్యోతికాదు. శాంత! నువ్వు శాంతవా? జ్యోతివా? లేక ఇద్దరూ ఒకటేనా? అన్నది నాకు తెలియాలి. అప్పుడే వివాహంగురించి నేనాలోచించగలుగు తాను—''అన్నాను.

ఆమె మాట్లాడలేదు. ఏమిటో ఆలోచిస్తోంది.

నెమ్మదిగా ఇంటికి బయలు దేరాం.

## 12

''ఈ రోజు మనం మన దూత దగ్గరికి వెడదాం—'' అన్నాను.

''సరే! మీరు ఎక్కడికంటే అక్కడికే'' అందామె.

నేనేమీ వివరించలేదు. ఇద్దరం మళ్ళీ ఆకొండ దగ్గరకు బయల్దేరాం. ఆమె నన్ను ఏమీ ప్రశ్నించలేదు. నేను మాత్రం అప్రమత్తుడినై ఆమె ప్రతికదలికమా గమనిస్తూ వెడుతున్నా ము. ఆమె వేగంగా మెట్లెక్కడానికి ప్రయత్నిస్తున్నట్లుగా నాకు తోచి నేనామెనడుంచుట్టూ చేతులు పోనిచ్చి గట్టిగా పట్టుకునే ఉన్నాను—''ఇలా పైకి వెడుతూంటే చాలా బాగుం

టుందికదూ!'' అన్నాను.

ఆమెకు నచ్చలేదని నేనూహించగలను. నా బారినుండి తప్పించుకోడానికి ఈ మెట్లెక్కడమే సదవకాశమని ఆమెకు తెలిసేఉండాలి. అందుకే నేను పూర్తి జాగ్రత్తలో ఉన్నాను. ఆమెకు నన్ను వదలించుకునే అవకాశం రావడంలేదు. ఇద్దరం మెట్లెక్కుతున్నాం. క్రమంగా నడుస్తూ మేము హంసబొమ్మ ఉండే పక్కదారిని పట్టించుకోకుండా పైకే వెడుతున్నాం. ఆమె ఆ ప్రాంతంలో ఒకసారి ఆగి ఏదో అడగబోయి మానేసింది. మొదటిసారిగా మేము అంతకు మించి కొండపైకి వెళ్ళడం చేస్తున్నాం.

మేమిద్దరం మెట్లెక్కుతూనే ఉన్నాం. చాలావరకూ పైకి వచ్చాక ఒక చదునైన ప్రాంతంలో ఆమె —''ఇంక నడవలేకుండా ఉన్నాను. ఒక క్షణం విశ్రాంతి కావాలి—'' అని ఆగిపోయింది. అంతవరకూ నా చేయి ఆమె నడుం చుట్టూ ఉంది. అప్పుడే ఆమె రెండుచేతులూ నా నడుంచుట్టూ పెనవేసుకున్నాయి. రెప్పపాటు క్షణంలో ఆమె నా పెదవులమీద బలంగా ముద్దు పెట్టుకుంది.

ఆ అనుభవం మరువలేను. నాతనువల్లా పులకరింతకలిగింది. తియ్యటి ఆ ముద్దు మరోసారి కావాలనిపించి నేను నా రెండు చేతులతో ఆమెను బలంగా కౌగలించుకుని విపరీతమైన ఆవేశపు బలంతో ముద్దు పెట్టుకున్నాను.

ఒక్క క్షణం నన్ను మత్తు ఆవహించింది. నా చేతి పట్టు సడలింది. అంతే! ఆమె నన్ను విదిలించుకుని మెట్లపైకి పరుగెట్టింది. నేను త్వరగా అడుగులువేసి చేయిజాపి ఆమెజడను అందుకుని లాగ గలిగాను. ఫలితంగా ఆమె నామీద పడింది. వెంటనే ఆమె చేయిగట్టిగా పట్టుకుని—''నా పేరు రాజా.

అంతా నన్ను డిటెక్టివ్ రాజంటూరు. నన్ను మోసగించి పారిపోవడం నువ్వనుకున్నంత సులభంకాదు. ఇప్పుడు చెప్పు—ఎవరు నువ్వు? నా జీవితంలో ఎందుకు ప్రవేశించావు? శోభ నాద్రికీ నీకూ సంబంధమేమిటి?'' అన్నాను.

''మీరడిగే ప్రశ్నలకు వేటికీ కూడా నా దగ్గర సమాధానం లేదు—'' అందామె పెంకిగా.

నేను వికటంగా నవ్వాను—''నాకిప్పుడు జరిగినదంతా తెలిసి పోయింది. ఒక్కసారి నీ నోట విని ధృవపర్చుకోవాలని ఉంది నువ్వు శోభనాద్రి భార్యవుకాదు ఆ రోజు రాత్రి మనం శోభ నాద్రి ఇంటికి వెళ్ళినప్పుడు ఏం జరిగిందో ఇప్పుడు నేను నీక చెబుతాను. నాతో సహకరిస్తే నీకు శిక్ష తగ్గుతుంది. అబద్ధ మాడ్డానికి ప్రయత్నిస్తే నేను నిన్ను పోలీసుల పరం చేయవలసి ఉంటుంది. నిజం చెప్పించడానికి పోలీసుల వలంభించే పద్ధతుల గురించి వినే ఉంటావు. నావంటి వాడి దగ్గర నిజం ఒప్పు కుంటే నీకాశ్రమ తప్పుతుంది.''

ఆమెలో కలవరం కనబడింది. ''నిజం చెబుతాను—'' అం దామె. ''నన్ను శోభనాద్రి తన భార్యగా మీ దగ్గర నటించ వలసిందిగా చెప్పాడు. అందుకు నాకు డబ్బు బాగాముట్టింది—'

నేను మొదలెట్టాను. ''ఆ రోజు రాత్రి నువ్వు బాతురూం వంకతో మెట్లెక్కబోయావు. ఇలా—''అంటూ ఆమె చెయ్యి పట్టుకుని నేను మెట్లెక్కసాగాను. ''అప్పుడు నేను నీవెంట బడ్డాను. అయితే నువ్వు పరుగెట్టావు—''అంటూ ఆమెచేయి వదిలాను. ఆమె పైకి పరుగెత్తింది. నేను వెనకాలే నెమ్మదిగ అనుసరించసాగాను. ఆమె కొండపైకి చేరుకుంది. నేను ఒక నిముషం వ్యవధిలో ఆమెను చేరుకున్నాను. నన్ను తప్పించుకు పోవడానికి ఆమె ఇక ప్రయత్నించదని నాకు రూఢీఅయింది.

"చెప్పు. అప్పుడేం జరిగింది?" అన్నాను.

ఆమె తటపటాయిస్తోంది. నేనామెను మళ్లీ చేయి పట్టు
ని ఆలయం ఆవరణ చుట్టూ ఉన్న పిట్టగోడ దగ్గరకు
మెను నడిపించాను. రెండు చేతులతో ఆమెను నడుమువద్ద
ట్టుకొని పైకెత్తి ఆ పిట్టగోడపై నిలబెట్టాను. "చెప్పు ఆ
జు రాత్రి మేడమీద ఏం జరిగింది?"

ఆమె నిలువెల్లా వణికిపోతోంది—"నేను పైకి వేల్లేసరికి
భద్రాది మేడ టెర్రేస్‌మీద పిట్టగోడపై తన భార్యను
వే విధంగా నిలబెట్టి సిద్ధంగా ఉన్నాడు. మాట్లాడడానికి
ల్లేకుండా ఆమె నోరు నొక్కేశాడు. నన్ను చూడగానే ఆయన
న భార్యను క్రిందకు తోసేశాడు. ఇదీ జరిగినది. మీకు నేను
ంతా నిజమే చెప్పాను. నన్ను మీరే రక్షించాలి. డబ్బుకు ఆశ
డి ఒక వ్యక్తికి ఒక నిండుప్రాణాన్ని హత్య చేయడానికి సహక
ంచాను......" అని ఆమె ఏడుస్తూ నా పాదాల మీద పడి
యింది.

—అయిపోయింది—

(ఈ కథ హిచ్ కాక్ చిత్రం 'వెర్టిగో' ఆధారం)

# ఖైదీ సీరియల్ పన్నెండవ భాగము

నాగరిక ప్రపంచంలోకూడా అవే జరుగుతున్నాయి. అక్క
కన్నా అర్థంలేని, అన్యాయమైన అడ్డుగోడలు మనిషి మనిషి
మధ్య పెరుగుతూనే వున్నాయి.

అందరం గూడెం చేరుకొనేసరికి మునిమాపు చీకటిపడింద

ఆ రాత్రికి విందు చేసుకుందామని సూచించాడు నాయకుడ
విందుమాట వినగానేఉప్పొంగి పోయారు సంతోషంతో జ
మంతా. మామూలుగా రోజూవాళ్ళుమాంసం తినరనీ, విందు
చేసుకున్నప్పుడు మాత్రమే తింటారని తర్వాత తెలుసుకున్నాన

అంతకు ముందులాగానే నాయకుడి గుడిసె ముందున్న ఖా
స్థలంలో పెద్దమంట వేశారు. చంపివుంచిన నాలుగైదు అడ
పందుల్ని తెచ్చి అందులో పడేసి కాల్చసాగారు. మాంసం మం
ల కుడుకుతుంటే ఒక రకమైన వింత వాసన బయలుదేరింద

నాయకుడూ నేనూ మందుసీసాలు ముందెట్టుకున్నా
కార్కులు తీసి తాగడం మొదలెట్టాం.

"మమ్మల్ని చూస్తే మీకేమనిపిస్తుంది?" అడిగాడత
యధాలాపంగా.

"ఏమీ అనిపించడంలేదు. భయంకరమైన వ్యక్తులని మొద
ట్లో భయపడ్డాను. దగ్గరయ్యాక మీ ఆప్యాయత, ఆదరణ
చూసి ముగ్ధుణ్ణయి పోయాను." మనసులోమాట చెప్పాను.

"నీ స్నేహితం దొరకడం మా అదృష్టంగా, మాదేవతే
నిన్ను కావాలని ఇక్కడకు పిల్చుకొచ్చినట్లుగా మేము భావిస్తు
న్నాము." అన్నాడు నాయకుడు.

"ఎందుకని?"

"మేము సముద్రంపైన దొంగతనాలు చేస్తాం.అదే మమ్మ
ల్ని చావకుండా బతికిస్తున్నాయి. మాభాష వాళ్లకు తెలీదు.
వాళ్ల గొడవ మాకు అర్థంగాదు. అందువల్ల అవనసరంగానే
నా వాళ్ళు, చాలామందిని కత్తులతో పొడిచి చంపివేయడం
జరుగుతుంది. రక్తంచూస్తే నాకు ఏవగింపు. కానీ ఏంచెయ్యనూ
తోచక గుడ్లప్పగించి చూస్తూంటాను. మేము దొంగలమనీ,
మాకు కావలిసిన వస్తువులిస్తే వాళ్లను ఏమీచెయ్యమని, అర్థ
మయ్యేలా చెప్పాలని నాకనిపిస్తూ వుంటుంది. కానీ ప్రయోజనం
లేదు," అన్నాడు అతను సీసా నోటికెత్తుతూ.

"నన్నేం చెయ్యమంటావ్?" అడిగాను నేను.

"నీకు వాళ్ళ భాష తెలుసు. అది కాస్త నాకు నేర్పు. చాలు.
అనవసరమైన రక్తపాతం తప్పించిన వాడివవుతావు." అన్నాడు.

"దానికన్నా నన్నుకూడా నీతో తీసుకెళ్ళు. మీ తరఫున
వాళ్లతో నేను మాట్లాడుతాను. యీ సమస్య సులభంగా తీరి
పోతుంది."

"నువ్వు ఎన్నాళ్ళుంటావ్ మాతో. త్వరలో ఈ అడవీ,
మమ్మూ, విసుగుపుట్టిస్తాయి. అప్పుడు వెళ్లిపోతావ్. అందువల్ల
లాగైనా నాకు నీ భాష నేర్పాలి. మా భాష నువ్వు నేర్చు
కున్నావ్ సులభంగా. కాస్త కష్టపడైనా నేర్చుకుంటాను.

మీ భాష!'' అన్నాడు నాయకుడు.

''అలాగే నేర్పుతాను.'' అన్నాను.

ఆ రాత్రి హాయిగా మాంసంతిన్నాం. కొంత మాంసాన్ని, మద్యాన్ని ఒక మనిషిద్వారా ఆడవాళ్ల మకాంకు పంపారు.

రాత్రి ప్రొద్దు పోయిందాకా అరుస్తూ, గెంతుతూ, అల్లరి చేస్తూ వుండిపోయారు. మేమిద్దరం కూర్చుని చూడసాగాం.

''ఇంక నిద్ర పోదామా?'' అడిగాడు నాయకుడు.

తలూపాను.

అతను అందర్నీ వాళ్లవాళ్ల గుడిసెలకు వెళ్లిపొమ్మని ఆజ్ఞాపించాడు. వెంటనే అంతా వెళ్లిపోయారు. నేనుకూడా నా గూడు చేరుకున్నాను. కొంత పచ్చిగడ్డి వుండలా చుట్టి తలక్రింద పెట్టుకున్నాను దిండులా. మేనువాల్చాను.

డెల్లా కళ్లముందు మెదలినట్లయింది.

ఆమెను కలుసుకుని, అడవి మనుషులకు నేను ఆత్మీయుణ్నయినాననీ వాళ్ళ భాష కూడా క్షుణ్ణంగా నేర్చుకున్నానని, మన ప్రాణాలకు ఏ విధమైన భయం లేదని చెప్పాలన్న ఆతృత కలిగింది.

కానీ అవకాశం పున్నమి రాత్రినాడు కానిరాదు. అందాకా ఇలా ఆమెకు దూరంగావుండి తీరవలసిందే. నాయకుడి అనుమతి లేనిదే ఒక్క మగ పురుగుకూడా ఆడవాళ్ళుండే గుడిసెల వైపుకు వెళ్ళకూడదు. వెళ్లినట్లు తెలిస్తే, తలక్రిందులుగా చెట్టుకు వ్రేలాడ గడతారు ఒక్కరోజంతా.

మరుసటి దినమే నాయకుడికి చదువు చెప్పడం ప్రారంభించాను. ఇంగ్లీషు అక్షరాలు పలకడం అతికష్టంగా వుందతనికి అయినా పట్టుదలతో ప్రయత్నించడం మొదలెట్టాడు. అలాగే ఒపిగ్గా నేర్చుకుంటే నెలరోజుల్లో అతనికవసరమయినంత

మటుకూ ఇంగ్లీషు భాష నేర్వగలనని తోచింది.

పున్నమి రాత్రి వచ్చింది.

గూడెంలో వున్న జనానికంతా ఉత్సాహంగా వుంది.

గుంపంతా మా గూడెంకు అరమైలు దూరంలోవున్న పెద చెరువుకేసి నడిచింది మధ్యాహ్నం ప్రాంతంలో.

నాయకుణ్ణడిగాను వాళ్ళెక్కడకు పోతున్నారని. నెలకొక్క రోజే వాళ్ళ స్నానాలు చేస్తారట. అదీపున్నమినాడు మాత్రమే.

''మనంకూడా వెళ్దామన్నాడు'' నాయకుడు.

''సరే!''నని నేనూ బయలు దేరాను.

మేము అక్కడికి వెళ్ళేసరికి మా జనమంతా చెరువులో దిగి వున్నారు. నీళ్లన్నీ కలగాపులగ మైనాయి. మనుషులు స్నానం చేస్తున్నట్లు తోచలేదునాకు. మదమెక్కిన అడవి ఏనుగు లునీళ్ళలో దిగి, చేసే రభసలాతోచింది.

నేనూ నాయకుడు స్నానానికి సిద్ధమైనాం.

మేము నీళ్లల్లో దిగడం గమనించి గుంపంతా ఒక వైపు కు వెళ్లి పోయింది. నలుగురైదురుగు మాత్రం మా వేపు వచ్చారు.

నాయకుడికీ, నాకూ ఒళ్లంతా చేతులతో తోమారు అర గంటసేపు. ఆ తర్వాత వెళ్లి మిగిలినవాళ్లతో కలసిపోయారు.

ఆడవాళ్ళు కూడా బహుశా ఈరోజే స్నానం చేస్తారని పించింది. అడుగుదామనుకున్నాను. నా ప్రశ్నను అపార్థం చేసుకుంటారేమోనన్న అనుమానంతో మానేశాను.

అందరం తిరిగి గూడెం వచ్చేసరికి చీకటి పడింది.

తిండీ తిప్పలు ముగించుకొన్నారంతా వెంటనే.

గుంపంతా తప్పెట్లు మ్రోగించుకుంటూ కదిలింది. నేనూ నాయకుడు అందరికన్నా ముందున్నాం.

ఆడ వాళ్లున్న గూడెంకు మైలు దూరం పోయి, ఆగాం
దినిటీలు వెలిగించారు. పట్టపగలులా తయారు చేశారు.

మేము వెళ్లిన అరగంటకు ఆడగుంపు వచ్చింది. వాళ్లల
డెల్లాకోసంవెతికాను. అందరికన్నా వెనుకగా వుంది ఆమె.

నాయకున్ని అడిగాను నేను డెల్లాను కలుసుకోవచ్చాని
అతనునిరభ్యంతంగా వెళ్లి కలుసుకోమన్నాడు. మాకోస
క్రొత్తగా వేయించిన గుడిసె సంగతికూడా చెప్పాడు.

వాళ్లకు దూరంగా వచ్చి నిలుచున్నాను. డెల్లాను రమ్మ
చెయ్యి చూపాను. ఆమె పరుగు పరుగున వచ్చింది. నా దగ్గరక
రావడం నా గుండెలపైని తల ఆనించుతూ భోరుమ
ఏడిచింది. ఆమె వీపురాస్తూ, ఒదారుస్తూ, ధైర్యంగా వుం
మని చెప్పాను.

"ఎక్కైనా వెళ్దాం!" అంది డెల్లా.

"అలాగే! ఈ తమాషా కూడా చూసిపోదాం!" అన్నాను.

"తమాషా ఏమిటి?" అర్ధంగాక అడిగింది.

"ఇన్ని వందల మంది మగాళ్లకు, ఉన్నది ఇరవై మం
స్త్రీలు. వాళ్లను ఈ రాత్రికి ఎవరు అనుభవించాల
నిర్ణయించేందుకు ఒ ఆట ఆడతారట. అది చూదాం.'
అన్నాను.

డెల్లాకు ఆ మాట వినగానే ఉత్సాహం కలిగింది.

ఆడవాళ్లకేసి చూశాను. అందరూ పొడుగ్గా, సన్నగా
రివటల్లా వున్నారు. రకరకాల ఆకులు కట్టుకున్నారు. నగలు
వేసుకున్నారు. తలలు తైలసంస్కారం లేక చింపిరి
జుట్టుతో వున్నా చాలా అందంగా కనుపించారు వాళ్లు.

అందరూ కళ్లకు గంతలు కట్టుకున్నారు.

తప్పెట్లు పెద్దగా మ్రోగడం మొదలెట్టాయి.

ఆడవాళ్ళు పరుగెత్తడం ప్రారంభించారు. మగవాళ్ళుకూడా వాళ్ళకు చిక్కకుండా పరుగెత్తడం మొదలెట్టారు. అందరితో పాటు వాళ్ల నాయకుడు కూడా పరుగెత్త సాగాడు.

అలా పదిహేను నిముషాలకు పైనే గడచింది ఆట. చివరకు ఆడవాళ్లందరూ తలకొకర్ని చిక్కించుకున్నారు.

నాయకుడు కూడా ఒక ఆడమనిషికి చిక్కడి పోయాడు.

మా కందరికీ వీడ్కోలిచ్చి మిగిలిన గుంపంతా గూడెం వేపు వెళ్లిపోయింది. మా జంటలన్నీ ఆడవాళ్ల గూడెం వేపు కదలి పోయారు.

డెల్లా కోసం క్రొత్తగా నిర్మించిన చిన్న గుడిసెలోకి దూరాను నేను. నా వెనుకే ఆమె కూడా వచ్చింది.

ఆమెను ఘట్టిగా కౌగలించుకున్నాను. ఆమెకూడా అదిమి పట్టుకుంది. "విశేషాలు చెప్పు!" అంది నన్ను వదలించుకుని.

అంతదాకా జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాను.

నేను చెప్పడం ముగించగానే "అయితే నువ్వు వీళ్లల్లో కలసి పోయినట్లేనా?" అడిగింది.

"నీ కెందుకా అనుమానం వచ్చింది?" అడిగాను.

"ఇంతసేపు వాళ్ల మంచితనం, ఆప్యాయత, ఆదరణ పొగ డుతూ చెప్పావు తప్ప, ఇక్కడ్నుంచి తప్పించుకుని పోయేందుకు నువ్వు ఆలోచించిన మార్గంకానీ, వేసిన పథకంగానీ చెప్పలేదు. అంటే బహుశా ఇక్కడేవీళ్లతో వుండిపోవాలని తీర్మానించు కున్నానేమోననిపించింది." అంది డెల్లా.

"నీకు ఇక్కడుండడం ఇష్టంలేదా?" అడిగాను.

"నాకే కాదు. మనలా పెరిగిన వాళ్ళెవ్వరూ వుండరు. ఆడదాన్నయి చిక్కడం అన్యాయం ఇరవై నాలుగు గంటలూ ఆ గుడిసెలో పడివుండాల్సిందే తప్ప వేరేపనిలేదు. మిగిలిన

వాళ్ళు ఏమోమో చేస్తుంటారు. నన్ను పిలవరు. మాట్లాడేం దుకు భాష రాదు. మనసు విప్పుకునేందుకు మనిషి తోడులేదు. నిన్ను నీవు ఆ పరిస్థితుల్లో వున్నట్లు ఊహించుకొని ఆలో చించుకో! నా బాధ అర్థమవుతుంది'' అంది డెల్లాచిరుకోపం చిందిస్తూ.

''వీళ్ళు అడవి మనుషులు. వీళ్లను మంచితో లోగొట్టు కొని మనపని జరుపుకోవాలితప్ప, ఎదురు తిరిగి లాభం లేదు. భుజబలం, మూక బలం మాత్రమే కాకుండా మంత్ర తంత్రాలు కూడా తెలుసు. తప్పించుకు పోవడం చాలా కష్టం. కొన్నాళ్ళ పాటు ఇక్కడేవుందాం. సమయం చూసి చెక్కేద్దాం!'' అన్నాను.

''ఆ సమయం ఆసన్నమ యేందుకు నెలలు పడుతుందో, ఏళ్ళు పడుతుందో? అంతదాకా నేను ఇలా నీకు దూరంగా వుండలేను. కనీసం కలసివుండే ఏర్పాటయినా చెయ్యి. కాస్త ధైర్యంగా వుంటుంది. నాకు పిచ్చెక్కకుండా వుంటుంది.'' అంది డెల్లా.

''నాయకుడు చాలా మంచివాడు. వివరంగా చెప్పి అతన్నె లాగైనా మనిద్దరం కలసి వుండేందుకు ఒప్పించ గలనన్న నమ్మ కం నాకుంది. నువ్వు అధైర్యపడకు!'' అన్నాను ధైర్యం చెప్తూ.

ఆ తర్వాత అందాకా మేము అనుభవించిన కష్టాలు, చవి చూచిన ఆనందాలు, పొందిన వింత అనుభవాలు నెమరు వేసు కున్నాం చాలాసేపు.

రాత్రి సగం గడచి పోయింది. కొయ్యలతో కిటికీలా అమ ర్చిన దాంట్లోంచి వెలుపలి ప్రకృతిని చూశాను. వెన్నెల్లో తలము నకలుగా తడిసి ఆహ్లాదంగావుంది. పెద్ద పెద్ద చెట్లతో పాటు చిన్న చిన్న పొదలుకూడా మత్తుగా నిద్రపోతున్నట్లున్నాయి.

"ఇంక పడుకుందామా?" అడిగాను డెల్లాను.

ఆమె తలూపింది.

ఇద్దరం నేలమీద ఒకరినానుకొని ఒకరం పడుకున్నాం.

తెల్లా వారేదాకా గడచిన ప్రతిక్షణం మాకు తెలీకుండా ముందుకు జరగలేదు.

బాగా వెలుతురొచ్చింది. బాకాలు ఊదారు. మగవాళ్లంతా వెలుపలి కొచ్చారు. నేను డెల్లాదగ్గర సెలవు తీసుకొని వాళ్లను కలుసుకున్నాను.

మగ వాళ్లందరం మవునంగా నడచి గూడెం చేరుకున్నాం.

ఎవరి గుడిసెలకు వాళ్లు వెళ్లిపోయారు

నాయకుడు కూడా దోవలో నాతో మాట్లాడలేదు.

మధ్యాహ్నం భోజనాలయాక నాయకుడి వెంట వెళ్లాను అతని నివాసానికి. ఇద్దరం మందు పట్టించాం మళ్ళీ.

"నీ పెట్టను కలుసుకున్నావుగా? ఏమంటుంది? ఇక్కడ జీవితం ఎలా వుందంటుంది?" అడిగాడు నాయకుడు.

అంతకు ముందు రాత్రి చెప్పిందంతా చెప్పాను. వింటూ ఆలోచనలో మునిగి పోయాడు.

"మీరిద్దరూ కలిసి వున్నందువల్ల మాకు కలిగే నష్టం లేదు. కానీమాజాతి నియమాలు వేరు. మాగూడెంలో వుండ దలచుకుంటే మా పద్ధతులకు తలొంచి తీరాలి. వీట్ని మార్చే అధికారం, బలం, నాయకుడ్ని అయినంత మాత్రాన నాకున్నా యనుకోవద్దు." అన్నాడతను అసహాయంగా.

"అలాగైతే మమ్మల్ని వదిలెయ్. ఎటైనా వెళ్లిపోతాం!" అన్నాను. తలెత్తి నాకేసి నిశితంగా చూశాడు.

"ఆమె నన్ను నమ్ముకుంది. క్షేమంగా ఆమె దేశానికి ఆమెను చేరుస్తానని మాటిచ్చాను. నా కోసం ప్రాణాలకు తెగించి

ఎన్నో సాహసాలు చేసింది. చావుకు భయ పడటం మాని చాలా రోజులయింది. తన్నిలా దూరంగా వుంచావన్నా దిగులుతో పిచ్చి పట్టితల పగుల గొట్టుకొని ఛస్తానంటుంది. నా పరిస్థితి కూడా కాస్త ఆలోచించు'' అన్నాను దీనంగా.

నాయకుడు నా మాటలు విని మాట్లాడకుండా మవునంగా త్రాగుతూ కూర్చున్నాడు. నేను త్రాగడం మానేశాను.

''కొంత వ్యవధి కావాలి. ఆలోచించి ఏదన్నా చేస్తాను. అందాకా ఒపిక పట్టు.'' అన్నాడు.

ఆ రాత్రికి గూడెంలో పెద్ద సమావేశం ఏర్పాటైంది. ఎత్తయిన ఆసనం మీద కూర్చున్నాడు నాయకుడు, అతని ముందు నేలపయిన గూడెంలోని జనమంతా కూర్చున్నారు.

ఏకబిగిన గంటసేపు ఉపన్యాసం చెప్పినట్లు చెప్పాడు. నాదీ. డెల్లాదీ చరిత్ర. ఆ తర్వాత మేమిరువరం, రోజా కలసి వుండా లని కోరిన కోరిక చెప్పాడు. ఆ కోరిక మన్నించ డానికి అడ్డొచ్చే నియమాలు, చిక్కులు విప్పి చెప్పాడు.

అందరూ వింటూ తలూపారు.

నావల్ల, నాయకుడిగా తనకూ, గుంపు మొత్తానికీ జరగ బోయే ఉపకారాలను ఒక్కొక్కటే వివరించి చెప్పాడు.

అంతా చెప్పి ''మీరందరూ ఇష్టపడితే మన గూడెంకు దూరంగా, వాళ్లకు మకాం ఏర్పాటు చేయిస్తాను. దూరంగా వుండే మనకు సాయం చేసేలా చూస్తాము.'' అన్నాడు అతను.

అందరూ ఎదురు మాట చెప్పకుండా నాయకుడి నిర్ణ యాన్ని ముక్త కంఠంలో బలపరచారు.

నా విషయాల్లో అతను అంత శ్రద్ధ తీసుకున్నందుకు ఎంతో ఆనందం కలిగింది.

అతనిది నిజమైన ప్రజా స్వామ్య పరిపాలన లాగా తోచింది.

అందరూ వెళ్ళిపోయారు.

నేను కృతజ్ఞతా పూర్వకంగా నాయకుడి చెయ్యి తీసుకుని నా చేతుల మధ్య పెట్టుకొని నొక్కాను.

అతని కళ్లల్లో ఆనందం మెరసింది.

"ధైర్యంగా వుండు" ఇక్కడికి నాలుగు మైళ్ల దూరంలో, మీకు మకాం ఏర్పాటు చేస్తాను. ఏలోటు లేకుండా వుండే ట్లుగా చూస్తాను. అక్కడ నువ్వూ, ఆమె ఆనందంగా వుండండి. ఏ పరిస్థితుల్లోను నన్ను మోసంచేసి తప్పించుకొని పోయే ప్రయత్నం మాత్రం చెయ్యవద్దు. అలాంటిదే జరిగితే మిమ్మల్నిద్దరినీ నిర్దాక్షిణ్యంగా చంపమంటుంది మా నియమం." అన్నాడు నాయకుడు.

"అలా ఎప్పటికీ జరగదు." అన్నాను.

"నువ్వు రోజూ వచ్చి మీ భాష మాత్రం నేర్చి పోవాలి. నాకవసరమైనపుడల్లా సాయం చెయ్యాలి.!"

"అలాగే!"

మాకు మకాం ఏర్పాటు చేసేందుకు రెండ్రోజులు పట్టింది నాయకుడికి. అడవిలో ఆకులుతెచ్చి మా గుడిసె పైన కప్పి వేశారు. డెల్లా, నేనూ, మా కిచ్చిన గుడిసె ప్రవేశించాం.

మేము తప్పించుకుని పోకుండా వుండేందుకు కూడా నాయకుడు తగిన కట్టుదిట్టాలు చేశాడు. మా గుడిసెకు దగ్గర్లోనున్న పెద్ద చెట్టుపైన ఇరవై నాలుగు గంటలు ఇద్దరు మనుషులు, మమ్మల్ని కాపలా కాస్తూ వుండడం గమనించాను.

నాతో నాలుగు విస్కీ సీసాలు, కొన్ని వెదురుబియ్యం, తేనే మొదలైనవి తెచ్చాను.

"ఎలా వుంది మన బంగళా" అడిగాను డెల్లాను.

"బ్రహ్మాండంగావుంది!" అంది డెల్లా.

"భోజనం".

"అదీ బాగుంది!" అంది.

మనం అస్తమానం గుడిసెలోనే పడివుంటే బోర్ కొడుతుంది. పగటిపూట అలా అడవంతా తిరుగుదాం. రాత్రిళ్ళు పడుకుని హాయిగా నిద్రపోదాం. ఏమంటావ్?" అడిగాను.

"అలాగే! నీ యిష్టం!" అంది డెల్లా.

మొదటి రెండు రోజులూ, గుడిసెముందున్న చెట్లు, తుప్పలూ పొదలు, తీసేసి శుభ్రం చేసుకునే పనిలో పడ్డాం. కాలం ఎలా గడచి పోయిందో కూడా తేలీలేదు. నాకు ఆ రెండు రోజులు.

రాత్రి కాకముందే గూడెంకి చేరుకుని, పిచ్చాపాటి కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపేవాళ్లం.

పదిహేను రోజులదాకా, నాదిన చర్యలో, ఏ విధమైన మార్పు లేకుండానే జరిగి పోయింది.

ఆ రోజు మామూలుగా గూడెంకు వెళ్లాను. నన్ను చూడగానే నాయకుడు హుషారుగా నవ్వాడు. అతనికి చాలా ఇంగ్లీషు మాటలు వచ్చేశాయి. అతను భాష మాట్లాడుతూంటే, ప్రక్కనున్న జనం విని వింతగా చూసి నవ్వేవారు.

ఎదురుగా వెళ్లి కూర్చున్నాను అతని ముందు. విస్కీ తాగుతున్నాడు. త్రాగ మన్నట్లు సీసా నా ముందుకు తోశాడు. నేను దాన్ని అందుకుని "ఏమిటి విశేషాలు" అడిగాను.

"ఈ రాత్రికి మనం సముద్రంపైకి పోవాల్సి వుంటుంది." అన్నాడు.

"ఏదైనా షిప్ వస్తుందా?" అడిగాను.

"ఆ! వస్తుందని వార్త వచ్చింది." అన్నాడు నాయకుడు. అలాంటి వార్తలు ఎవరు తెస్తారో, ఎలా వస్తాయో నాకు

ర్థం కాలేదు.

"ఎవరు చెప్పారు?" అడిగాను.

"ఇక్కడికి చాలా దూరంలో మరోదీవి వుంది. అక్కడ
గా మనుషులున్నారు. సముద్రంలో పెద్ద చేప కనుపించ
నే, ఒక పక్షి కాళ్లకు ఎర్ర ఆకులు కట్టి వదుల్తారు. అది
వ్వున వచ్చేస్తుంది. దాని రాకేమాకు గుర్తు." అన్నాడు.

"ఆ పక్షి వచ్చిందా?"

"ఆఁ! ఇంతకు ముందే వచ్చింది. ఆ ప్రాంతాన్నించి మా
విపైపు వచ్చేందుకు ఒక్క రోజు పడుతుంది. అంటే
ఈ రాత్రికి అది వచ్చి తీరాలి" అన్నాడు.

"రాత్రికి వెళ్ళేందుకు ఏర్పాట్లు చేస్తున్నారా?"

"ఆఁ! ఈ దినం చదువు వద్దు, అన్ని విషయాలు స్వయ
ంగా చూసుకోవటం అవసరం."

"అవును. అదీ నిజమే. సంగతి ఏమిటి నాదగ్గర ఆయు
ధాలేమి లేవు."

"మేము ఇంతకుముందు దొంగిలించి తెచ్చాం కొన్ని, వాట్ని
పయోగించే విధానం బహుశా నీకు తెలిసి వుంటుంది.
వ్వు వాట్ని చూసి కావాల్సింది ఏరుకో. మాకు మామూలుగా
ండే ఆయుధాలున్నాయి." అన్నాడు నాయకుడు.

దొంగతవాల్లో తెచ్చిన సామానంతా వేసివున్న గదిలోకి
ళ్లి రెండు తుపాకులు, మందు సామగ్రి తెచ్చుకున్నాము.

చీకటి పడ్డాక గూడెంకు రమ్మన్నాడు. నాయకుడు. అలాగే
స్తానని చెప్పి, బయలుదేరాను నామకొంకు.

తుపాకుల్ని చూడంగానే డెల్లాకు సంతోషం కలిగింది.

"ఎలా తెచ్చావ్?" అడిగింది నన్ను.

వివరంగా విషయం చెప్పాను. (సశేషం)

